# కోహినూరు

చిల్లరిగె శ్రీనివాసరావు బి. ఏ.




సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# ఉపక్రమణిక

## ౧

రాజస్థానమున నేడు వేటపండుగ. ప్రతి దినము జనకోలాహలపూర్ణమగు రాజనగరము నేడు జనశూన్యము. రాజమార్గమున బాటసారు లెవ్వరును లేరు. రాజధాని నిశ్శబ్దమై యుండెను. ఆబాలగోపాలమును గిరికందరములకును శైలశిఖరములకును మెకముల వెంబడించి పోయిరి. ఇండ్లవంక నింతవరకెవ్వరును ముఖములుత్రిప్పి యుండలేదు. సామాన్యముగ ప్రతిదినమును సాయంకాలసమయమున రాజనముద్రమను పేరునఁ బరగు పెద్ద చెఱువు కట్టమీఁద జనులు గుంపులు గుంపులుగా గూడుచుండెడివారు ఈ నా డచ్చటెవ్వరును లేరు. కేవల మా చెఱువు ప్రక్క నున్న విష్ణుమందిరము యొక్క ద్వారప్రదేశమున శిశిరమథిత పద్మిని చందమున శుభ్రవసనయు అలులాయితకుంతలయు నగు నొక్కవితంతు నారీమణి పువ్వులను బిల్వపత్రమందు బెట్టుకొని చేతులు జోడించి శిరము వంచి కన్నులరమోడ్చి, దీనస్వరమున భగవంతునిఁగూర్చి మొఱవెట్టుచుండెను. ఆమె కనతి దూరమున శుక్లపక్ష దశమీతిథి నాటి చంద్రరేఖను బోలి అపూర్ణ కళాశోభితయై పదియేండ్ల బాలిక కుసుమస్తబకభారనమ్రయగు కింశుకభూరుహము క్రింద నిలిచి కన్నులు పైకెత్తి చూచుచుండెను.

ఆ సమయమున నొక్క పదునైదేండ్ల ప్రాయముగల బాలకుఁడా చెఱువు కట్టమీఁదకు వచ్చి నిలిచెను. బాలకుని యొడలంతయు నెందులకో రక్తసిక్తమై యుండెను. వాని నడుమునుండి యొక దీర్ఘకరవాలము ప్రేలాడుచుండెను. వాడు రెండు చేతులలోను రెండుచక్కని

శకుంతములను బట్టుకొని ఒడలిమీది రక్తమును గడగి కొనుటకు చెఱువులోని కున్న మెట్లమీదకు పోయి నిలిచి యుండెను. కాని చేతులలోని పక్షులను భద్రపరుచుటెట్లు? వదలి పెట్టినఁ బక్షులు పాఱిపోయి మరల వనముల దూరును గదా! కింశుక వృక్షము క్రిందనున్న బాలిక వాని కంటబడినది. అంత వాఁడా పిల్ల యొద్ద కరిగి—'నీ వెవరమ్మాయి? ఇక్కడ నొంటరిగ నిలిచి ఆకాశమువంక చూచుచుంటి వేల?

బాలిక ఒక యెత్తైన కొమ్మవంక వ్రేలుతోఁ జూపి,—'అదుగో చూడు, ఎంత పెద్ద చక్కటిపువ్వులగుత్తో?' అనెను.

బాల—ఏమి నీ కాపువ్వులు కావలెనా?

బాలి—కావలసిన నెట్లు రాగలవు? చాల పైనున్నవి

బాలకుడు (నవ్వి)—ఎత్తైన పువ్వులెవ్వరును కోయ్యజాల రను కొంటివా! నీ వీ రెండుపక్షులను జేతులతో గట్టిగాఁ బట్టుకొమ్ము. నే నిప్పుడే చెట్టెక్కి నీ కాపువ్వులు కోసి తెచ్చి యిచ్చెదను.

బాలిక రెండు పక్షులను జేతులతో తొందరతొందరగఁ బట్టుకొని ఆ చెట్టువంకనే చూచుచు—'ఒడలిని ముండ్లు గుచ్చుకుంటవి పదిలము!' అనుచుండెను.

బాలకుడు—ముండ్లు గుచ్చుకుంటవని భయపడి రాజపుత్రుఁడు పండుకొనుకొనుట మానునా? ఇదుగో చూడు. ఈ రోజు నేనుకూడ కొండ మీదకు వేటాడ వెళ్లియున్నాను. నన్ను కుఱ్ఱవాడవని అంద ఱును వెనుక యుండుమని బోధించిరి. ఒక యేదుపంది సోలంకి సేనా పతి విక్రమసింహుని కెదురైనది. ఆయన పాపము! వేటచే నలసి యున్నాడు. ఆ పంది ఆయన గుండెలలో కోరలతోఁ గొట్టుటకు సిద్ధముగా నున్నది. నే నాసంగతిఁ గనిపెట్టి వెంటనే కత్తి చేతఁబట్టు కొని వెనుకనుండి ఒక్క దుముకునబోయి సేనాపతి కడ్డముగా నిలువ

బడితిని. ఇదుగో చూడు. నా ఛాతీమీద పందికోరల పోటులు ——
ఇంకను రక్తము కారుచున్నది. నే నేమైన ఝుడిసితినా? తరువాత
నా పక్షులను బట్టుకొనుట కడవిలోనికి చొఱబడితిని. అచ్చటకూడ
ఇదుగో చూడు. నా యొడలిపై నెన్నిముండ్లు గుచ్చుకున్నవో. అట్టి
స్థితిలో నే నీపువ్వులు కోయుటకు ఝుడియుదునా?

బాలిక పువ్వులపై ప్రసన్న దృష్టిని చూచుచున్నదిగాని అంతరంగ
మున పిల్లవానికి ముండ్లు గుచ్చుకొనునేమోయని భయపడుచున్నది.
అందుచే నా చిన్నది కొంచెము యోచించి తన కపోలముపై త్రోసు
కొని వచ్చు నలకరాశి నావలకుఁ ద్రోయుచు—'మీకు ముండ్లు
గుచ్చుకొనిన నా దోషము లేదు' అని మృదుస్వరమునఁ బల్కెను

ఆ బాలిక యో యెంతసుందరమో మా టంతమధురము. బాల
కుని కాసంగతి విశదమాయెను. ఇంకను సూర్యుడ స్తంగతుఁడు కాలే
దని ఈవఱకే చెప్పియుంటిమి. ఇప్పుడు వ్రాలుచున్న రవి యొసంగు
నీరెండచాయ లాబాలికయొక్క బాలేందువదనముపై పడి యింకను
దాని నుజ్జ్వలము గావించుచుండెను.

లోకమనోమోహనంబగు సుధాంశు మండల సమాచారములఁగూర్చి
చకోరదపంతు లాకాశమున విహరించుచు, సరసల్లాపంబులాడు
కొనుచుండెను. రాజసముద్రమందలి వీచీపరంపరలు శుద్ధనిర్మలమర్మర
సోపానంబుల నింకను బరిశుద్ధంబుగావించుచు ప్రేమఫలకాంకురము
లతో నృత్య మాడుచుండెను. మందసమీరవారము లు నవనవతరంగ
ముల గాగలించుకొనుటచే లోనితాపంబులవారించుకొని నిశాకన్యను
దోడితెచ్చుటకు పరువు లెత్తుచుండెను. నెలనెలబోవు గగనరంగము
యొక్క పూర్వాంచలంబున నొకటి రెండు నక్షత్ర రత్నంబులు
మెరయఁదొడఁగెను. తన్మధ్యమునుండి సుధాంశుఁ డాశాభయంబు
లతో మో మెత్తిఁ జూచుచుండెను.

బాలకుఁ డొక్కసారి నలుదిక్కులు చూచి మరల బాలిక యొక్క చంచలహరిణవీక్షణంబుల వంకఁ దిరిగి,— నీకొఱకు పూలుగోయు సమయమున నీ చెట్లు ముండ్లన్నియు నాగుండెకు గుచ్చుకొనిన నాకు నీపై కోపము వచ్చునా?' అని నుడివెను.

బాలకు డామాట చెప్పి కంటకమయవృక్షముపై నెక్కెను. ఈ సమయమున నా బాలికచేతిలోని ఒక పక్షి పట్టు తప్పించుకొని పాఱిపోయెను. ఆబాలకుడు పువ్వులుగోసి క్రిందకు వచ్చి— 'చేతిలోని పక్షి నెందుకు వదలి పెట్టితివి' అని ప్రశ్నించెను.

బాలిక—నే వదలి పెట్టితినా?

బాలకుడు—నీవు వదలి పెట్టకపోయిన నెట్లు పాఱిపోయినది?

బాలిక—నేను మీ వైపుచూచుచున్నాను. ఇట్లే పట్టుకున్నాను. అయ్యో! ఇది కూడా ఎగిరిపోయినది!

బాలిక చేతినుండి రెండవ పక్షికూడ పాఱిపోయెను. కాని బాలకుడు శాంతము వీడలేదు. బాలిక లజ్జచేతను విచారము చేతను విన్నఁబోయెను. అది చూచి బాలకుఁడు, 'ఇవిగో పువ్వులు తీసుకొమ్ము. నేను మరల నడవికి పోయి నాపక్షులను బట్టి తెచ్చుకొందును. నీ విక్కడే యొక్కింతసే పుండెదవా?'' అనెను.

బాలకుడు తిరిగి యడవి దెస కరిగెను.

మందిరద్వారమున నంతవఱకు కూర్చుండి పూజసేయుచున్న వితంతుయువతి తన పూజను సమాప్తము చేసుకొనెను. పిమ్మట బాలిక యొద్దకరిగి ముద్దాడి యిట్లనెను—'బిడ్డా, పద సాయంతనమైనది. రాణావారు తిరిగి వచ్చు సమయమైనది.,

ఆమె పిల్లను చంక నెత్తుకొని వెడలెను. కొంత దూరమేగి తల్లి "అమ్మా! ఎందుకు తిరిగి తిరిగి కొండదిక్కుకు చూచుచున్నావు." అని అడిగెను.

బాలిక కన్నులనీరు నింపుచు 'ఎచ్చట చూచుచుంటినమ్మా! వారింకను తిరిగిరా లేదా?' అనెను.

౨

ఒకనాఁడు బాగుగ నుక్కవేయుచున్నది. పగలు రెండు ఝాములైనది ఉదయపూరు రాజ ప్రాసాదమున మహారాజా జయసింహావల్లభుని పట్టపురాణి కర్ణావతి మోమునవిచారము ప్రేలుచుండ తలవంచుకొని పాన్పుపై గూర్చుండి యుండెను. కొన్ని దినములనుండి యామె హృదయమున శాంతి మాయమై పోయెను. ఆమె కుమారుఁడు పదునైదేండ్లవాఁడు అమరసింహుఁడు ఇప్పటికి రెండు నెలలక్రింద వేటపండుగ నైన దినమున కొండమీఁది యడవులందు మృగయావినోదము సల్పి వచ్చియుండెను. నాటినుండియు రాజకుమారుఁడు ఎప్పుడును ఒంటరిగ విచారమున మునింగి యుండుచుండెను. వేళకు భోజనము సేయుట లేదు. ఎవ్వరితోడను పూర్వమువలె ముచ్చటలాడుటలేదు. అప్పుడప్పుడు అర్ధరాత్రివేళ రాజసముద్రతీరమున నొక్కఁడును పోయి కూర్చుండి యేమియో చింతించుచుండెను. ఎవ్వరైనను బ్రశ్నించిన తిన్నఁగ జవాబియ్యఁడు. ఈ రెండు నెలలనుండియు నెన్నెన్ని విధములఁ బ్రయత్నించినను ఎందరెందరు వైద్యులకు చూపించినను రాజమహిషి పుత్రుని మనోరోగమును మాన్పలేకపోయెను.

దేవీ కర్ణావతి ప్రక్క మఱియొక శయ్యాపై చిన్న రాజమహిషి కమలాదేవి అద్దము నెదుటఁ బెట్టుకొని తల దువ్వుకొనుచున్నది. మధ్యమధ్య తన కోమల కంఠస్వరముతో మాటలాడుచు మెల్ల మెల్లగ నేమియో చిన్నచిన్న పాటలు పాడుచున్నది. ఇతిహాసజ్ఞులగు పాఠకు

లీమె ప్రమరరాజవంశసంభూతియనియు మంచి స్వాభిమానముగల రాణి' యని ప్రసిద్ధి యితిహాసరంగమునఁ బొందినదనియు జ్ఞాపకముంచుకొనియే యుందురు. కమలాదేవి కేశములు ముడిచికొని అద్దమునందు తన తాంబూలరాగరంజితాధర ప్రతిబింబమును జూచుకొనుచు కర్ణావతి దిక్కు తిరిగి ఇట్లనెను.—'అక్కా! మీ రెవరి మాటను వినరు, మీకు తోచినట్లు చేయుదురు. ఏమి లాభము! నా మాట వినినయెడల నీ చింత దీరిపోవును.''

కర్ణ—చెల్లీ, నీ సలహాఏమో చెప్పు.

కమ—విను నెడల చెప్పెదను—లేనియెడల వ్యర్థముగ నరణ్యరోదనముసేసిన ఫలమేమి?

కర్ణ—చెల్లీ, ఎందుకువినను! అమరుఁడు నా కెట్టివాఁడో నీకును నట్టివాఁడే. నా కడుపునఁ బుట్టినంతమాత్రమున నా కెక్కువనియెన్నడైన నంటినా? నీవు మాత్ర మన్యథా చూచుచుంటివా?

కమ—నే నన్యథా చూచుటలేదు. నిజమే—కాని లోకుల కాసంగతి తెలియునా? సరే మంచిది. నేచెప్పున దిది. పిల్లవానికిక వెంటనే వివాహము చేయవలెను. ఆలస్యముచేయఁగూడదు. నే నారోజు వానిని చాలవఱకు తఱచిచూచితిని. అందుమీద నా కిట్లు తెలియవచ్చినది. ఒకనాడు రాజసముద్రతీరమున నొక్క సుందరబాలిక నాతఁడు చూచినాడట. అటుపిమ్మట మరల నా బాలిక నాతని కన్నులఁ బడలేదని యతని మనస్సు కలతనొందుచున్నది. కాబట్టి యతని కెవ్వరిదైన మంచి సుందరమైనబాలిక నిచ్చి వివాహము చేసినయెడల యతని పిచ్చకుదిరిపోవునని నా విశ్వాసము.

కర్ణావతి ఆశ్చర్యము నభినయించుచు, "వివాహము చేసినంత మాత్రమున నిమ్మళించునెడల నింత యాలోచన కావలెనా?'' అనెను.

కమలావతి గర్వముతో లేచి నిలువంబడి యిట్లు జవాబుచెప్పెను. 'నాకు మీరిట్లందురని ముందే తెలియును. నా మాటయనిన మీకు లక్ష్యములేదు. నేను ముందేచెప్పితిని, మీకు సలహా నిచ్చుట అరణ్యరోదనమని!'

కర్ణావతి యా మాటకు సిగ్గుపడి యిట్లనెను. చెల్లెలా, ఏల కోప పడియెదవు? కోపపడకుము. ఎటులచేసిన మంచిదని యడుగుచున్నాను. వివాహము చేయుటయే యుక్తమని యనుకొందము. కాని రాజ సముద్రతీరమున నాతనికి కనఁబడిన బాలికెవ్వరో మనకు తెలియదు. అది యిప్పుడెక్కడనున్నదో తెలియదు. ఈ సంగతి యంతయు నెటు తెలియగలదో నాకు తోచకున్నది

కమ—అక్కా, నీ వామాటలన్నియు కట్టిపెట్టు. ఆ పిల్ల ఆకాశము నుండే యూడిపడినదో లేక భూగర్భమునుండి చించుకొనియే వచ్చి నదో యా సంగతి మన కక్కరలేదు. ఆ పిల్ల దొరకక పోయిన యెడల నిక భూమిమీద నింకొక సుందర బాలిక లేదా? ఉదయపూరు మహా రాణావారి పిల్లవానికి సుందరవతులగు కన్యలకు కఱవా? సేనాపతి విక్రమసింహుని కుమార్తె విలాసకుమారినంటి సర్వాంగసుందరి ఈ భూలోకమున నెక్కడనైన నూడఁగలమా? ఆ చిన్నదాని నిచ్చి యెందుకు వివాహము చేయఁగూడదు? మీ రెప్పుడా చిన్నదానిని చూడలేదా?

కర్ణ—లేదు. అయ్యో నే నెప్పుడును చూడలేదు.

కమ—అటులనా? ఆపిల్ల మానవకన్యక కాదు. కేవలము దేవ కన్యకే నేను మా పుట్టినింటికి వెనుక నొకసారి వెళ్ళినపుడు విక్రమ సింహుడు నావెంట వచ్చినాడు. అప్పుడు ఆయన వెంట కుమార్తె కూడ వచ్చినది. ఇంక నెందుకు ఎక్కువమాటలు? అవసరములేదు. నా కోరిక చెల్లింపుడు. విలాసకుమారినిచ్చి అమరునికి వివాహము

చేయుడు. అటులఁ జేసిన నే నెప్పుడును మీతో వాదులాడను. మీ మాట నెప్పుడును నెత్తిమీఁద పెట్టుకుందును.

కర్ణ—సరే, మనమిద్దఱమును ఈ వివాహమునుగూర్చి స్థిరము చేసుకున్నాము. బాగుగనే యున్నది. కాని రాణావారు ఇంతచిన్న వయసులో కుమారునికి వివాహముచేయుట కంగీకరింతురా?

కమ—ఆయన నొప్పించు భారము నాది. ఏమి రాణాగారికి మాత్రము కనపడుటలేదా? మనపిల్లవాని బంగారుచాయలీను శరీరము దినదిన మెట్లు కృశించిపోవుచున్నదో రాణాగారికి కనపడదా? వివాహము చేయుటవలన రెండు పక్షములనుండి మంచి దని ఆయన బుద్ధికి తోచదా?

కర్ణావతి మనస్సులో 'రాణావారికి బుద్ధికి తోచునట్లు చేయునది నీవే' అని వితర్కించి ప్రకాశముగా, 'సరే' రాణావారు అంగీకరించినారనుకొందము. కాని అమరుడు అంగీకరించనక్కరలేదా?'

కమ—అక్కరలేదు. అక్కా! నీ పాదములంటి ప్రార్థించుచున్నాను. ఈ పనికి ఇక నేమియు ఆక్షేపణ చెప్పవద్దు. నే నిప్పుడే పోయి రాణావారి నంగీకరించునట్లు చేసెదను.'

అట్లు చెప్పి చంచలబుద్ధియు, సరళహృదయయు, స్వాభిమానయుక్తయు నగు కమలాదేవి రాణా జయసింహునికి తనప్రస్తావమును వినిపించి యొప్పించుటకును వివాహప్రయత్నములు చేయుటకును దొట్రుపడుచు రాణావారి శయనాగారమందు ప్రవేశించెను. రాణావారు బంగారు మంచముపై పరుండియుండెను. కమలాదేవియొక్క సాదరాలింగనముచే నాయన నాశ్రయించిన నిద్రాదేవి పారిపోయెను.

అజ్మీరునగరమున కనతి దూరమున నొక పురాతనమైన కొండకోట కలదు. అది అచలగడమని ఇప్పటికిని ప్రసిద్ధినొందియున్నది. ఆకోటను సోలంకి సేనాపతి విక్రమసింహుడు కొలది సైన్యముతో పాలించుచుండెను. ఆయనకు పదునొకండేండ్ల కుమార్తె దేవయాని యని యుండెను. ఇంకెవ్వరును లేరు ఆ చిన్నది వేషభూషణములందత్యంత విలాసమును జూపించుచుండునుగాన తండ్రి గారాబముగ నామెకు 'విలాసకుమారి' యని మారుపేరొసంగెను. ఆ విలాసకుమారి పాప మొక్క యేడాదియైన గడవని పసితనమున తల్లి చనిపోయెను. భార్య చనిపోయినపిమ్మట విక్రమసింహుడు మరల వివాహమాడలేదు. తన ప్రేమనంతను కుమార్తెపై కూర్చుకొని ఆపిల్లనత్యంతాదరముతోడను ప్రేమతోడను పెంచుచుండెను. రాజపుత్ర వీరులు కుమారుల నెట్టి శిక్షాపోషణములు సేయుచుందురో యావిధముగ విక్రమసింహుడు విలాసకుమారికి విద్యాబుద్ధులు సెప్పుచుండెను. కుమార్తెకు సంస్కృతవిద్యాభ్యాస మిచ్చుటయేగాదు, అస్త్రవిద్యాభ్యాసముకూడ సరిసమానముగ నిచ్చుటయందాయన శ్రద్ధతీసుకొనెను. ఒక్కొక్కప్పుడు రణరంగములకుగూడ తీసుకొనిపోయి తద్విషయమైన సంగతులతో బరిచయము సేయుచుండెను.

సాయంసమయమున కింకనొక్క అరగడియ ప్రొద్దుండెను. సేనాపతి విక్రమసింహుడు తనమేడ డాబాపై కూర్చుండియుండెను. ఆయన వెనుకప్రక్క విలాసకుమారి కూర్చుండి ఒకచేతితో గువ్వెనబట్టుకొని రెండవచేతితో కాటుకడబ్బాను పట్టుకొని ఆయన తలమీద నెరసిన వెండ్రుకలకు రంగువేయుచు 'పదునైదేండ్ల బాలుడవేమి?. అంత సాహసమేమి? నాకేమియునర్థమగుటలేదు నాయనా! పెద్దవాడైననింక'

నెంతవీరుఁడగునో యనుచుండెను.

విక్రమసింహుఁడామాటలు విని నవ్వి 'అమ్మాయి! ఎన్ని సారులా ప్రస్తావన! ఎన్నిసార్లు విన్నానమ్మా ఈ మాటలు నీనోటివెంట ఈరోజు' అనెను.

విలాసకుమారి—నాయనా! ఆ వీరబాలకునిమాట నాకు మరల మరల జ్ఞాపకము వచ్చుచున్నది. ఆ వేట పండుగనాడు మీప్రాణము లాయనేగదా కాపాడినది. అందుచేత నామాట నాకు మరపునకు రాకున్నది. అడవిపంది మిమ్ముఁను రొమ్మునఁ బొడువవచ్చినపుడుమీ చేతిఖడ్గము జారిపడిపోయినదికదా. ఆ వీరబాలకుడు ఖడ్గముచేఁబట్టి మీకడ్డమురాకుండిన నా యేదుపంది మీ రొమ్మును జించివేసెడిది గదా. నే నాడుమాట నిజము. తండ్రీ! వాని నొక్కసారి చూడవలె నని నా మనసు గొట్టుకొనుచున్నది.

విక్రమ—బిడ్డా! అందుకు చింతింపవలసిన పనిలేదు. ఈసారి నేను రాణావారిని చూడబోవునప్పుడు నిన్నుగూడ నావెంటఁ దీసుకొని పోదును. అచ్చట రాజకుమారుఁడు అమరసింహుఁడు నీకు గాన్పించఁ గలడు. అదేమిటమ్మా! రంగంతయు ముఖమునకు దిగజారివచ్చుచున్నది. పడఁబోసితివి!

బాలికచేసినపనికి సిగ్గుపడి కారుచున్న రంగునంతను గుడ్డతో తుడిచివేసి యిట్లనెను—

"నాయనా! ఈరోజుననే రాణావారి దర్శనమునకుపోగూడదా?"

ఈ సమయములో దాసి యొకతెవచ్చి యిట్లు తెలియఁబరచెను—రాజమహిషి కమలావతి దేవయాని నొక్కసారి చూడఁగోరుచున్నది దాసి నొక్కదానిని పాలకినిచ్చి పంపినది.

విలాసకుమారి కొంచె మాశ్చర్యపడి రాజమహిషి నన్ను చూడవలె నని యెందుకు కోరియుండును అనెను.

వృద్ధ సేనాపతి వ్యంగ్యముగా నిట్లు జవాబు చెప్పెను—— 'బహుశః నిన్నా కుమార అమరసింహునికిచ్చి వివాహముసేయుదురేమో. ''

## ౪

విలాసకుమారిని సవారిలో నెక్కించుకొని దాసితిన్నగా కమలాదేవి యొక్క యంతఃపురమునకు గొనిపోయెను. కమలాదేవి ఎదురుగా బరువెత్తుకొనివచ్చి విలాసకుమారుని గుచ్చి యెత్తుకొని మరల మరల ముద్దాడి యిట్లనెను. నివిక్క డకెందుకు వచ్చితివి? 'విలా!'

విలా——తమరు పిలిపించిన వచ్చితిని.

కమల——నేనెవరో నీకు తెలియునా? తెలిసినఁజెప్పు.

విలాసకుమారి కమలాదేవి చంకనుండిదిగి మెల్లమెల్లగా 'తమరు రాణీగారు' అని జవాబుచెప్పెను.

కమలాదేవి యామెను దిరిగి రొమ్మున నొత్తుకొని మోమును ముద్దాడి యిట్లు పలికెను. 'నీమాటలు మధురము. అందుచే నిన్న డుగుచున్నాను. నన్ను రాణి యనుచున్నావు. రాణి యన నేమో నీకు తెలియునా? నివు కూడ త్వరితములో రాణివయ్యెదవు. రాణి యగుటకు నీకిష్టమా అయిష్టమా?

బాలిక——ఇష్టమైనంత మాత్రమున రాణియగుటకు సాధ్యమా?

రాణి——ఓహో! బహుశః నీ కాసంగతి తెలియదు కాబోలు. నేను నిన్ను రాణినిఁ జేయఁ దలచుకున్నాను. కేవలము రాణి మాత్రమే కాదు. రాణులకు రాణి, మహారాణినిఁజేసెదను. అదుగో అటువైపు సింహద్వారము వైపుచూడు. అక్క డెవ్వరో పోవునది? ఆయన నెవరో తెలియునా? ఇదేమి? ఈవైపు తిరిగెద వేమి? ఆయన నీ వలకెన్నడైనఁ జూచితివా యేమి; చెప్పు, త్వరగా చెప్పు.

బాలిక—ఆయన రాజకుమారుడు అమరసింహుడు.

కమ—నీ కెట్లు తెలియును.

విలా—మా తండ్రి యాయనగూర్చి యనేకసార్లు చెప్పియున్నాడు. వేటపండుగ దినమున మా తండ్రి ప్రాణము నాయన రక్షించినాడు.

విలాసకుమారి నిజముగాఁ దనను అమరసింహుని కిచ్చి వివాహము చేయుటకు కమలాదేవి నిశ్చయము చేసుకొన్నదని గ్రహింపలేదు. రాణి చమత్కారముగా మాటలాడు చున్నదనియే యామె అభిప్రాయము. అందుకే నామె కన్నుల నీరు నింపినది. అంతకమలాదేవి యిట్లు పలుక దొరకొనెను. 'ఇదేమి! నీ కన్నుల నీరు బెట్టనావశ్యకమేమి? అట్టి రాజ కుమారచంద్రుడు నీకు లభింప నింక కన్నుల శోకజలంబేల? సామాన్యముగ నే స్త్రీ యైన పది జన్మలు తపస్సు చేసినను అట్టి వరుడు లభింపఁ గలఁడా? అమరుఁడు నీ దిక్కు చూడలేదని ఒక వేళ చింతపడుచున్నావేమో! ఆ విషయమై నీకు చింతవలదు. వివాహసమయమున శుభ ముహూర్తమున నీపై వలపాయన కెంత కలదో నీకే యెరుకపడ గలదు.

విలా—శుభముహూర్త మెవ్వరితో, రాణీగారు?

కమ—అదుగో! తిరిగి రాణీగారని నన్ను పిలిచెదవేల? నేటి నుండి నేను నీకు తల్లితో సమానురాలను. శుభముహూర్త మెవ్వరితో నని యడుగుచున్నావా? ఆసంగతి నీకొక వారము రోజులలో తెలియఁగలదు. నేను రాణి కెంతకష్టపడి నీసంగతి నెరుక పరచితి ననకొంటివి? చేయవలసిన యేర్పాటులన్నియుఁ జేసి నిన్ను తీసుకొని వచ్చుటకు చారులఁ బంపెదను. నీవిప్పుడు పద. ఒక్కసారి మాఅక్కగారి దర్శనము సేయవలయును. నీముఖ చంద్రమండల మామె చూచినఁ గాని నామాట నమ్మదు. అక్కగారి యొద్ద కరిగి నపుడామెకు, నమస్కారము చక్కగఁ జేయవలయును సుమీ!

మరచిపోయెదవు జాగ్రత. మరచిన నామెకు కోపము వచ్చును. ఇదుగో విలాసకుమారీ! ఇంకొక సంగతి. నీవు నన్ను 'అత్తా' అని పిలువవలెను. మా అక్కగారిని 'పెద్దత్తగారు' అని పిలువవలెను. జ్ఞాపకముండునా ?

కమలాదేవి విలాసకుమారిని పట్టమహిషి యొద్దకు తీసుకొని పోయెను.

## ౪

నేడు పున్నమరేయి. అచలగడకు నాలుగువైపులను జనులు గుంపులు గూడియుండిరి. సేనాపతి విక్రమసింహుని కుమార్తె దేవయానిని నిచ్చి మహారాణా జయసింహునిపుత్రు డమరసింహునకు కల్యాణ మహోత్సవము జరుగబోవుచున్నది. సాయంకాలమునుండియు నభోమండలము బ్రద్దలగునటుల బహుతూర్యానిస్వనములు చెలరేగుచున్నవి. వివాహమండపమున దీపములు కలకలలాడుచు వెలుఁగుచున్నవి. రెండుఝాముల రాత్రివేళ లగ్నము. సేనాపతి విక్రమసింహుఁడు తనకుమార్తెను రాజాధిరాజు కుమారునికిచ్చి కన్యాదానముచేయు భాగ్యమబ్బెనని అపరిమితసంతోషముతో బిడ్డను తొడలయందు బెట్టుకొని పెండ్లిపీటపై కూర్చుండియుండెను. రాణా జయసింహుఁడును పుత్రునిదగ్గఱ కూర్చుండి యాతనిదిక్కు ప్రసన్నవదనుఁడై చూచుచుండెను. వేదికముందు పురోహితులు మంత్రములు చదువుచుండిరి. సరళబాలిక విలాసకుమారి తన వేలిముసుంగుచాటుననుండి తన భావిజీవితేశ్వరుఁడగు నమరుని యకళంక ముఖమండలంబును ప్రసన్నదృష్టితో హృదయాంతరాళమునఁ జూచుచుండెను. అమరసింహుఁడును, తన భవిష్యత్సహధర్మచారిణియగు

బాలికను, మేలిముసుంగు నుత్తరించు చూపులతోఁ జూచుచుండెను. కాని వాని మోమున సందేహచ్ఛాయలు పరువెత్తుచుండెను. తండ్రి తనకిచ్చి వివాహము సేయుపిల్ల తాను మున్ను రాజసముద్రతీరమునఁజూచిన లావణ్యవతి యగునా కాదా యని యాందోళన యాతని గుండ్రగోళము కెట్టుచుండెను. ఒకవేళ ఆతని చిన్నమ్మ కమలాదేవి అతని నొప్పించుట కాపిల్ల అతడు రాజసముద్రతీరమునఁ జూచిన కన్యకామణియేయని వాదువేసి యుండవచ్చును. వివాహమున కాతఁడు సమ్మతించుటకు శంకించునేమోయని గూడి అందఱును నట్టి అబద్ధపువార్త వేయునట్లామె యేర్పాటుచేసి యుండవచ్చును. అందుచేతనే అసురుఁ డేమాత్రమును సేనాపతి కుమార్తెతో వివాహము తనకు వలదని చెప్పలేదు. ఆమె వేసిన వాదు పూర్తిగ నబద్ధమని యాతఁడెన్నఁడును దలంచలేదు. అయినను అతనిమనసు పూర్తిగ ననుమానవిరహితమై యుండలేదు బాలికయొక్క మోము మేలిముసుంగునందు దాగియున్నను అమరసింహుడు కొద్దిగా క్రీగంటి చూపులతో కనిపెట్టఁగల్గెను. ముఖ్యమై ఖరిరాజసముద్రతీరమునఁ బ్రత్యక్షమైన సుందరి మోమువలెనే యుండెను. అంత లలితమును అంతకమనీయమునై యుండెను. శరీరచ్ఛాయలును అటులే శరత్కాల చంద్రికలబాతి విలసిల్లుచుండెను. చేతులవ్రేళ్ళు సరిగానంత చంపకకోరకములవలె నొప్పారుచుండెను. పాదములు. సరిగ నటులనే దరతరుణకమలంబులరీతి మెరయుచుండెను. పురోహితులు మంత్రపఠనమును సమాప్తముచేసి వారి యాచారానుసారముగా వధూవరులను పాణిగ్రహణంబు సేయింప యంతఃపురమునకు తీసుకొనిపోయిరి. శుభదర్శనముయొక్క సమయమాసన్నమాయెను. అందుకొఱకు పుణ్యాంగనలు నూత్నదంపతుల నొక్కచోనిలువఁబెట్టి యిద్దరకును తలకు మంత్రపూతభాష్యములను గట్టుట కుద్యుక్తులై

కన్యయొక్క మేలిముసుగును దీసిరి. ఆ చిన్నది వరుని మోముపై తన యపాంగదృష్టి నొక్కసారి బరపి మరల లజ్జచే తలవంచుకొనెను. వరుఁడును వెంటనే యొక్కసారి వధువుయొక్క మోమువైపు చూపు వాల్చి వెనుకకొక్క యడుగువైచి నిలువఁబడెను. అటుపైన నాతఁడు మఱియొక్కసారి కన్నులు తుడుచుకొని పెండ్లికూతురు మోమును జక్కగా జూచెను. అంత నొక్కసారిగ రమణీమణులందఱును గలిసి మంగళగీతము బాడఁదొడంగిరి. శంఖధ్వనులును ఆనందరవములును మిన్నుముట్ట వారు చేయసాగిరి. అమరుడు వాని నన్నిటి ననహ్యించుకొనుచు ఎలుగెత్తి ఇట్లనెను. 'ఇగియేమి! ఇది యామె కాదు!'

'ఇదేమి! ఇదేమి! పెండ్లికొడుకు పాఱిపోవుచున్నాడు!' అని అన్ని వైపులనుండి వారు ప్రతిధ్వనులు వినవచ్చెను.

అమరుఁడు మాటాడకుండ యచ్చటినుండి శీఘ్రమే పాఱిపోయెను. అతనిని పట్టుకొనుట కనేకమంది వెంట పఱుగెత్తిరి. కాని అతఁడు ఖడ్గము చేతఁ బట్టుకొని,—'జాగ్రత్త! ఎవరును నామీద చేయివేయ వద్దు.' అని కోపముతో నుడువుచు బోవుచుండెను.

అట్లు అమరుడు వెలుపలకు వచ్చి అచ్చట నెవ్వడో గుఱ్ఱమెక్కి యుండగా వానిని పడఁద్రోసియు గుఱ్ఱము తానెక్కి ఎక్కడకో పాఱిపోయె.

౬

దినములు పఱుగెత్తినవి. మాసములు దొరలినవి. సంవత్సరములు గడచినవి. కాని అమరసింహుని బుద్ధిమాత్ర మానాటికానాడు చెడి పోవుచుండెను. గాని బాగుపడలేదు. రాణా కుమారునిపై నాగ్రహ మొందెను. ఆయన పుత్రునిఁ బిలిచి యంతరాయము పడిన వివాహ

మును పూర్తిచేసుకొనుమని యాజ్ఞాపించెను. కాని కుమారు డాయన మాటను పెడచెవినిఁ బెట్టెను. ఈ సందర్భములో రాణి కర్ణావతి తమ కులపురోహితుని రావించి యావత్తుసంగతులనువిశదీకరించి రాణా గారితో సాంత్వనవచనములఁ జెప్పవలెనని కోరెను. పురోహితుఁడు రాణాగారి యొద్దకరిగి ఎల్లసంగతులను జెప్పవలసిన రీతిగఁ జెప్పుచు నిట్లు పలికెను,—'కుమారునకు పెద్దవాడైనసమ్మట స్వయముగ వివాహము పూర్తిచేసుకొనగలడు. అందుకు సందేహము లేదు. మేవాడరాజ వంశమునఁ బుట్టించి ధర్మపత్నిని విడనాడిన వారెవ్వరు గలరు!'

ఒకనాడు రాణి కర్ణావతి యొక్కతెయు కూర్చుండి విచారమున మునింగియుండెను. కమలావతి 'అక్కా, ఇప్పుడు నే చెప్పెడి మాట వినెదవా!-- ఇక విచారింపవలసిన పనియుండదు. అని నడిపెను.'

కర్ణావతి విసుగుతో—'ఇంకా నేమివినవలెను.

కమలాదేవి—విలాసకుమారిని పుట్టినింటినుండి పిలిపించి ఇక్కడ కొన్నాళ్ళుంచుడు. దీనివలన అమరుని మనసు కుదురుపడునేమో చూడవచ్చును. నామాటవినుడు. వినుటకు మీకిష్టమా అయిష్టమా!

కర్ణా— నీమాట ఇదివరకు విన్నదేకదా. ఇంతవఱకైనది—

స్వాభిమానియగు కమలాదేవి యీ మాటలువిని—, 'నామాట వినియే యింతైనదిగా! ఔను. మీరు అమరుని కన్నవారు. నేను అమరునికి కానిదానను. అందుచే పాపము నేను మీకు చెడ్డమాట చెప్పితిని. అంత సుందరమైన పిల్లకూడ మీ బుడుతనికి పనికివచ్చినది కాదు. నేనును జ్యోతిశ్శాస్త్రము చదువుకొనలేదు. ఈ భవిష్యత్తు ఇట్లు జరుగునని నేనేమి కలగంటినా!

కర్ణా—పోనిమ్ము. గతించిన దానిగూర్చి విచార మెందుకు! ఇంకను మీ సలహా వినవలసిన దేమున్నదా!

కమాలవతి ఏడ్వనారంభించి—"నిజమే మీమాట. మీరమరుని కడుపునఁ గన్నవారు. మీ రాయన కమ్మగారు. ఆయన మీ కొమరుడుగారు నే నెవరిని? నా కేమిసంబంధము! నే దిక్కుమాలిన దానను. బిడ్డాపాపలు లేనిదానను. నామాట విను వా రెవ్వరు? నాకిక నిక్కడుండుటకిష్టములేగు. నాపుట్టినింటికిపోయెదను. పంపించుమని రాణాగారి నడిగెదను."

అట్లు చెప్పుచు కమలాదేవి ఒడనెల్ల వణక రాణాగారి యొద్ద కరిగెను. ఏమి చెప్పినదో ఎవ్వరికిని తెలియదు. వారి సంభాషణ మూడవవారికి వినబడలేదు. మరునాడు రాణాగారు రాజ్యకార్యభార మంతయు మంత్రిపై సముద్ధించి కమలాదేవిని వెంటఁదీసుకొని జయసముద్రతీరమున నేకాంతముగ ప్రమోదభవనము నివాస ముండెను.

## ౨

యువరాజు అమరసింహునకు సోలంకి సేనాపతియొక్క కుమార్తెనిచ్చి అర్ధవివాహము మాత్రము జరిగినదని జనులందఱును వింతగాఁ జెప్పుకొనసాగిరి. ఈ విచిత్రవార్తతో బాటు విలాసకుమారి అనుపమాన రూపలావణ్యయని ప్రశంసకూడ లోకమున వేలకొలదిమంది జనుల నోటినుండి వినఁబడుచుండెను. ఈ మాటసత్యమా యసత్యమా యని యవన సేనాపతి అఫ్జుల్ ఖానుడు రహస్యముగ అచటకువచ్చి విలాసకుమారిని చూచిపోయెను. ఆమె కిప్పుడు పదునాల్గు వత్సరములు. అరవిరసియునాఘ్రాతమైన యీపూబోడిని దురాత్ముఁడగు నఫ్జుల్ ఖాను మనమునం దాశించెను.

కొన్ని దినములు గడచెను. ఒకనాటి రాత్రి గాలియాడక ఉక్కపోయుచున్నది. విలాసకుమారి తమ భవనముయొక్క మేడడాబాపై

తండ్రిదగ్గఱ పడుకొని యుండెను. అంత నరాత్రుగ భయంకరమైన కేకలు వినఁబడెను. వారికి నిద్రమెలకువవచ్చెను. చూడగా నలు దిక్కుల మహమ్మదీయులు క్రమ్ముకొని యుండిరి. నిద్రించుచున్న యామె తండ్రి చంకయందున్న ఖడ్గము నొకడు లాగుకొని నిలిచి యుండెను క్రూరకర్ముఁడైన యవనసేనాపతి అఫ్జుల్‌ఖాను నిద్రించు చున్న వీరునిరొమ్ముపై కత్తితో పెద్దవ్రేటు వేసెను. విలాసకుమారి యాపాటుచూచిమూర్ఛపోయి నేలమీద పడెను. అఫ్జుల్‌ఖాను డాస్మృతితప్పి పడియున్న బాలికపై దౌర్జన్యము గావించుటకు వెకిలి నవ్వు నవ్వుచు చేతులు చాచుకొని వచ్చుచుండెను. కోటలోనున్న కొలది రాజపుత్రసైన్యము కేకలువిని తొందరపాటుతో డాగాపై కివచ్చు చుండిరి. వారలు పైకి రాకుండ మసల్మాను లడ్డు పెట్టు చుండిరి. ఇంతలో నేమి ఆశ్చర్యము! ఇదియేమి! ఈయనెవరు! ఈయనను జూడగనే అఫ్జులుఖానుకు భయమును ఆశ్చర్యము నుదయించెను. ఎవరో భీషణమూర్తి! ఫకీరువలె నున్నాడు! వాని కుడి చేతిలో తళతళ దీర్ఘమైన కరవాలము మెరయుచున్నది. ఆయన కండ్లు పెద్దవి చేసి నిప్పులు గురిపించుచున్నాడు. అఫ్జుల్‌ఖాను ఆయనను జూచి వెనుకంజవేసి నిలిచెను. ఫకీరొక్క చేతిలో వాని జుట్టు పట్టుకొని రెండవ చేతితో కత్తినాడించుచు నిట్లనెను. 'ఓరి దుష్టా కుక్క బుద్ధీ! నాచేతిలో నీ చావురా నేడు. నీపాపమునకు తగిన శిక్ష కాదురా! ఈ రోజుకు పో, పాఱిపో, అఫ్జుల్‌ఖాను ప్రాణములు దక్కించుకొని పాఱిపోయెను. ఆభయంకరమూర్తిఁ జూచి తక్కిన వాని యనుచరులును వాని వెంట పాఱిపోయిరి. ఈ యవకాశ మును దీసుకొని కోటలోని భటులును, 'కొట్టుడు' కొట్టు డని తిరిగి వెంటఁ దరిమిరి.

ఫకీరు విక్రమసింహుని దేహముపై చేయి యుంచి ప్రాణ

మున్నదేమో చూచెను కాని యాతని ప్రాణములంతకు మున్నే పోయెను. పిమ్మట నాయన స్మృతితప్పి పడియున్న విలాసకుమారిని లేవదీసి తన భుజముపై నెత్తుకొని నెమ్మది నెమ్మదిగా నచ్చట నుండి వెడలిపోయెను. కొంచెము దూరమరిగిన పిమ్మట విలాస కుమారికి స్మృతి వచ్చి యిట్లడిగెను. 'మా తండ్రి యేడీ? ఫకీరుగద్గద కంఠముతో బిడ్డా! ఇకనుండి నీకు నేనే తండ్రిని.

## ౧

నాదిరు షాహు —

వింటిరా యీసంగతి —ఒకరోజు అక్బరు బాదుశాహా నిండుకొలువునం గూర్చుండి యందఱ సంబోధించి తన సింహాసనమునంకం జూపి ముక్తకంఠముతో నిట్లు పలికెను—

"ఏనాడు ముసల్మాను బాదుశాహా తన సామ్రాజ్యమును శాసించుటలో హిందూమహమ్మదీయ భేదమును పాటించునో యానాడీ రత్నసింహాసనము తుత్తునియలై పోవును. ఇది ముమ్మాటికిని సత్యము."

మహాప్రతాపవంతుండగు అక్బరుయొక్క భవిష్యద్వాణినేడు బహుశః సఫలము లయ్యెననుగాబోలు, సత్యద్వేషియు కపటాచారియు స్వార్థపరుడునగు ఔరంగజేబిప్పుడు సింహాసనమందున్నాడు! అతండు శోణిత సాగరమునుదాటి దురాకాంక్షయను కఠోరశైలముచే భారత వాసుల జాతీయహృదయములు భగ్నముగావించి, అన్నదమ్ముల రక్తముతో, తండ్రియొక్క కన్నీటిధారలతో అక్బరుమహారాజు యొక్క పవిత్రప్రేతాత్మకు తర్పణములుచేసి, పవిత్రయిస్లాముధర్మమును స్వార్థసిద్ధియొక్క యాశచే వికృతమగు కళంకితమునొనర్చి దానవ

దర్పముతో పిశాచగర్వముతో సింహాసనమందాసీనుఁడయ్యెను! ధర్మావతారమగు మహాత్మా మహమ్మదుపాపమును బారదోలి ప్రేమ రాజ్యమును స్థాపించి తన దివ్యోపదేశములవలన మానవజాతినాకర్షించి పులకితులగునట్లు గావించియుండెను. కాని దానవసామ్రాట్టుని యాజ్ఞచే నా దివ్యోపదేశములన్నియు కలుషితమై రాక్షసధర్మములుగాఁ బరిణమించెను! నేటిసమయమున భారతదేశమందు ఆపవిత్ర మహమ్మదు ధర్మములు యవనమ్లేచ్ఛనామముల బరగుచు నపయశస్సునకు బాల్పడి పోయెను. సమస్తఆర్యావర్తమును పీడితహిందూజనులయొక్క హాహాకారములతోడను యవనపిశాచగణముల అట్టహాసములతోడను ప్రతిధ్వనించుచుండెను. మేచ్ఛులలో మహర్షిగణ త్యాచారములను క్రూరపాపాచరణములను జూచి యార్యజాతి విస్మితయు స్తంభితయునై యుండెను. అరువదికోట్ల హిందువులును ధర్మలోపమునకును పాపస్పర్శకును జంకి దుఃఖితులై ఏమియుఁజేయలేక యూరకుండిరి. యమునానదీతీరమున నేడు వేదపాఠము నిషేధమాయెను. జాహ్నవీ తరంగములమీఁద నేడు శంఖధ్వని ప్రతిధ్వనింప వలనుపడదు. మందిరముల మంగళహారతి పాడఁగూడదు. వ్రతములు, శాస్త్రాధ్యయనములు పురాణములు, సాంఖ్యము, పాతంజలి, గీతలు, ఉపనిషత్తులు ఇవి అన్నియు మను పరాశరుల జన్మభూమియందు మాఘకాళిదాసులు పెరిగిన భూమియందు బహిరంగముగఁ దలంపఁ బడఁగూడదు. ఎక్కడైన సంస్కృతపుస్తకము కనఁబడినయది యగ్నిహోత్రసమర్పణము సేయ వలెనని యాజ్ఞప్రబలియున్నది. అంతేకాదు. ఎంత పరిశ్రమతోడనో తయారై ఎంత ప్రయత్నముచేతనో రక్షితమై అసంఖ్యజనులచే సమ్మానితమైఅనంతప్రేమతో పూజితమైయున్న దేవతావిగ్రహములు ఏ నిర్జన గృహముననో మారుమూల ఆకుల మరుగునదాగియుంప వలసివచ్చెను. ఏమికారణము? బాదుశాహాగారి ఆజ్ఞ హిందువుల దేవ

మూర్తులు మునల్మానుల మసీదులకు సోపానములక్రింద వేయవలెనని వర్తిల్లుచున్నగ! ఆహా! జ్యోతిర్మయులును పవిత్రతాగుణయులగు నార్యులగాయము లీ పిశాచముల భయముగ దేశమునుండి యెటకు రాజాలకుండిరి. యవనుల యుద్దేశము పురుషుల యుగ్రగిరసుఖంబుల కొఱకే స్త్రీజాతి యుద్భవించినదని తెలియనమ్మచున్నది! అక్కటా! భారతభూమి ఒక్క అరణ్యమైపోయెను గదా. కృషీవలు పొలములు కేగుటకు ఝడియుచుండిరి. వారి గొడ్లు వాకిళ్లు బిగించుకొని ఆవుల నెద్దులను దాచుకొని నేలమీదపడి యేడ్చుచుండిరి కారణమేమి? గోమాంసము తినినగాని యీ యవనుల జఠరాగ్ని కరితృప్తి నొందదట!

ఒకనాడు ఔరంగజేబుచక్రవర్తి తన జుమ్మామసీదుయొక్క అరుగుపై నిల్చి కన్నులు మూసి నమాజు చదువుచుండెను. ఆయనకు వేరుక చెలికాడు అఫ్జులుఖాను ఆయన వెనుక నిలిచి సరిగ నాయనవలెనే నమాజు చేయుచుండెను. కొంతసేపటికి నమాజు సమాప్తమాయెను ఔరంగజేబు అచ్చటినుండి వెడలి ప్రక్కనున్న స్ఫటికనిర్మిత చతుర్శ్రవేదికపై మోకాళ్లపై నానిని కొంతసేపు జేతులు జోడించుకొని కన్నులు మూసికొని యుండెను. అటులున్నట్టి కొంతసేపటి కాయన కన్నులు దెరచెను.

వెంటనే అఫ్జుల్ఖాను చేతిలో నొక చిత్రపటమువట్టుకొని ముక్కవంగి సలాము చేసి పాదుశాహా యెదుట నిలువబడెను

చక్రవర్తి — అఫ్జుల్ఖాన్, నేడేమి సమాచారము? కురానునరీఫునకవమా. ము నల్పి నే డెవ్వరైన కాఫరు సీ కాగ్రహపాత్రు డయ్యెనా? చెప్పు — అ దెవ్వరి చిత్రపటము?

అఫ్జుల్ — ఇది యీ గుఱ్ఱపునవారు కుంకమొగం మొక్కజొన్న కూటిగాడు సిపాయిసాలా కాఫరుగాడి పాతచిత్రపటము. ఇదిగో చిత్త

గించండి. వాడే తెల్లగుఱ్ఱముయొక్క చేతిలోని ఖడ్గముతో మొక్కజొన్న కండె లెట్లు తినుచున్నాడో, ఇంకొక పటము.

ఆ మాటలు విని చక్రవర్తి తత్క్షణ మొక్కసారి నవ్వి యంతలో ముఖము ముకుళించుకొనెను. పిమ్మట మరల చిత్రపటము వంకఁ జూచి యిట్లనెను,—'తెలిసినది. రాథోరు సిపాయిసాలా దుర్గాదాసు గాడి పటమా? మంచిది తెగియఁజెప్పు. శాంతిమయ మహమ్మదీయరాజ్యమును గగ్గోళము సేయు వ్యవస్థ యేమైన వచ్చినదా యేమి? అఫ్జల్! ఇది యదార్థము ఈ మొక్కజొన్న తిండిగాండ్రగు కాఫరుల మాట జ్ఞాపకము వచ్చినంత నొడలు మండిపోవును సుమా.

అఫ్జల్‌ఖాను సైవారము చేసి ఇట్లనెను,— 'సార్వభౌమా! ఈకాఫరు సేనాపతిని తల తఱుగవలసినది తను రాజ్ఞ యిచ్చి ఇప్పటికి రెండు సంవత్సరములైనది నేటికి మనకు సంపూర్ణ అవకాశ మబ్బినది."

చక్ర—ఏమిటి? ఎట్లవకాశము దొరకినది.

అఫ్జల్—కాఫరుడు నిన్న రాత్రిసమయముగ నీపట్టణమునకు వచ్చియున్నాడు.

చక్ర—ఒంటరిగి వచ్చినాడా?

అఫ్జల్—మహాప్రభూ, ఒంటరిగ రాలేదు. ఆయన వెంట కొలదిమంది రాథోరు సిపాయిలు వచ్చియున్నారు. కొంతమంది ఆడవాండ్రు కూడ నున్నారు. జస్వంతసింగుయొక్క చిన్న కుమారిని కూడఁ దీసికొని వచ్చిరి.

చక్రవర్తి ముఖమున మందస్మిత రేఖ లుదయించినవి. ఆయ నిట్లు చెప్పఁదొడఁగెను 'అర్థమైనది. కొండ యుద్ధమందు యశ్వంత సింహుడు చచ్చిన పిమ్మట వాని రిస్తేదారుడు యోధపురమునకు వెడలిపోయినాడు. అప్పటినుండి యింతవఱకు నిట్టి సంతోషవార్త

నెవ్వరు నా కెరింగింపలేదు. అఫ్జుల్! నీవు తత్క్షణము పోయి శాహజాదా అక్బరు కుమారుని నాయొద్దకు పంపుము.''

అఫ్జుల్ ఖానుడు చక్రవర్తి యాజ్ఞను జెల్లించుట కరిగెను.

చక్రవర్తి తనలో తానిట్లు వితర్కింప నారంభించెను. 'ఇన్ని దినములకు మొగలు సామ్రాజ్యమునకు ప్రాచీన శత్రువును గీటడగింప నవకాశము దొరకెను గదా! యశ్వంతసింహుని పుత్రుని నేడే తలవరుల కరకు కరవాలముల కెరగా నిత్తును గదా.

కొంతతడవునకు శహజదా అక్బరు అఫ్జుల్ ఖాను వెంట వచ్చి సలాముచేసి నిలిచెను! ఔరంగజేబు తన కుమారునితో నిట్లు మాటలాడ నారంభించెను,—'శహజాదా! మన మహమ్మదీయ సామ్రాజ్యమునకు శత్రువులుగా నుండిన యశ్వంతసింహుని వాని కుమారుడగు పృథ్వీసింహుని వీలగునంతవఱకు వారియనుచరులతో సహా బహుచతురతగా మనము చంపి వేసియున్నాము. కాని యా కులము నందింకొక్క చిన్న విషపుపురుగు బ్రతికియున్నది. దానినిఁ గూడ వెంటనే రూపుమాపవలెను. ఆ పాము పిల్ల నేడు మన పట్టణము వచ్చెనని అఫ్జుల్ ఖాను చెప్పుచున్నాడు.''

శహజదా అక్బరు ఇట్లు బదులు చెప్పెను,—'మహాప్రభూ! యోధపురాధిపతి జస్వంతసింహుడు చనిపోయిన పిమ్మట వారి రిస్తేదారుఁడును కొంతమంది సిపాయిలను చిన్నకుమారుని వెంటఁ దీసుకొని నేడు ఢిల్లీపట్టణము వచ్చెదరని నాకు తెలియును. కాని వారలు ఒక్క క్షణమైన నాగకుండ వెడలిపోవుదురని కూడ తెలియ వచ్చినది.

చక్ర—కావచ్చును. వారు జోధపురముపోయి ఈ పాము పిల్లకు పట్టము గట్టి మరల మనకు ప్రబలశత్రువు లయ్యెదరు. కాబట్టి యిదుగో మా యాజ్ఞగైకొనుము. జస్వంత సింహుని సిపా

యిలను లాలించిరో భయపెట్టిరో యీ చిట్టిపాపరేనిని మా యెదుటఁ బెట్టునట్లేర్పాటు సేయుము. వానిని పరలోక మంపునందాక మా హృదయవేదన చల్లారదు.

శహజాదా—మహాప్రభూ! నేడు జస్వంతసింహుని రిస్తేదారుఁడును పతిపుత్రుల నెడబాసిన మహారాణియు మహాదుఃఖముననున్నారు. తమరు సమస్తభారతవర్షమునకు చక్రవర్తులు. అందుచే నట్టిదిక్కులే నట్టియు శోకాతురయునగు పతిహీనమహారాణి తమసింహాసనము యొక్క శరణుగోరుచున్నది. అట్టియెడ నిట్టి యాశ్రిత రాజపరివారమును నిర్బంధించుట రాజనీతి విరుద్ధమని మనవిచేయుచున్నాను.

చక్రవర్తియొక్క ముఖమండల మొక్కసారిగా నెఱ్ఱవడెను. ఆయన క్రోధపూర్వకముగ నిట్లు పలికెను,—అరే గాడిదా! నోరు మూసుకొనుము. మాకు రాజనీతి బోధించెదవా? విపన్నులైనను శరణాగతులైనను ధనహీనులైనను ధనవంతులైనను కాఫరులకు దయఁజూపించవలెనను రాజనీతి నీ వే శాస్త్రమునందు చదివితివి? ఇదిగో మేమిప్పు డాజ్ఞాపించుచున్నాము. వెంటనే చెల్లించిరమ్ము. తెలివితోఁచేసెదవో బలముతోఁ చేసెదవో లాలించెదవో లేక ఝుళిపించెదవో—ఎటులైనగానిమ్ము. రాజకుమారుని తల్లియొడినుండి లాగి తలవరులకత్తులకెరవెట్టుము. తక్షణమేపోయి రాఠోరులకు మాహుకుమిదియని తెలియజేయుము. యోధపుర నరేశుని చిన్నకుమారుని ఢిల్లీశ్వరునికిఁ జూపకుండ నిచ్చటినుండి బయటకు పోవుటకు వీలులే దనుము. నీ వొక్కఁడవు పోఁజాలనియెడ అఫ్జల్‌ఖానునుగూడ వెంటఁదీసుకొనుము. పొమ్ము. అఫ్జల్ నీవుకూడ పొమ్ము. వెంటనేపొమ్ము. ఆ మొక్కజొన్నకూటిగాడగు రాఠోరుసేనాపతితో మా యాజ్ఞ చెప్పు—జస్వంతసింగుని పుత్రుని మాయొద్దకు పంపిన వానికి మేవాడు సుబేదారుగిరి ఇయ్యఁగలము. అట్లుచేయనిచో మేము ఢిల్లీలో కాఫరుల రక్త

ప్రవాహములను పాఱించెదము. మొగలుఫౌజుకు మాఆజ్ఞయిది. రాఠోరుల శిబిరమునకు నాల్గువైపుల ముట్టడింపవలెను. ఎవ్వరిని పాఱిపోనియ్యవలదు. అక్బరు! నీవు వెడలిపొమ్ము. ఒకసారి మాపెద్దన్న మోరాజము మా యాజ్ఞ నల్లంఘించి యేమయ్యెనో జ్ఞాపకముంచుకొనుము"

శహజాదా ప్రత్యుత్తరమియ్యలేదు. శిరమువంచి చక్రవర్తి యొక్క యాజ్ఞను సమ్మతించి సంతోషముతో అఫ్జలుఖాను వెంటనరుగ సంసిద్ధుఁడై నటుల కనఁబడెను.

## ౨

### రాఠోరు వీరుడు

ఢిల్లీనగరమున నొక పెద్ద భవనము లోపల చావడియందు జోథపుర మహారాణి అరుంధతిదేవి తన చిన్నకుమారుని చంక నెత్తుకొని నిలుచుండి యుండెను. ఆమె ముందు రాఠోరు సేనాపతి దుర్గాదాసు నిలువఁబడియుండెను. వారలిటుల మాటలాడుకొనుచుండిరి.

దుర్గా—దేవీ! మేము నిజముగా మోసపోయితిమి. నేను మొదటనే చెప్పితిని, రాజకుమారుడగు అజితసింహుఁడును రాఠోరు రాజవంశరమణీమణులును ఢిల్లీపట్టణమునకు వచ్చు టేమాత్రమును దగదు. మనము తెలిసియు విషసర్పముల పుట్టలో చేయి పెట్టితిమి.

రాజమహిషి—ఏమి? మనము తిరిగి ఢిల్లీశ్వరున కెట్టి యపకారము చేసితిమి? నేను రాజేంద్రుని పట్టపుదేవినై యుండియు నాయన నిర్దయవలన వీధిలోని బిచ్చపుదాననైతిని! ఏ యపరాధమెరుఁగని నా వీరపుత్రుని రాఠోరురాజకులరత్నము నాయు నపహరించివేసి యున్నాడు. అనేకమాయోపాయములచే నాయన జీవితేశ్వరుని

ప్రాణముల జూరగొన్నాడు. ఆయనకోరిక లన్నియు సఫలములైనవి గదా. ఇంకను కత్తులఁ గట్టుకొన్న మొగలుసైన్య మీ శోకభవనమును ముట్టడింపనేల ?

దుర్గాదాసు—దేవీ! ఈ దాసుని తప్పును క్షమింపుము. దానవ ఔరంగజేబుకు ఇంతవరకు గ్రోలిన దేవతల రుధిరముతో దప్పితీర లేదు. తమ కింకను బోధ కాలేదు కాబోలు. ఈ ప్రతాపమంతయు తమకు నూతనముగఁబుట్టిన చిన్నిపాపనిమీఁద. ఆయన దిక్కుమాలిన యాగ్రహ మీరారోరు రాజకుల క్షుద్రకమలకళికపై విజృంభించుచున్నది.

మహారాణి అరుంధతీదేవి తన చంకనున్న బాలుని తిరిగితిరిగి ముద్దాడి కన్నుల నీరునుంచుకొని యిట్లు పలికెను—'అట్లనవద్దు. అట్లనవద్దు, దుర్గాదాసు! ఆ మాట యెన్నటికిని జరుగనేరదు. ఈ పసికూన పాలుత్రాగు బిడ్డయేడ. అతులైశ్వర్యముతో తులఁదూగు చక్రవర్తితో శత్రుత్వమేడ. ఏ దానవుఁడైన నంతకఠినహృదయుఁడుండునా ? దుర్దాంతదానవదళితమై సంపూర్ణవినాశమైన నందనవనమందు కడపటకీ చిన్నపారిజాత కుసుమమును గూడ హతము సేయ నుద్యోగించునా ?

దుర్గాదాసు నడుమునుండి వ్రేలాడు కరవాలము నెత్తి ముద్దువెట్టుకొని యిట్లనెను,—'ఎవరైన నట్లుద్యోగించిన నుద్యోగింపనిండు. ఏ దానవున కంత సాహసముండునో చూచెదను. దేవీ! తమ రంతఃపురములోని కరుగుడు. మీకు త్వరలోనే కబురు పంపెద. మొగలుసైన్యమిట్లుముట్టడించుటకు కారణ మరసెద. మీ రేమియుఁ జింతింపవలదు. ఈ దుర్గాదాసు మీ నమ్మకమైన దాసానదాసుడు.'

మహారాణి—మీ రింకను బాదుశాహ దర్బారునకు పోలేదా? బాదుశాహ మీతో మేమన్నాడు!

దుర్గాదాసు—ఔరంగజేబు మాయలమారి యనియు మోస గాడనియు మీరు లెస్సగా నెరిగియే యున్నారుకదా. ఆయన మర్మము విడిచి ఎన్నడైన మాటలాడునా! ఆయన ఈ మాటలు మాత్రముమాతో ననెను—'మీరు ఢిల్లీవిడిచి వెడలక పూర్వమే మా యాజ్ఞ మీకు జారీయగును. మేము సత్వరముగనే కబురు పంపెదము.''

ఆమాట లని దుర్గాదాసు బయటకు వచ్చెను. గుమ్మము యొద్ద రాఠోరు సైన్యము నిలిచి యుండెను. వారి ముందు చక్రవర్తి కుమారుఁడు అక్బరు వచ్చి ఖిన్నవదనుఁడై నిలిచియుండెను. ఆతని ప్రక్క చల్లారిన కొరవిని బోలి అఫ్జుల్ ఖాను కదలక మెదలక నిలిచి యుండెను. దుర్గాదాసు అక్బరును గౌరవముగ నభివాదనముసేసి దగ్గరకు పోయి నిలువఁ బడెను. అక్బరిట్లు నడివెను,—వీరరాఠోరు సేనాపతీ! నేడు నాకిష్టము లేక పోయినప్పటికిని తండ్రిగారి దూత్య మును గైకొని మీతో గలిసికొనుటకు బయలుదేఱి వచ్చితిని. వారు మీకు పంపిన సందేశమంతయును సేనాపతి అఫ్జుల్ ఖాను మీతో విశదముగఁ జెప్పఁగలఁడు. ఒకవేళ నే నాయన హుకుమును జెల్లింప నేమోయని యాయన నా వెంట అఫ్జుల్ ఖానును గూడఁ బంపిరి. మంచిది. అఫ్జుల్ ! తండ్రిగారి యాజ్ఞను రాఠోరు సేనాపతితో సాక ల్యముగ విప్పి చెప్పివేయుము. నేనిప్పుడు జుమ్మామసీదుకు పోవ లెను. నీవు కొంచెము సేపుండి రాఠోరు సేనాపతి యభిప్రాయ మును గనుగొని నాతో వచ్చి కలియుము''

అట్లు దూతకృత్యభారమును అఫ్జుల్ ఖానుకు ఒప్పగించి అక్బరు మెల్ల మెల్లగాఁ బోవుచు ఏమి యాలోచించుకొనుచుండెనో తెలియ రాదు. ఇచ్చట అఫ్జుల్ ఖాను చక్రవర్తియొక్క యాజ్ఞ నెట్లు రాఠోరు సేనాపతికి వెలిబుచ్చవలెనో తెలియక తన్నుకొనుచుండెను. వాఁడు

బెదరి బెదరి నలుదిక్కులం జూడనారంభించెను. తరువాత కొంతసేపు నేలవంకం జూచి పిమ్మట దుర్గాదాసు ముఖమువంకం జూడసాగెను. అంత నొక్కసారిగ వాని యొడలెల్ల గజగజ వణక నారంభించెను. వాడు పటములో చూచిన శ్వేతాశ్వపు రౌతు మొక్కజొన్న కూటి వాడు రాఠోరు వీరుడు రక్తమాంస ప్రాణములతో నెదుట పూర్తిగ ప్రత్యక్షమాయెనని గ్రహించుకొనెను. వానిం జూడం జూడ అఫ్జుల్ ఖాను ప్రాణములు పై కెగిరి పోవుచుండెను.

దుర్గాదాసు—సేనాపతిగారూ! చెప్పండి. బాదుశాహాగారు మా యందు దయయుంచి యేమి సెలవిచ్చిరో చెప్పుడు.

వీర రాఠోరు సేనాపతియొక్క యీ గంభీరవాక్యముల కాపురుషుండగు అఫ్జుల్ ఖాను యొక్క హృదయమున నురుము లురిమినట్లు వినంబడెను. వాడు మనస్సులో నప్పుడు యోచించుకొనెను.—ఇన్ని దినముల కర్థమైనది. ఈ కాఫరు బహద్దూరు యొక్క చిత్రపటము చూచినప్పుడు బాదుశాహా కూడ మనస్సులో భయకంపితుండగుటకు కారణము గ్రాహ్యమైనది.

దుర్గాదాసు మరల—‘చెప్పుడు’ ఏమి చెప్పవచ్చితిరో.

అఫ్జుల్—నన్ను క్షమించెదమనిన చెప్పెదను—

దుర్గాదాసు నవ్వెను. కోశాధ్యక్షుడు చంద్రభానుడు ‘మీరు దూతలు. ఝడియవలసినపని లేదు. అనెను.

అఫ్జుల్ మాటాడలేదు.

సేనాపతి రఘునాథుడు నవ్వుచు నిట్లనెను. ‘మేము కాపురుషశత్రువులను లక్ష్యము సేయము. క్షమించెదము. మీకు భయ మవసరము లేదు.

అఫ్జుల్ ఖాను నలుదిక్కులును జూచి—‘అటులైన—అటులైన జెప్పెద. మీ పాదముల ముందుపెట్టెద—కాని మీలో నెవ్వరైన

నా బుఱ్ఱఁ గరఁగొట్టి పరలోకమునకుఁ బంపఁ జూచినచో నిచ్చట నాకు సాయము నచ్చుట కొక్క మహమ్మదీయుఁడైన లేఁడుగదా.' అనెను.

దుర్గాదాసు—అట్లైన మీరు చక్రవర్తిగారి యొద్దకేగి మనవి చేయుఁడు. మేమే దర్బారుకు వచ్చెదము. వారిచ్చునాజ్ఞయేమో విందుము.

అఫ్జుల్—అబ్బో, అట్లు జరుగ వలనుపడదు. అట్లుచేసి బాదుశాహ ముందుకు పోతినేని నన్ను కొఱత వేయించును. మంచిది. నా కర్మమెట్లుండిన నట్లగును. నే చెప్పెద వినుఁడు. బాదుశాహ యిట్లాజ్ఞాపించెను. మీ యొద్ద నున్న జస్వంతసింహుని చిన్నకుమారుని నేఁడు బాదుశాహ యొద్దకు పంపించినయెడల''

దుర్గాదాసు—పంపించినయెడల, పిమ్మట నేమో, శీఘ్రముగాఁ జెప్పు. ఝుడియనక్కఱలేదు.

అఫ్జుల్—పిమ్మట, ఆయన చాల మంచిమాట చెప్పియున్నారు. బాదుశాహ దగ్గఱికా పిల్లవానిని పంపినయెడల వారీ సమస్త మార్వాడరాజ్యమును సేనాపతి యగు దుర్గాదాసునకును అతని యనుచరులకును వదలివేయఁగలరు వారందఱును చాల సుఖైశ్వర్యములతో—''

దుర్గాదాసుయొక్క పిడుగువంటి కంఠస్వరము తిరిగి మునుపటివలెనే అఫ్జుల్‌ఖాను చెవులపై బడెను. ఇక చాలించు మీమాటలు మాకర్థమైనవి. అఫ్జుల్‌ఖాను వణకుచు నేలమీఁద చతికిలఁబడెను తరువాత మరల ధైర్యము తెచ్చుకొని మరల ప్రారంభించెను,—'చక్రవర్తిగారిహుకుము యొక్క తాత్పర్యము మీ కింతవఱకు నర్థమైనట్లు లేదు. ఆయనకు మీ మీఁద చాలదయ. ఆయన నిజముగ మీకు మార్వాడ రాజ్యమంతయుఁ గట్టిపెట్టును.

రఘు—చక్రవర్తి కేమైనఁ బిచ్చి యెత్తినదా యేమి? మార్వాడు రాజ్యమెప్పుడును స్వతంత్రమైనదే. దానిమీద చక్రవర్తిగారి కేమి యధికారమున్నది? ఆ సంగతి అటుండనిమ్ము. మే మిప్పుడిందుకు సమ్మతింపని వో ?

అఫ్జర్ —ఔను, మంచిసంగతి జ్ఞాపకము చేసితిరి. ఒక వేళ మీరీపిల్లవాని నిచ్చు విషయములో సమ్మతింపనిచో, చో- చో—"

రఘు—చో—చో నేమగును? చప్పున చెప్పవేమీ తెలియకున్నది. నా కెక్కడిసహాయమిచ్చి పంపించినాడు. బాపురే! బాదుశహా ఆయన చెప్పినది. ఇందులో నాజోక్య మేమీ లేదు. ఆయన చెప్పినదే చెప్పుచున్నాను. సమ్మతింపనిచో ఢిల్లీ వీధులలో నేడు మీరక్త వరదలు ప్రవహించును అని సెలవిచ్చారు. మిమ్ములనెవ్వరిని పాఱిపోనియ్యరు.

ఈమాట వినినతోడనే ఝుణ ఝుణ మని రాఠోరు వీరుల మొలల యొరలనుండి కత్తులు వెలువలకు వచ్చి నిలిచినవి. వాని మెరుపులు సూర్యకిరణములను ధిక్కరించుచుండెను.

దుర్గా— ఇప్పుడంతయు సర్ధమైనది. నా అనుమానమంతయు యథార్థమైనది. ఇందుచేతనే దానవచక్రవర్తియొక్క సైన్యము మా నివాస స్థానము చుట్టు ముట్టినవి. ఇక దానవసేనాపతీ! మామాట విను. నీవు దానవ చక్రవర్తితో నిట్లని విన్నవింపు. మే మాయన ఆజ్ఞను పాలించు వారము కాము. మా యొద్ద అయిదువందల రాఠోరు వీరసైన్యమున్నది. ఈ అయిదువందల రాఠోరు వీరులను కరవాలముల నెత్తిన ఢిల్లీశ్వరుని లక్షసైన్యమును మడియింతురు. ఈ అయిదు వందలలో నొక్కడైన బ్రతికి యున్నంతకాలమును స్వర్గస్థుడైన జస్వంతసింహుని చిన్న కుమారుని దానవచక్రవర్తి చేతుల ముట్టనియ్యఁడు. కాపురుష చక్రవర్తితో మఱియొక్కమాట కూడ చెప్పుము. మేము రాజపుత్రవీరులము. మాకు మృత్యువనిన

ప్రేమ. ఎప్పుడును మెడకు కట్టుకొని తిరుగుదుము. ఇక పొమ్ము ఇక్కడనుండి లేచిపొమ్ము.

అఫ్జుల్ వణకుకొనుచు వెడలిపోయెను. మధ్య మధ్య నెవ్వరైన దనను గొట్టువచ్చుచున్నారేమో యని వెనుకకు తిరిగి చూచుకొనుచుండెను.

దుర్గాదాసు తన యనుచరుల దిక్కుచూచి బిగ్గరగా బల్కెను—'రాఠోరువీరులారా! సుజానతు చందావతు వంశజులారా! నేడు మన మనుష్యజన్మ ధన్యమైనది. మనము నేడు మన హృదయ శోణితమును ధారవోసి స్వర్గస్థ యశ్వంతసింహుని పుత్రుని రాక్షస సమ్రాటుచేతిలోఁ బడకుండ రక్షింపవలసియున్నది. ఆ దానవ చక్రవర్తి కలలోనైన నెరుంగనిసంగతి నేడు కన్నులతో జూడఁ గలఁడు. ఆయిదువందల రాజపుత్రవీరులు అయిదువేల యవనసిపాయిలకుబుంచి ఈరోజు యమలోకమునకు పంపించఁగలరు. నేఁడీ రాజధాని ఢిల్లీనగరములో ముసల్మానుల రక్తము వరదలై పారఁగలదు. అదుగో చూడుడు దేవమూర్తియగు యశ్వంతసింహుడు స్వర్గలోకమునుండి ప్రసన్నదృష్టితో మన రణసముద్రమును జూడవచ్చుచున్నాడు. ఉత్సాహపూర్ణులై పని సేయుడు. ఇఁక నాలస్యము సేయరాదు. మీమీగుఱ్ఱముల నెక్కుడు. ఒక్కసారి యందఱు నేకకంఠ్యముగాఁ జెప్పుడు. 'జయ్! రాజాయశ్వంతసింగుకు జయ్'

వెంటనే వారంద రొక్కపెట్టున జయధ్వానము సేసిరి. ఆ జయధ్వానము నలుదిక్కులను ప్రతిధ్వనించినది. విశ్రాంతిభవనమునఁ గూర్చుండియున్న బాదుశాహాయొక్క చెవులఁబడి యది యాయనకు విస్మయజనకమయ్యెను —

---

## 3

### శ శ్రీం రా లీ

శాహజాదా అక్బరుచక్రవర్తియొక్క విశ్రాంతభవనమున చక్రవర్తి సముఖమున వచ్చి నిలువంబడియుండెను. ఆతని మోమున విచార రేఖలు పొడసూపుచుండెను. చక్రవర్తి యాతనిం జూచి 'రాథోరు సేనాపతి యెంతమూర్ఖుడో బోధపడినది. మా యాజ్ఞానువర్తియగుట కిచ్చగింపలేదు. వాని కింకను మనసంగతి గోచరింపలేదు. ఢిల్లీశ్వరు నకు సేన లెన్నియున్నవో నాడెరుంగడు. వారల నందఱను వధించి యా పాముకూనను బట్టి తెప్పించి తలవరుల కరకుకరవాలముల కెరగావింతుము.

అక్బరు గద్గదకంఠముతో నిట్లు ప్రత్యుత్తర మొసంగెను,——'నాయనగారూ! నేడు నేచూచిన భయంకరదృశ్యమును స్వప్నము నందైన నెరుంగను. నేను దూరమునుండి చూచుచుంటిని. తమరు అఫ్జుల్ ఖానుచే పంపినరాయబారమువిని అయిదువందల రాథోరు వీరులును ఒక్కసారి పిచ్చియెత్తినట్లైరి. అందఱును తమ ఖడ్గములను ఒరలనుండి బయటకుతీసి మెరపించుచు ఆనందముతో గంతులు వేయ సాగిరి. అదిగో ఇప్పటికిని యూకత్తుల ఝణఝణశబ్దములు దిక్కుల మారుమ్రోగుచున్నవి అటుపిమ్మట——''

చక్రవర్తి కిలకిలనవ్వుచు——'అటుపిమ్మట, నీ వాపిచ్చికుక్కలు కరచునేమోయని భయపడి అంతఃపురమున నాడువాండ్ర చీరచెరంగుల దాగుకొనుటకు పాఱివచ్చితివి! అదేనా నీవు చెప్పునది ఇంకేమున్నది చెప్పు!

అక్బరు తండ్రిచెప్పుమాటలేమో గ్రహింపలేదు, తిరిగి తనదారిని తాను చెప్పనారంభించెను—'అటుపిమ్మట నేనుజూచిన భీషణదృశ్య మిప్పటికిని నాయొడలఁ గంపింపఁజేయుచున్నది. రాఠోరువీరులు తాము చచ్చినపిమ్మట తమస్త్రీలను శత్రువు లేమిసేయుదురోయని యొక గదియందు తుపాకిమందుంచి యందు నాపూబోఁడుల బిగించి యొక్కసారిగ నిప్పంటించిరి. ఒక్కసారిగ నైదువందల రమణీమణుల భీషణహృదయవిదారితమగు ధ్వనివచ్చి నా చెవులఁబడినది. అటు పిమ్మట క్షణకాలములో నంతయు దహనమైపోయినది. ఆవందల కొలది రమణీమణుల కోమలదేహము నొక్కసారిగ భస్మరాసిగా మారిపోయినవి."

ఔరంగజేబా మాటలకు మఱింత నవ్వి—'ఎంత సుందర దృశ్యము! రాజద్రోహులును విధర్ములును కాఫరులును నగు వారలు ఢిల్లీశ్వరుని యాజ్ఞ పాలింపని పాపఫలము వారింతట వారే వెంటనే అనుభవించిరి. ఇంక రాఠోరు సేనాపతి దళమును మన మొగలు సైన్యము సంహరించుట కనుమానమెందుకు?

అక్బరు—దేవా! క్షమించిన నష్టమేమున్నది? వీరులగు రాజపుత్రులు శత్రులగుటకు బదులు మిత్రులైనచో మన ముసల్మాను సామ్రాజ్యము దిగిగ్దింతములందును దినదినమును కీర్తివంత మగును గదా! కావున నీ దాసుని విన్నప మాలింపుడు. రాఠోరు వీరభటుల యపరాధము క్షమింపుడు. విపన్నయు నిస్సహాయయు శోకాతురయు నగు రాఠోరు రాజమహిషినియు, ఆమె నిరపధిరా యగు చిన్న కుమారునియు జోధపురము బోవుట కనుజ్ఞ యిండు."

చక్రవర్తియొక్క ముఖమండల మొక్కసారిగ రుధిరపూర్ణ మాయెను. ఆయన తీవ్రమైన క్రోధముతో కొంత సేపటి వఱ కొక్కటే తీరుగ అక్బరు ముఖమువంక రెప్పవాల్చక చూచెను.

పిమ్మట నాయన లేచి నిలువఁబడి యిట్లు తీవ్రముగాఁ బల్కెను,—'ఇన్ని దినములనుండి నేనెరుఁగ నైతిని. నాప్రక్కలో విషపుపురుగు పెరుగుచున్నదా? ఆహా! ఎంత యన్యాయము! నీవే మంటివి? ఓరి మూర్ఖుడా! నన్ను కుమారుఁ డనుకొనుటకు సిగ్గగుచున్నది. ఔరంగజేబుయొక్క జీవన వ్రతమేమో యెఱుంగుదువా? ఈ సమగ్ర భారతవర్షము నుండియు కాఫరులను దుడిచి వేయవలెననిరా నామనోరథము! అట్టియెడ నీ వంటి మూర్ఖుల యుపదేశముల మాయలలో బడి చిరకాల శత్రువులను పాఱిపోనిత్తునా? ఎంత విచార మెంత విచారము! ఎవరి మాట వింటినో తెలియదు గాని నీ పేరన్యాయయముగ నా మొగలు సామ్రాజ్యకులకళంకుఁడగు అక్బరు పేరు మీద పెట్టితిని. అందుచే నీ బుద్ధులు గూడ నట్లైనవేమో! ఓరీ! మూఢుడా! నా మనోనిశ్చయము విను. రాఠోరు రాజ్యమును యోధపురముతో సహా శీఘ్రమే శ్మశానవాటిక సేయకుందునా? నీకేమైన ప్రాణములపై నాశయుండినఁ దత్క్షణము నా యెదుట నుండి లేచిపొమ్ము. ఇక బ్రతికి యుండగా నా యెదుట నీ పాపిష్ఠి ముఖమును జూపకుము.

అక్బరుయొక్క కోమల ముఖమండల నెఱ్ఱ గారెను. ఆయ నిట్లు పల్కెను,—'మీరు భారత వర్షాధీశ్వరులు, ముప్పదికోట్ల హిందూ ముసల్మానుల భాగ్యవిధాతలు, పవిత్ర మహమ్మదీయ ధర్మావతారమూర్తులు; భారతదేశముయొక్క రాజాధిరాజులు. ఇట్టి వారి కా మాటలు తగునా? తమకు నిజము తెలియఁగలదు. ధర్మమునకు జయమును అధర్మమున కపజయమని పెద్దలు చెప్పుదురు. అవశ్యమట్లు జరుగఁగలదు. నేను దివ్యదృష్టితోఁ జూచుచున్నాను. భారతభూమియందు ముసల్మాను సామ్రాజ్యమంతమగు కాలము సమీపించినది.”

అక్బరు మనమునఁ జింతించుచు మెల్లమెల్లగా చక్రవర్తి సముఖమును నుండి వెడలి పోయెను. ఆతఁడు రాజ భవనమునుండి బయలు వెడలి యెవ్వరినో వెదకుచుండెను. చాలదూర మట్లు వెదకివెదకి కొంత తడవున కొక్కడును ముసల్మాను సైన్యమున్న చోటికి చేరుకొనెను. అక్కడ ప్రౌఢవయస్కుఁడగు ముసల్మాను వ్యక్తి యొక్కఁడు ఒంటరిగ నిల్చి దూరమున నున్న రాజపుత్రసైన్యమును దానిచుట్టు ముట్టియున్న మొగలు సైన్యమును జూచుచుండెను. రాజోరు సైన్య మావేశ మెక్కియుండెను. వారి నిరోధింప ముసల్మాను సైన్యము పెనుగులాడుచుండెను. ఈ దృశ్యమును కౌతూహలపూర్వక ముగా పై జెప్పిన మనుష్యుఁడు తదేకదృష్టితోఁ బోయి జూచుచుండెను. అక్బరు తిన్నగా వాని యొద్దకుపోయి మెల్లనికంఠముతో, "శంశేరాలీ ఇక్కడ వొంటరిగ నేమి చూచుచుంటివి!"

శంశేరాలీ ప్రక్కకు తిరిగి చూచెను. అంత నెదుట నక్బరు ప్రత్య క్షమాయెను. వెంటనే యాతఁడు వంగి సలాముచేసి యిట్లనెను. 'మహారాజకుమారా! ఈ గులాము వాని యపరాధము క్షమింపుడు. తమ రిచ్చటకు వచ్చు టింతవఱకు కెరుఁగలేకపోతిని. నే నింతవఱకు చూచుచున్న దృశ్యమువలన మైమరచి యుంటిని. ఈ రాజోరు వీరుల భీమగర్జనములు విని యిచ్చటకు చూడవచ్చితిని. మొగలు సేనలు రాజోరు శిబిరమును ముట్టడించినవి. రాజోరు వీరులు తమ దీర్ఘకర వాలములను త్రిప్పుకొనుచు గంతులు వేయుచుండిరి. అటుపిమ్మట జరిగిన దంతకంటె భీషణతరము. దానిఁ గన నా గుండెల రక్తమెండి పోయినది. కన్నులారఁ గాంచితిని. రాజోరు రమణీమణు లెందరో భస్మమాత్రమై పోయిరి గదా. వారందఱును వారి తోడఁబుట్టిన వారును భార్యలును పిల్లలును గావచ్చును. వారి భస్మమును వా పాడిని, గట్టుకొనుటకు సిద్ధమైరి కదా. వారి కరుణామయాక్రంద

నములు వినినప్పుడు రాతిగుండెలైనఁ గరగిపోవుటకు సందేహమేమి? పిమ్మట తుపాకీయందుతో నింపిన గదియందు వారినుంచి నిప్పంటించి నప్పుడొక్కసారిగా వేయుమంది యరచిన ఉరుమువంటి యార్తరవధ్వని వినఁబడి యంతలో కుసుమకోమలములైన వారి దేహములు బుగ్గియై పోయినవి గదా. అట్లయిన పిమ్మట రాజోరు వీరులు ఖడ్గములు చేఁబట్టి తెగఁబడి ముసల్మానుగుంపులపై కురికి ముందుకు సాగిపోయిరి. చక్రవర్తిగారి దాసురాజ్ఞ యొసంగిరని వినియున్నాను. రాజోరు వీరులను నురుమాడి యోధపురరాజగు యస్వంతసింగుని పాలుత్రాగు బిడ్డని ట్టితెమ్మని రట—యువరాజా! ఈ దాసుని తప్పులను మన్నింపుడు ఈదాసుని క్షుద్రబుద్ధికి తోచకున్నది. చక్రవర్తిగారింతనిచయుము అన్యాయమును అగు కార్యమేల చేయవలెను.

అక్బరు జాలిగముగ నిట్లు పలుకులు చెప్పెను,—'శంశేరూ! నేడు చక్రవర్తిగారు చేసిన పని చూడ నేను గూడ నీవలెనే విస్మితుఁడను స్తంభితుడనైతిని కాని ఇది మాటలకు సమయముకాదు—నేను చాలసేపటినుండి యొక అవసరకార్యము కొఱకు నిన్ను వెదకుచుంటిని—ఆపనిని నీవు తప్ప మఱియెవ్వరును నిర్వహింపలేరు—నీవు చిన్నప్పటినుండి నన్ను తండ్రివలెఁ బెంచితివి. నీవెప్పుడును సుఖదుఃఖములందు నాకు తోడ్పడియుంటివి. అందుచే నీవొకగొప్ప కార్యభారి మిప్పుడు నాకొఱకు నిర్వహింపవలెను.

శంశేరాలీ యిట్లు బదులుచెప్పెను,—'శాహజాదా! శీఘ్రముగ సెలవిండు—మీకొఱకు ప్రాణమిచ్చుటకైన నేను సంసిద్ధుఁడను.!

అక్బరు—మంచిది—విను చెప్పెదను. తండ్రిగారి దారుణకార్యముచే నాకెంతయు దుఃఖముగా నున్నదని నే నీవఱకే నీకు చెప్పియున్నాను—ఈకార్యమును విరమించుటకు నే నాయనను జాలఁ ప్రార్థించియున్నాను. కాని నా ప్రార్థనలు వ్యర్థమాయెను—కావున

నే నిప్పుడు ప్రతిజ్ఞపట్టియున్నాను. ఏవిధముగనైన నిరపరాధియగు లాహోరు రాజశిశువును సంరక్షణచేసి తీరెదను—చాలవఱకాలోచించి యొక్క యుపాయమును గనిపెట్టితిని.

శంశేర్‌గారు చేతులు జోడించి 'అదేమో సెలవిండు' అనిపల్కెను.

అక్బరు—నీ వేమాత్రమును ఆలస్యము సేయకుండ గొల్లదాని వేషము వేసుకొని గంప నెత్తిమీద పెట్టుకొని లాహోరు సేనాపతి దుర్గాదాసుతో మెల్లగా కలిసికొనుము. ఆయనతో నానుద్దేశ మెఱిఁగించి రాజశిశువును గంపలో బెట్టుకొని దూరముగఁ దీసుకొనిపోయి యొక గుప్తస్థానమున దాచియుంచవలెను అటు పిమ్మట నాకు రహస్యముగ కబురు చేయవలెను.

శంశేరు—బాగుగనే యున్నదికాని నామాట నెవ్వరు నమ్మఁగలరు? నేను పిల్లవానిని రక్షించెదననిన బాదుశాహాయొక్క గూఢచారుఁడనని వారనుమానపడరా?

అక్బరు—అనుమానపడరు. నీవు లాహోరుసేనాపతి నెఱుంగవు. అత డసాధారణబుద్ధిమంతుఁడు. నిన్ను చూచుటతోడనే నీసంగతి గ్రహింపఁగలడు. నీ మాటలపై విశ్వాసముంచఁదగుననియు నీవు నిజమైన మిత్రుఁడవనియు నిమిషములో తెలిసికొనఁగలఁడు. ఇది నా నమ్మకము. శంకవలదు. పొమ్ము. ఆలస్యము సేయ వీలులేదు. నిఖిలబ్రహ్మాండాధిపతి నిజమైన రాజరాజేశ్వరుడు అల్లా హిందూ ముసల్మానులిద్దఱకును రక్షకుడు. సర్వదర్శి నీ కార్యమున కవశ్యము సహాయము సేయఁగలడు.

శంశేరుని ముఖమండలమున సంతోషవీచికలు దొరల నారంభించెను. అతఁడు పావనహృదయుఁడగు నక్బరుయొక్క యాజ్ఞను నిర్వహించుట కంగీకరించెను. ఆ కటికచీకటి పాపపట్టణములో—అధర్మ నిబిడాంధకారములో — మహమ్మదుయొక్క పవిత్రధర్మనిర్మలజ్యోతి!

ప్రకాశించుచుండెను. దాగియున్న అగ్నికణములు గాలి వీచుటచే రగులుకొని మండ నారంభించెను. శంశేరాలీ జీవనముమీది యాశను వదలివేసి అక్బరుయొక్క ఆజ్ఞను నిర్వర్తించుటకు పఱువెత్తెను. అక్బరు అచ్చటనే మనుగునుండి వ్యాకులమనస్కుడై యా దేవదాసవుల భీషణయుద్ధమును గమనించుచుండెను.

అటుతరువాత కొంతసేపటికి మాయలమారియగు ఔరంగజేబు చక్రవర్తికి సర్వమును వినీతమయ్యెను. మొక్కజొన్నతిండరి రాఠోరు సేనాని దుర్గాదాసు అయిదువందల సైన్యముతో నైదువేల మొగలు సైన్యము నుక్కడించి చెండాడి ఢిల్లీలో రాజమార్గమును యుపసరక్తముతో బురదగావించివేసెను. చక్రవర్తియొక్క శాహిమహాలుముందు మొండెములు కుప్పలుకుప్పలుచేసి వీరత్వంబు మెరయ రాఠోరు సైనికులు త్రోవచేసుకొని యోధపురమున కరిగిరి. ఎవ్వరో యొక ముసల్మానుడు యోధపురరాజశిశువును తన యంగరఖాయందు రొమ్ముపై జాగరూకతతో దాచుకొని యొక నిర్జనస్థానమున కెచ్చటికో వెడలిపోయెను.

## ౪

### విచిత్రఫకీరు

ఇంకను సూర్యు డుదయించలేదు. ఈ సమయమున రాఠోరు సేనాపతి దుర్గాదాసును ఆతని విశ్వాసపాత్రుడగు నౌకరు ముకుందదాసును తమ వెంట జోధపురరాణి యగు నరుంధతీదేవిని అంబరు రాజకుమారిక యగు నంబాలికను దీసుకొని యొక మసీదుముందర నిలువబడిరి. ఆ మసీదుకు చుట్టుప్రక్క లెవ్వరును లేరు. కొన్ని దిన

ములనుండి నిద్రగాని ఆహారముగాని లేక అలసినవారలై రాజమహి షియు అంబాలికయు ఒడలు గంపింప మూర్ఛావశిష్టులై యుండిరి. దుర్గాదాసు, "మహారాణీ! ఈ మసీదే యూ దయాశాలి యగు మున ల్మా నుండు స్థానము." అనెను.

అరుంధతీదేవి——ఎక్కడున్నా డాఫకీరు డెక్కడున్నాడు? ఈమసీ దులో మనుష్యు లెవ్వరున్నట్లు లేదే. అయ్యో! గహులకు నా జీవన సర్వస్వమగు బాలు డీలోకము నెడబాసిపోయె నేమో! నే నను కున్నట్లే అయినది. శాదుశాహా యొక్క గూఢచారుడే వాడు నా ప్రాణాధికధనమును వాని కర్పించితిని వాడెచ్చటికో కొనిపోయి యుసురుల నపహరించి యుండవచ్చును.

దుర్గాదాసు—— దేవీ! అట్లెన్నటికిని జరుగనేరదు. మీరు చింతింప వలదు. మసీదులోని కిరుగుడు ఆ ఫకీరు మీ కిప్పుడే కనంబడగలడు. నేను బహు దినములనుండి యూయన నెరుగుదును ఆయన మీద నాకు చాల గురియున్నది. ఈ నాడు మీ రిచ్చట విశ్రాంతి తీసు కొనవచ్చును.

రాజమహిషి కొంచెముసేపు మసీదునందు కూర్చుండి శోక పూర్ణయై కన్నుల నీరు కాల్వలుగట్ట నేడువనారంభించెను. అంత నతాత్తుగా నామె కానందము వెల్లివిరిసెను. ఆమెయెదుట కొక తెల్లని దీర్ఘమగు గెడ్డముదాల్చిన ముసల్మానుఫకీరు వచ్చుచుండెను. ఆఫకీరువెనుక నెవ్వరో అలులాయిత కేశయు శుభ్రవసనయు దేవీ రూపిణియు నగుయువతి యొక చిన్నపిల్లవానిని చంకనెత్తుకొని అత్యంతప్రేమతో ముద్దాడుచు చకచక యామెదగ్గఱకు వచ్చు చుండెను. అరుంధతీదేవి ఫకీరునకు నమస్కరించి యాతురతతో తన చిన్నబిడ్డను చంకనెత్తుకొనెను.

ఫకీరు——మహారాణీ! లోపలకురండు. మహారాణీ తత్క్షణమే

ఫకీరువెంట మసీదులోని కరిగెను. లోపలకు వెళ్ళినపిమ్మట ఫకీరు దుర్గాదాసును కౌగలించుకొని, 'మీరు చాలఁబడలితిరి. స్నానపానములుచేసి కొంచెముసేపు విశ్రాంతిఁ దీసుకొనుడు. పిమ్మట మహారాణీగారి ఆజ్ఞప్రకారము ముందుకర్తవ్య మాలోచింతము.'

దుర్గా——శంశేరాలీ ఇప్పు డెచ్చటనున్నాఁడు?

ఫకీరు——ఇచ్చటే యున్నాఁడు. ఆతఁడు రాజశిశువును చంక నెత్తుకొని యెచ్చట దాచియుంచవలెనా యని తిరుగుచున్నాఁడు. ఈసంగతి నాకు ముందుగనే తెలిసినది. అంత నాతని కీస్థానమును జూపుటకు నాశిష్యవర్గములో నొక్కనిఁ బంపితిని. పిమ్మట మీకు కబురు పంపితిని. ఇఁక నా మాటలన్నియు నెందుకు? బిడ్డా, విలాసకుమారీ! మహారాణిగారిని ఆమెతో వచ్చినవారిని నీ యంతఃపురమునకు తీసుకొనిపొమ్ము. మహారాణీ! నేను చాలదినములనుండి వైరాగ్యవ్రతమవలంబించియుంటిని. కాని సంసారముమాత్రము నన్ను వదలలేదు. ఈ మసీదునందును దీనికి దగ్గరనున్న గృహమునందును నా కనేకమంది హిందూమహమ్మదీయశిష్యు లున్నారు. అందులో, ననేకులు గుప్తచారులై భారతవర్షమం దనేకభాగములందు సంచరించుచు దానవసామ్రాట్టు ఔరంగజేబుయొక్క అత్యాచారములు నాకు వెంటవెంటనే యెరిగింతురు. నాకు సాధ్యమైనంతవఱకు వాని అత్యాచారమును నిరోధించుటకు ప్రయత్నము సేయుచుండుదును. ఈ సమయమున నా సాంసారికజీవనమం దిదియే నే బూనినవ్రతము. ఇంతకుపైన నాసంసారమం దీ ప్రియతమపాలిత బాలిక నొక్కదానిని బిడ్డవలెఁ బెంచుకొనుచున్నాను. ఈమె సంపూర్ణచరిత్ర మీరామెయే మీ కెఱిఁగింపఁగలదు. (విలాసకుమారివంకఁ దిరిగి) బిడ్డా! ఇటురమ్ము. ఆలస్యము సేయకుము. నేడు నీశుశ్రూషఁగోరి జోధపురమహారాణి

నీయతిథురాలనయ్యెను. ఈమెకు నీశక్తివంచనలేక సేవఁజేసి జీవితమును సార్థకము చేసుకొనుము.

ఆహారాదికములైన పిమ్మట నరుంధతీదేవి విలాసకుమారితో నిట్లు ప్రశ్నించెను,—'బిడ్డా! నీవెన్ని దినములనుండి ఈఫకీరును సేవించుచున్నావు? నీచరితము విన నామన సెంతయు కుతూహలపడు చున్నది.'

విలాస కుమారి ఒక్క పెద్ద నిట్టూర్పు విడిచి యిట్లుప్రత్యుత్తర మిచ్చెను,—'మహారాణీ, నాపూర్వచరితము విన్న మీ కెక్కడలేని దుఃఖము రాఁగలదు—ఒకటి రెండుమాటలలో, జెప్పెన నాకథ యావత్తును మీకు బోధపడగలదు. నేను మేవాడ సేనాపతి స్వర్గస్థుడగు విక్రమసింహుని కుమార్తెను'

ఆమాట విని యరుంధతీదేవి నివ్వెరపడి 'ఏమీ? వీరసోలంకి సేనాపతి నిద్రించుచుండగా మ్లేచ్ఛ దొంగలు మీదపడి యాయన బాలిక నెత్తుకొని పోయిరి. నీవా దివ్యసుందరివి, అర్థమైనది.' అనెను.

విలాస—ఔను తల్లీ! ఆదుఃఖము సంభవించి యిప్పటికి కెనిమిదేండ్లైనది. ఈదేవునివంటి ముసల్మాను ఫకీరు ఎట్లు వచ్చెనో తెలియదు. మాతండ్రి చచ్చిపోవు సమయమునకు సరిగా వచ్చి నన్ను పిశాచముల చేతులలో పడకుండ రక్షించినాడు — అప్పటినుండి ఇప్పటివఱకును ఎన్ని కష్టములకైన లోనై నన్ను గాచుచున్నాడు ఈయన అంతులేని ప్రేమనుగూర్చి నేను మీతో నెన్నఁడింపజాలను. నా యిహలోకమును పరలోకమును గురుదేవుడే—నాతండ్రి నాకెట్లు విద్యాబుద్ధులు గఱపెనో ఈఫకీరు పూర్తిగా నేర్పఁగును. కావున నీయన గూడ నాకు రాజపుత్ర భటులతో సమానముగ శస్త్రవిద్య నేర్పుట కారంభించెను. మాతండ్రి నాకు సంస్కృత కావ్యగ్రంథము

లను ధర్మశాస్త్రములను నేర్పుచుండెడివాడు. గురుదేవుడు నదే విధముగ మాతండ్రివలెనే కాళిదాసు భారవ్యాది కవుల గ్రంథము లను భగవద్గీత ఉపనిషత్తాది వేదాంత గ్రంథములను వానితోబాటు మహమ్మదీయ పవిత్రగ్రంథములను బోధించుట నారంభించెను— నాకు వేషభూషణములపైన చాల యిష్టము--అందుచేతనే మాతండ్రి నాకెక్కడలేని వస్త్రభూషణములు దెచ్చి ఇచ్చెడివాడు. అదే విధ ముగ గురుదేవుడును నాకు బహుమూల్య వస్త్రభూషణముల దెచ్చి ధరించుకొనుమని ఇచ్చుచున్నాడు. నాకు చిన్ననాటనుండియు సంగీ తమనిన నిష్టము. అందుచే గురుదేవుడును తన శిష్యులలో నొక ముసల్మాను సంగీతవిద్వాంసుని నాకు సంగీతశాస్త్రము నేర్పుటకు ఏర్పాటుచేసెను—నాగురుదేవుడు మహమ్మదీయుడైనను సంస్కృ తమునం దద్వితీయపండితుండు. గీతయు నుపనిషత్తులును సమగ్ర ముగ నాయనకు వచ్చును. శస్త్రవిద్యయం దాయనతో సమానుం డీ రాజపుత్రస్థానమున లేడు. నేనింత పెద్దదాననైనను + గురుదేవుని కండ్లకు బాలికను—నాకాయ నియ్యదలచిన శిక్షయింకను పూర్తి కాలేదు. నేనింకను జయదేవుని గీతములు చదువుచున్నాను. ఇంకను ఆయన శిష్యులతోబాటు సితారు వాయించుచు పాడుచుందును. ఇప్పటికిని పురుషవేషమును ధరించి ఖడ్గమును జేబూని యుద్ధము సేయ నేర్చుకొనుచుందును. ఇంతేగాక మంచి మంచి బట్టలను భూషణములనుధరించి రంగురంగుల పువ్వుల నలంకరించుకొని నిర్భయ ముగనుందును. గురుదేవుడు ప్రతిదినమును బోధించు మధురస్వర్గీ య యుపదేశములను విని వానిని స్మరణజేసికొనుచు నీ అంధకార హృదయమున నానందధారావాహినిం బ్రవహింపం జేసుకొనుచుందును.

అరుంధతీదేవి యీమాటలు విని విచారపడుచు--'నా కిప్పుడు కొంచెము కొంచెము జ్ఞాపకము వచ్చుచున్నది. ఒకప్పుడు విన్నట్లు

జ్ఞాపకము. వీరసోలంకి సేనాపతి కొక్కతెయే పుత్రిక. ఆపుత్రికకు దేవకుమారి యనిపేరు. ఆమెను మేవాడ రాణా జయసింహునికుమారుఁ డమరసింహునకిచ్చి వివాహము చేసినారు కాదా?' అనెను.

విలాసకుమారి తత్క్షణమే మొగము వెల్లనై చూచెను. కన్నుల నుండి నీరు జలజల గార్ప నారంభించెను పిమ్మట కొంత తడవుండి యామె జీవితములో మొట్టమొదటి పర్యాయ మబద్ధము జెప్పఁ దొడఁగెను. మహారాణీ! మీరు విన్నసంగతియు నిజముకాదు. ఈ సమయమున నాకును ఒక్క సంగతి మిమ్ము నడిగి తెలిసికొనవలె నని యున్నది. తమకు దయచేసి సెలవియ్యవలెను. మీయొద్దనున్న ఈయుచ్చర తేను యెక్కడనుండి వచ్చెను? మీకేమగును'

అరుంధతి—నీవు వినియే యుందువు ఇప్పటి కేనిమిది సంవత్సరములైనది. రాక్షస ఔరంగజేబు వీరుఁడును ధర్మపరాయణుఁడును అగు అంబరరాజ్యాధిపతి జయసింహునిచంపివేసి యున్నాఁడు. ఆయన చిన్న రాణి తన చిన్నకుమార్తె నంబాలికను మేవాడరాజు నొద్ద నుంచి చితి నెక్కుటకు ఉద్యుక్తురాలై ఉదయపూరులో నా పుట్టినింటికి వచ్చినది. అచ్చటనామె నన్ను గలిసికొన్నది. అంత నామె ఈ బాలికను నా కొప్పగించి చితియందు పడి చనిపోయెను. అప్పటి నుండియు నీ అంబరరాజకన్యను అంబాలికను నా యొద్దనుంచుకొని బిడ్డవలెఁ జూచుకొనుచున్నాను.

విలాసకుమారి—మహారాణీ! నేడు నేను మహాధన్యురాలనైతిని. ఇది నాకు మహాసుదినము. నాకింత భాగ్యము గల్గునని నే స్వప్నము నందైనఁ దలంచలేదు. అదుగో గురుదేవులును సేనాపతి దుర్గాదాసును ఇటువచ్చుచున్నారు.

---

# ౫

## ఫకీరుయొక్క ఉపదేశము

విలాసకుమారి ఆనందముతో లేచి నిలువఁబడి యొకటి రెండడుగులు ముందుకు వచ్చి ఫకీరుతో నిట్లనెను,—'గురుదేవా! మహారాణీవెంట నేను మఠమసీదుకువచ్చి తన రూపసౌందర్యముచే దిక్కుల వెలిగించిన దెవ్వరో మీ రెరుఁగ—

ఫకీర మాట కడ్డమువచ్చి—'బిడ్డా! సమస్తమును దుర్గాదాసు నా కెఱింగించినాఁడు. ఆమె అంబరరాజకుమారి, అంబాలిక-' అని నుడివి—

పిమ్మట అరుంధతీదేవి దిక్కుచూచి ఇట్లు చెప్పఁదొడఁగెను—'మహారాణీ! ఇక ముందు తా మేమి చేయఁ గోరుచున్నారో సెలవిండు. మీ రేమియు సందేహింప నక్కఱలేదు. తమయభీష్టమేమో నాతో జెప్పవచ్చు. మీ వీరసేనాధిపతి దుర్గాదా సెంత మీకు విశ్వాసపాత్రుఁడగు భృత్యుఁడో నేనునుఅంత విశ్వాసపాత్రుఁడ నని నమ్ముఁడు. ఒకవేళ నా మాటలు మీ కాశ్చర్యముగా నుండవచ్చును. నేను ముసల్మానునై యుండి చక్రవర్తికి విరోధముగా నుందునా యని మీకు తోఁచవచ్చును. అందువలన మీ కనేక విధముల సంశయము లుదయింపవచ్చును

అరుంధతి—దేవా! ఇక్కడకు రాకముందే దుర్గాదాసు మిమ్మును గూర్చి యున్న సందేహములను దీర్చియున్నాఁడు. అంతేకాక మీ రక్షణలో నున్న ఈ లోకమనోమోహిని విలాసకుమారి కూడ మిమ్మును గూర్చి యెన్నెన్నియో చెప్పియున్నది. ఈ విషయములో నా కావంతి సందేహమును లేదు. మీరు సాక్షాత్తుమనుష్యవేషమున

నున్న యే దేవతామూర్తులో!

ఫకీరు చిరునవ్వు నవ్వుచు—'మహారాణీ! నే నెంతవాడను నిర్బలుడను, దరిద్రుడను, క్షుద్రుడను, వృద్ధఫకీరును గాని క్షుద్ర తృణమును అకారణముగ నిష్ప్రయోజనముగ బుట్టువు చేసి మానవ్య లోకమునఁ బుట్టితిని. నావలన మనుష్యజాతి కావంతయైన నుపకార మైనచో నా జన్మ సఫలమగును. లేనిచో నా జన్మ మనవసరమౌను కంటె నన్యాయమగునని నా విశ్వాసము. ఈనాడు భారతసామ్రాట్టు దురాకాంక్షచే న్యాయ సత్య ధర్మములకు విరుద్ధముగ రాజదండమును జేబట్టినాడు. ఆయన స్వార్థవశుఁడై పైగంబరు మహమ్మదు యొక్క పవిత్ర యుపదేశములను ఖురానుశరీఫు యొక్క సర్మ్మలనీతులను కళంకితము సేయఁదలపెట్టినాడు. ఇట్టిసమయమున నొక ముసల్మానునైన వారెట్టి నిష్ఠురనీతి నడచిన నాయుధమెత్తి సనాతన మహమ్మదీయ ధర్మగౌరవమును ప్రతిష్ఠింపవలసియున్నది. కావున నేను ముసల్మాను ఫకీరునై ముసల్మాను చక్రవర్తితో విరోధముఁ బూనవలసియున్నాను. ఇప్పుడు మీకోరిక నెఱిఁగించిన మీ కెట్టి యుపకారము సేయఁగలనో నేను నిశ్చయము చేసుకొందును.

అరుంధతి—దేవా! తక్కినవారి మాటలన్నియు నటుండనిండు. చక్రవర్తి నామీఁద నెన్నిదినములనుండి యెన్నెన్ని విధముల నిష్ఠురాత్యాచారములు, పైశాచికప్రయోగములు చేసియున్నారో మీకు తెలియును. ఆయన యెన్నెన్ని కపటతంత్రములచేతనో నా పుత్రుని పృథ్వీసింగుని నిరపరాధిని చిన్నతనముననే చంపించివేసినాఁడు. మఱి యింకెన్నియో మాయోపాయములచేత నా రాజాధిరాజును జీవితేశ్వరుని ప్రాణము లపహరించినాఁడు. పిమ్మట నిప్పుడు నా యంధకారమయహృదయారణ్యమందు జీవించియున్న క్షుద్రకుసుమకళికను గూడ నపహరించుటకు కాలాంతకమూర్తియై ప్రత్యక్షమగుచున్నాఁడు.

మఱియు నీ రాజతనయయొక్క తండ్రిని జంపించి సముద్రములోఁ బారవేయించినాఁడు. అంతేగాక మీయొద్దనున్న ఈకన్యారత్నము వలె యింకెందఱ రాజపుత్ర నారీమణులను సర్వనాశము గావించి యున్నాఁడో తెలియదు. ఇప్పుడు రాజస్థానమునంతను శ్మశానమును జేసివేయవలెనని యాలోచించుచున్నాఁడు. నేను క్షత్రియ రాజకుమారి నగుదు, క్షత్రియ రాజమహిషిని అందుచే నేను ప్రతిజ్ఞగొనుచున్నాను ఈయావదత్యాచారమును అవమానమును నేఁ బగతీర్చుకొందునా ? నేను రాక్షసబాదుశాహాయొక్క వంశమును సైన్యమును భస్మముసేయుటకు భీషణ సమరాగ్నిని ప్రజ్వలము సేయకుందునా ?

దుర్గాదాసు ఖడ్గము నొరనుండి తీసి యిట్లు వాక్రుచ్చెను. 'అటు పిమ్మట నీ మీ చిరసేవకుఁడు స్వర్గస్థ యశ్వంతసింహుని చిరవిశ్వాస భృత్యుఁడు ఈకరవాలమునకు నాభీషణసమరానలమున వేల కొలఁది యవనశిరములు నాహుతి యొసంగకుందునా ? యవనుల రక్త ధారలచే భారతజననియొక్క వక్షస్థలమునుండి దాసవుల పదచిహ్నములను గడిగివేయకుందునా ?

అరుంధతి—దుర్గాదాసు! ఈఘోరవిపత్తున నీవే నాకు దిక్కు. నీవు నా సహాయుడవై యుండ నీ దేవతామూర్తి నాపై ప్రసన్నమై యుండ నాప్రతిజ్ఞ సఫలమగుటయం దేమియు సందేహము లేదు. నేను మా రాజపుత్ర రాజేంద్రులకడ కరిగి ఖడ్గభిక్ష పెట్టుమని వేడుకొందును. రాజపుత్రజాతి చాలదినములనుండి సింహాసముల నిద్రించుచున్నది. వారిని నిద్ర లేపించి రణక్షేత్రమునకై పఱువెత్తఁ బ్రార్థించెను.

ఫకీరు—మహారాణీ! నేను మీ కింకేమి చెప్పఁగలను ? నేను దివ్యదృష్టితోఁ గంటిని. మీప్రతిజ్ఞ త్వరలో సఫలముకాఁగలదు.

ఇంక నీసంగతి సెలవిందు. మీచిన్నకుమారు నెచ్చట ఎవరియొద్ద నుంచమనియెదరు ।

మహారాణి—నేనీబాలకుని మీయొద్దనే యుంచవలెననుకొన్నాను; కాని ఇప్పుడు ముసల్మాను సైన్యము గుర్తెరింగి యిచ్చటకు వచ్చుచున్నదని దుర్గాదాసు చెప్పుచున్నాడు. అందుచే వీనిని ఆబూపర్వతముమీద దాచియుంచవలెనని నాకోరిక.

దుర్గాదాసు—మా, మిచ్చటకు రాకపూర్వమే నేను కొంతసైన్యమును ఆబూపర్వతముమీదకు పంపించియున్నాను. వారక్కడకు పోయి న రాక కెదురుచూచుచుందురు. కావున నేనును ముకుందదాసును శీఘ్రముగ రాజకుమారునిం దీసుకొని వారినిం గలిసికొందుము. మిగిలిన రాథోరుభటులను నేను మండలగడముకు పంపించితిని. వారు మహారాణివెంట నుందురు.

అరుంధతి—నేనిక్కడనుండి వెడలి కొన్నిదినములు మా పుట్టినింటివద్ద ఉదయపురము లోనుండి నామహావ్రతమును సాధించుటకు బ్రయత్నము సేయుదును. అనతికాలములో నారావలీ పర్వతములలో నొక క్రొత్తకోటను కట్టింతును అచ్చట రాజపుత్రసైన్యము లన్నియుం జేరునట్లు ఏర్పాటుసేయింతును దేవా! ఆశీర్వాద మొసంగుడు. నాజీవితముయొక్క యీ అంతిమ కోరిక నెరవేరు గాక యనుడు.

ఫకీరు—మహారాణీ! భగవంతుడు మీసదభీష్టము నెరవేరుటకు సహాయపడును గాక!

దుర్గాదాసు ఫకీరును సన్నుతించి యిట్లనెను,—'ఈ యేర్పాటు లన్నియు నైనతరువాత అనగా ఆరావలీపర్వతములపై కోటను గట్టించిన పిమ్మట నందఱురాజు లచ్చట కూడకముందు మహారాణితోం గూడ నేనిక్కడకువచ్చి మిమ్మును గలిసికొందును.'

విలాసకుమారి యింతవఱకును మాటలాడక సంభాషణంతయు వినుచుండెను. కాని దుర్గాదాసు నోటినుండి యామాటలు వెడల గానే యామె యిట్లనెను,—'మహారాణీ! మీరు స్వయముగ గురు దేవుతో నావాగ్దానమును సేయుడు. ఆరావళీ కోటకు పోవుటకు ముందు మీరిచ్చట మాకు దర్శనమిత్తురా?

మహారాణి విలాసకుమారిని స్నేహపూర్వకముగఁ గౌగలించుకొని 'బిడ్డా! మీ గురుదేవుడు నాపై కృపయుంచి యీ కార్యమునందు నాకు సహాయము సేయు వాగ్దానము చేసియున్నాడు. ఆయనయొక్క యుపదేశాశీర్వాదములను గైకొనుటకు నేను శీఘ్రముగనే యిచ్చటకు మరలవత్తును.

విలాసకుమారి ప్రసన్నతాపూర్వకముగ, 'మంచిది, కొంచె మాగుడు. గురుదేవుడు నా కాశీర్వాదించి యిచ్చిన ఖడ్గము నిదిగో తీసుకొనివచ్చి యొక్కసారి మీకు చూపించెదను.' అని పలుకుచు మఱియొక గదియందున్న యొక ఖడ్గమును దెచ్చి, 'ఇదిగో చూడుడు, ఈ ఖడ్గమును దీసుకొని నేను రాజపుత్రవేషమునుధరించి యుద్ధవిద్యను నేర్చుకొనుచున్నాను మీరు తిరిగిఇచ్చుటకు వచ్చునందాక ఈఖడ్గ మును నేను పూజసేయుచుందును. అటుపిమ్మట నీఖడ్గమును జేపట్టి మీ మహావ్రతసాధనమందుఁ జేరుదును. మహారాణీ! నేను మఱి యొక్క భిక్షను మిమ్ముడుగుచున్నాను. మీరు వచ్చునపుడు అంబర రాజకుమార్తె నంబాలికను గూడ మీకూడఁ దీసుకొనిరాఁ బ్రార్థన' అనెను.

మహారాణి—బిడ్డా! అంబాలిక ఈసమయములో సుఖదుఃఖము లన్నిటియందును నాతో నుండునుగదా. అందుచే నా తోఁగూడ నవ శ్యము రాఁగలదు.

విలాసకుమారి అరుంధతీదేవియొక్క పాదములకు మ్రొక్కి అం

దున్నధూళిని శిరమునదాల్చి కన్నులవెంట నీరు బొటబొట గార్చుచు నంబాలికను కౌగలించుకొని ముమ్మారు ముద్దు బెట్టుకొనెను.

## ౬

### రాజపుత్ర వీరమాత

అనతికాలములోనే రాథోరు సేనాపతి దుర్గాదాసు సమస్త రాజపుత్రస్థానములోనురణభేరి చాటింపించెను. వెంటనే సమస్తరాజవంశీయులును ఆరావళీపర్వతములమీదకువచ్చి దుర్గాదాసుతోఁ గలియుచుండిరి. కాని రాజకులశ్రేష్ఠుఁడగు మేవాడ రాజనరేంద్రుఁడు మాత్రము ఈమాతృమందిరమున మహావ్రతములోఁ గలియుటకు రాలేదు. అందఱునుగలిసి రాణాకు చాలజాలికరమును వినయపూర్ణము నగు ప్రార్థనపత్ర మంపిరి. ఇట్టి యాపత్సమయమున రాజపుత్రస్థానము యొక్క దుఃఖమునుగూర్చి రాణాకేమియు విచారములేకుండుటకును జూచి రాజులెల్లరును దుఃఖితులును, విస్మితులునై కారణమరయుటకు ఉదయపూరు రాజభవనమున నున్న కమలాదేవియొద్దకు దూత నంపిరి. దూతయొక్క కరుణామయవాక్కులకు రాణీయొక్క గుండె పగిలిపోయెను. దూత వెడలిపోయిన తరువాత నామె తన కుమారుఁడగు అమరసింహునిఁ బిలిపించెను.

అమరసింహుఁడు తల్లి ముందఱ నిలుచుండి యిట్లడిగెను,— 'అమ్మా! నన్నెందుకు బిలిపించితివి? అది యేమమ్మా! నీ వెందు కేడ్చుచున్నావమ్మా! ఏమి యాపద సంభవించినది?'

మహారాణీ కర్ణావతి యింకను ఏడ్చుచు నిట్లనెను, 'అయ్యో!

నాయన్నా! అమరసింహా! నేడీమేవాడ రాజవంశమునకు వచ్చిన ఘోరకళంకము నెవ్వరు బాపఁగలరు?

అమర—ఆ కళంక మెట్టిది? నాకేమియును దెలియుట లేదు.

కర్ణా—నీ వింతవఱకును వినలేదా? యోధపుర మహారాణి అరుంధతీదేవియు నామె వీరసేనాపతి దుర్గదాసును డిల్లీశ్వరునితో యుద్ధము సేయుటకు గొప్ప ప్రయత్నము సేయుచున్నారు. ఆరావలి పర్వతములమీద మాతృమందిరమును గట్టియున్నారు మహారాణీ అరుంధతీదేవి కీమహావ్రతమున సహాయము సేయుటకు రాజపుత్ర స్థానములోని యావన్మంది రాజులును మాతృమందిరమునకు బోయి యున్నారు.

అమర—అమ్మా! నేనీ శుభసమాచారము చాల దినములక్రిందనే వినియున్నాను. మ్లేచ్ఛుల కాలిధూళిచేత తమసచ్ఛన్నమైన భారత దేశమున నిప్పు డరుణోదయ మగుట కెంతయో ఆలస్యము లేదు.

కర్ణావతి—కాని కుమారా! నీకింకను తెలియదు కాబోలు. రాజస్థానములో కెల్ల సర్వశ్రేష్ఠవంశమం దిన్నాళ్ళ కెంత ఘోర యప్రతిష్ఠ బుట్టినదో - మేవాడాధిపతి మహారాణా యీమహావ్రతమున గూడకపోవుటయే కాక, అది అటుండనిమ్ము, జయసముద్రప్రమోద భవనమందు కమలావతి పైటచెంగున గాగుకొని యున్నాడు.

అమరసింహుడు మెల్లగా నొక దీర్ఘనిశ్వాసమును బుచ్చి, 'తండ్రీగా రింతవఱ కీ మహావ్రతమందు సహాయము సేయకుండు టకు కారణము నా కింతవఱకును దోచలేదు.

కర్ణా—అయ్యో! అమరా! చాల దుఃఖించవలసినమాట! ఈ పుణ్యసమరమందు రాజులందఱును రాణాగారిని జేరమని యెన్నియో ప్రార్థనల నంపిరి. రాణీ అరుంధతీదేవియు నాయన కనేక నివేదనలఁ గావించెను కాని యాయన మోహనిద్రయెల్లను భంగము కాలేదు.

అందు చేత వా రాలోచించుకొని రాణాను ప్రబోధించుటకు నా యొద్దకు దూతనంపిరి—కాని యాదూత విచారించుకొని నాకును రాణాగారికిని యెట్టి సంబంధమో తెలిసికొన్నాడు.

అమర—'అమ్మా! అట్లయిన దూత మిమ్ములను గలిసికొని భగ్న మనోరథుడై వెడలిపోయెనని తోచుచున్నది. తండ్రిగా రిన్నిదినములు నొక్క మత్తుడును సోమరియు నసమర్థుడైన మంత్రిచేతిలో నిరాజ్యకార్య భారమంతయును సమర్పించి నిశ్చింతతో నున్నాడని నేనెరుంగనైతిని.

కర్ణావతి—ఆమాట నాకేమి తెలియును మీ తండ్రిగారి కెఱుక ఆకమలాదేవి కెఱుక,

అమర—మాచిన్నమ్మగారీ సమయమున నిట్లు సేయుట కేమి కారణమో నాకు తెలియకున్నదే. ఆమెకు నా యెడల నెంతయో ప్రేమయే. ఆమె యెడల నేనేమి యపరాధము చేసితినో తెలియరాకున్నది. ఆమె ఇక్కడనుండి వెళ్ళుటకు ముందు మీ రేమైన నామెను నిష్ఠురవచనము లాడియుంటిరా?

కర్ణా—భగవంతుడు సాక్షి ఆమె నెప్పుడును నేను నా చెల్లెలుగా నాదరించుచుంటిని. కాని ఇచ్చటనుండి వెడలుటకు ముం దొక్క నాడామె నాతో, 'విక్రమసింహుని కుమార్తె విలాసకుమారి నొక్కసారి యిక్కడకు తీసుకొని వచ్చి యుంచరాదా! అందుచే నమరుని చిత్తము స్వాస్థ్యముం జెందు' ననెను. ఆమాట నాకా సమయమున రుచింపలేదు. అందుచే నేనా మాట నంగీకరించలేదు. ఇంతకు తప్ప నామెకు కోపము వచ్చుట కింకొక కారణము నాకు కన్పించలేదు. 'ఆమాటలు చెవినిం బడినతోడనే అమరసింహుని ముఖము చిన్నవోయెను. అతండు కొంత సేపటివఱకు తలవంచుకొని కూర్చుండి పిమ్మట నిట్లు మాటలాడెను,—'అమ్మా! నా కాఙ్క్షనొసం

గుడు ఈదాను డీ పుణ్యసమరమునఁ బ్రాణ మర్పించి మేవాడు గౌరవమును రక్షింపఁగలడు’

కర్ణా—కుమారా! నిన్నొక్కండ నంత దూరము యుద్ధమున కెట్లు పంపఁ గలను?

అమర—ఒంటరిగా నేమి తల్లీ! మన భటు లెంతకాలము నుండియో యవన రక్తమును గార్చుటకు తహతహ పడుచున్నారు. మన సన్నయుగు నంత పుణ్యసమరమునకు పరుగెత్తి యసమానవీరత్వమును జూపి యీ జగత్తును విస్మితులను జేయఁగలరు.

మహారాణి ఒక వైపు బాలునొంటరిగఁ బంపుటకు మనస్సంక్షోభముచేతను రెండవ పక్షమున స్వకులగౌరవాభిమానముచేతను గొట్టకొనుచు వేడినిట్టూర్పు పుచ్చి యిట్లనెను,—కుమారా మహారాణాయొక్క ఆజ్ఞ లేని దే సైన్యమును దీసుకొని వెడలిన యెడల మీనాయనగారికిని కమలాదేవికిని విపరీతమైన కోపము వచ్చును గదా!”

ఆమాటకు పుత్రుడు చేతులు జోడించి,—‘అట్లైన నా కాజ్ఞ యిండు. అమ్మా నే నొంటరిగనే పోయివచ్చెదను.’ అనెను.

మహారాణి కన్నుల నీరు నించుకొనుచు,—“హా! విధాతా! మేవాడ రాణాగారి పుత్రుడు యవనులతో యుద్ధము సేయుట కొంటరిగఁ బోవలసివచ్చెనుగదా! మంచిదినాయనా! ఆలస్య మెందుకు? ఈ రాజకుమారవేషము నూడ్చి దీనహీనకృషీవలుని వేషమును ధరించుకొని పొమ్ము.

అమర—ఏలనమ్మా? కృషీవలుని వేష మేల?

కర్ణ—ఔనుతండ్రీ. అచ్చటి మాతృమందిరమున కెందరో రాజులు సేనాసామంతసహితముగ వచ్చియుండ నీవు మేవాడ రాజకుమార వేషముతో నొక్కఁడవును ఖడ్గమును జేపట్టుకొని వారిప్రక్క నిలిచి

యుందువా ? సమస్త వీరలోకమును రాణాయొక్క నామముపై కళంక మాపాదింతురుగదా ! ఆ నిందనెల్ల నీవు విని భరింపగలవా ? అందుచే చెప్పుచున్నాను. దీనహీనకృషీవలుని వేషము ధరించి యొంటరిగ క్షత్రియరాజులయొద్ద రెండు సంవత్సరములవఱకు యుద్ధమం దుండుము. ఆ రెండుసంవత్సరములు గతించువఱకు దేవ్వరికిని సన్నెఱిం గింపకుము. ఎవ్వరైన నిన్నడిగిన నీవు మేవాడదేశము నందలి కృషీ వలబాలకుఁడవని చెప్పుము.

రాజపుత్రమాత తన చీరచెఱగుతో తన కంటినుండి జారగివచ్చు బాష్పజలంబు నద్దుకొనుచు తన చేతులతో కుమారుని దీనహీన కృషీవలుని వేషము వేసి యిట్లనెను, 'నాయనా ! రమ్మా, నిన్నాశీర్వ దించుచున్నాను. ఈ సురాసుర యుద్ధమునందు క్షత్రియశౌర్యప్రకా శముచే ఈ భూమండలంబు నుజ్వలంబు సేయుము. భగవంతుఁడు రక్షించినయెడల రెండు సంవత్సరములపిమ్మట నీ సుందరవదనమును నాకు తిరిగి చూపింపుము.:

కృషీవలవేషము ధరించిన మహారాణా కుమారుఁడు మరల సిం హాసను తల్లి చరణకమలపరాగమును తన మస్తకమున నిడుకొని యొక్కడును సామాన్యగుఱ్ఱము నెక్కి యొక కత్తిని చేతఁబట్టుకొని రాజభవనమునుండి బయలువెడలెను.

ఆహా ! ఎంతయన్యాయము ! ఇప్పు డాదినము లేమైనవి ? ఆ దిన ములనాటి కథలుకూడ నేఁడసంభవములుగాఁ గాన్పించుచున్నవే. అంతేకాదు. అట్టివానిఁగూర్చి చెప్పిన హాస్యప్రసంగములుగాఁ గూడ నున్నవికదా ?

---

## ౭

### మార్గప్రదర్శనము

ఒక్కరాత్రి ఏమియుఁ దోఁచదు ఫకీరు తన మసీదుముందు వెన్నెలలో నొక్కఁడును కన్నులు మూసుకొని కూర్చుండియున్నాఁడు. అకస్మాత్తుగా నొక గుఱ్ఱపు సవారు వాని కట్టెదుట వచ్చి పిలిచెను. ఫకీరు కన్నులు తెరచి, 'ఇనాయతాలీ! చాలదినములకు వచ్చితివి. క్రొత్త సమాచారము లేమైన నున్నవా?" అని అడిగెను.

ఇనాయతాలీ ఇట్లు ప్రత్యుత్తరమిచ్చెను.—'ఆరోజు తిరిగి బాదుశాహాకును రాజపుత్రులకును యుద్ధమైనది. ప్రతి యుద్ధమునందును బాదుశాహాకే యపజయమగుచున్నట్లున్నది.'

ఫకీరు—ఆయుద్ధపు సంగతులన్నియు నాకు దుర్గాదాసు వలన నీవఱకే తెలిసినవి. దుర్గాదాసును జోధపుర రాణియు రెండుదినము లైనది ఇక్కడకే వచ్చి యున్నారు. ఇంకేదైన క్రొత్తసంగతియున్నఁ దెలియఁజెప్పుము.

ఇనాయతలీ—దుర్గాదాసును జోధపురరాణియు బాదుశాహా రాజ్యము నల్లకల్లోలము సేయ సమకట్టిన కార్యమందు తాము కూడ కూడుకొన దాదాపు రాజపుత్రులందఱును బ్రతిజ్ఞ వట్టి యున్నారు. ఒక్క మేవాడు రాణా రాజసింహుఁడు మాత్రము--

ఫకీరు—ఓ! ఈసంగతియు దుర్గాదాసు నా కీవఱకే వినిపించి యున్నాఁడు.

ఇనాయతు—అటులైన నింకొక సంగతి చెప్పెదను. అది మీకు బహుశః తెలియక పోవచ్చును. రాణా జయసింహుని పుత్రుఁ

డమరసింహుఁడొక్కఁడున పహారు చేయుటకు వచ్చి యున్నాడు.

ఫకీరు (ఆశ్చర్యముతో)—ఎక్కడనున్నాడు. నీకు కనఁబడెనా ?

ఇనా—త్రోవలో నాతోఁ గలిసికొన్నాడు. కాని ఆయన నాకు తన సంగతి రహస్యముగా నుంచినాఁడు. నాకు మొదటి నుండియు నాతని విషయము తెలిసియే యున్నది. కాని అతఁడు నాతో తాను మేవాడు దేశపు ఒక దరిద్రకృషీవలుఁడ నని చెప్పెను. రాజోరు వీరుఁడగు దుర్గాదాసును గలుసుకొనవలెనని పోవుచున్నాడట. ఆయనకు నేను మార్గము చూపి ఇక్కడకు తీసుకొని వచ్చితిని.

ఫకీరు—నీవాతని నీ మసీదున కెందుకు తీసుకొని రాలేదు ?

ఇనా—నేను రమ్మని పిలిచితిని. కాని యాతఁడందు కిష్టపడలేదు. తానొంటరిగనే దుర్గాదాసుని గలిసికొందుననెను. ఈవేళనదితీరమున నాయనపరుఁడీ యున్నను ఆయన శ్వేతాశ్వము మఱ్ఱిచెట్టు క్రింద కట్టి యున్నది.

ఫకీరు—నేనిప్పుడే పోయి యువరాజు అమరసింహునిఁ గలుసుకొని యిచ్చటకు తీసుకొని వత్తును. ఇదియేమి? ఈ కేకలు బొబ్బ లెచ్చటివి ?

ఇనా—ఇంకొక సమాచారము. మీతో చెప్పుట మరచితి. త్రోవలో ఈ సంగతి తెలియవచ్చినది. అఫ్జుల్‌ఖాను జిజియాపన్నును వసూలుచేయుటకు నేడు వరదేవపూరు గ్రామములోని నిరపరాధ నిరీహప్రజల యిండ్లను దోచుకొనఁబోవుననని వింటిని. బహుశః ఆ కేకలు అవియే కావచ్చును. అఫ్జుల్‌ఖాను ఊరు నాక్రమించి యుండును.

ఫకీరు—సరే నీ విప్పుడు విశ్రాంతి గైకొనుము. నేనీ విషయమును గూర్చి తగు జాగ్రత పెట్టెదను.

ఇనాయతాలీ వెడలిపోయెను. ఫకీరు కొంచె మాలోచించి ప్రక్క గదిలోనికి పోయి యచ్చటి కిటికీ దగ్గఱ కరిగి ప్రేమపూర్వకముగ నిట్లు కేక వేసి పిలిచెను—'బిడ్డా విలాసకుమారీ! కొంచె మిట్లురా. చాల తొందరపని వచ్చినది.'

విలాసకుమారి ఫకీరుయొద్దకు వచ్చి—'నాయనా! గురుదేవా! ఏమి యాజ్ఞ?'

ఫకీరు—'బిడ్డా! నీవు తత్క్షణమే యొక తొందరపనిమీద పోవలసి యున్నది.'

విలాసకుమారి సలజ్జాభావయగుచు, గురుదేవా! నకొక స్వప్నమై యందు రాజకుమారు డొక్కఁడు మన మసీదుకు వచ్చినట్లు కనంబడెను.'అనెను.

ఫకీరు—కల్యాణీ! నీస్వప్న మిప్పుడే సత్యమయ్యెడును. ఇదుగో విను. హరదేవపురములో పెద్దగోల జరుగుచున్నది. పాపాత్ముండగు యవన సేనాపతి అఫ్జుల్ ఖాను యొక్క సైన్య మాగ్రామజనులపై బడెను. అందుచేత నీ వొక్క కార్య మీ సమయమునం జేయవలసి యున్నది. ఈ ప్రక్కనున్న చెట్టుక్రింద నదియొడ్డున నొక తెల్లని గుఱ్ఱము కట్టియున్నది. ఆ గుఱ్ఱముదగ్గర నొక్క వీరపురుషుఁడు నిద్రించుచుండును. నీ వాయనను యవనులతో యుద్ధము సేయుటకు పురికొల్పి వెంటనే నాయొద్దకు తీసుకొని రమ్ము. మఱి యొక మాట బిడ్డా, శ్రద్ధగా విను. గుండెను గూడులో దాచుకొనుము. నీ వాయన సంగతేమి యని యడుగవద్దు. నీసంగతి ఆయనకు చెప్పవద్దు.

విలా—అటులైన నేమి నేను సిపాయివేషమున గుఱ్ఱమెక్కి పోవలెనా?

ఫకీ—వద్దు-బిడ్డా! ఇంకను ఆ తరుణము రాలేదు.

విలాసకుమారి మాఱుమాటాడక వెడలిపోయెను. ఫకీరు మసీదులో మఱియొక గదిదగ్గఱకు పోయి గట్టిగా కేకవేసి పిలిచెను— 'వీరసేనాపతి దుర్గాదాసు! రారోరు వీరముకుందదాసు! తక్షణముఖడ్గములఁ గొని బయటకు రండు.

ఈ గదియందు దుర్గాదాసును ముకుందదాసును బహుశః పడుకొని యుందురని ఫకీరు తలంచి యుండవచ్చును. కాని ఎవరును ప్రత్యుత్తర మియ్యకపోవుటవలన నాతనిలో నాతఁడే యిట్లు అనుకొనెను,—' నే నెందుకు మరచిపోతిని? దుర్గాదాసును ముకుందదాసును ఇప్పుడే ప్రాతఃకాల కృత్యములు నెరవేర్చుకొనుటకు నదియొద్దనకు పోయి యుండవచ్చును.

పరిత్యాగకాలమున హరదేవ పురగ్రామమునకు కొంచెము దూరములో నదియొద్దన నిర్జనస్థలములో చెట్టుక్రింద కృషీవలవేషము దాల్చిన అమరసింహుఁడు ఒంటరిగ భూమిమీద పడుకొని నిద్రింప బోవుచు నాలోచించుచున్నాడు. ఎనిమిది సంవత్సరము లైనది. నాచిన్నతనములో రాజసముద్రతీరమున నొక బాలిక కనఁబడినది. అది యెక్కడనుండి యూడి పడినదో తెలియదాయెగదా. ఒక్కసారి మాత్రమే నాకన్నుల ధన్యము చేసి తరువాత మాయమైనది పిమ్మట దాని నెన్ని సారులో వెదకితిని. కాని యా దేవతా విగ్రహము, ఆసౌందర్య నిధి—ఆహారచుండాస్కలితసుధాంశు రేఖ మరల నీజగత్తులో కనఁబడదాయెగదా.

ఆకృషీవలయువకుడు నిద్రలో బయలు దేరి పోయెను. వాని ముందు వాని యోచన వెడలి పోవుచున్నది. ఏమరున నేదారిని బోయిన నా దివ్యసుందర విగ్రహము నొక్కసారి తిలకింపవచ్చును. అంతలో నొక్క లోకము సృష్టి యాయెను. ఆలోకములో నా యమృతనిధిని వెదకుచు వెదకుచు బోయియొక్కండును ఒక ఎత్తైన

పర్వతశిఖరముపై నెక్కెను. ఆపర్వతముపై నెవ్వరును లేరు.కొండక్రింద నొక పెద్ద నది జలజల ప్రవహించుచున్నది. ఆ నిర్మానుష్యమైన కొండకొనపై నిలిచి యా యువకు డుచ్చస్వరమున, 'అయ్యో! ఒక్క సారియైన నది మరల కనబడదా?' అని కేక పెట్టెను.

ఎవ్వరో తెలియదు పైనుండి తిరిగి జవాబుచెప్పిరి'-- 'అందుకు చింతింపవలదు. తిరిగి కనంబడును'

యువకుడు కండ్లెత్తి చూచెను. ఎవ్వరో యొక లావణ్యవతి అలులాయతకుంతల రమణీమణిపై నుండి యూతసి ముందుకు వచ్చి నిలువంబడి మధురస్వరముతో తిరిగి కనంబడును' అని బదులు చెప్పెను.

కృషీవలుండు దుఃఖభావపూర్ణుండై, 'ఎచ్చట కనబడును! ఎప్పుడు కనంబడును?' అని ప్రశ్నించెను.

రమణి—'ఇప్పుడే, నీ యెదుట చూచుకొనుము'

యువకుడు తత్తరపాటుతోడను ఆశ్చర్యముతోడను యెదట చూచెను.—అచ్చట మంచిమంచి భవనములతో నిండిన యొక రాజ నగరము కాన్పించెను ఆ రాజనగరము మధ్య చాల పొడవును వెడల్పును గల మండపములో నసంఖ్యాకులగు దానవులు గూర్చుండి భీషణమును హృదయవిదీర్ణమును నగు నట్టహాసములతో నాకాశమును బ్రతిధ్వనింపం జేయుచుండిరి. ఆ అట్టహాసములతో నాలుగు వైపులనుండియు అసంఖ్యాకులగు ప్రజల హాహాకారములు వచ్చి కలియుచున్నవి. రాజనగరికి నాలుగువైపులను రక్తనదులు పారుచున్నవి. ఆరక్తనదులలో వేలకొలదిమనుష్యశరీరములును యజ్ఞోపవీతధారులగు బ్రాహ్మణుల దేహఖండతుండెములును యువతుల మొండెములును వారియొక్క కోమలాంగభాగములును తేలుచును మునుగుచును గొట్టుకొని పోవుచున్నవి.

ఆ రమణీలలామ యొక్కింతసే పూరకుండి మరల, 'ఇక పైనం జూడు' మని ప్రబోధించెను.

యువకుడు ఒడలెల్ల పులకింప నా కాశమునంకం జూచెను—నీల గగనముపైన రత్నఖచితమైన యొక బంగారు కొండయుండెను. కొండక్రింద మందాకినీనది శుభ్రసలిలమై కనకకమలశోభితమై మృదుమధురకలకలనినాదంబుతోం బ్రవహించుచుండెను. కొండపైన పారిజాత పుష్పంబులతోం బ్రకాశింపుచు నొక్క యపూర్వ సింహాసనముండెను. ఈసింహాసనము సుధాంశు కిరణజాలములతోడనో దివ్యలతాంతములతోడనో నిర్మించినట్లు కనంబడుచుండెను. సింహాసనము చుట్టును అనేక సురకన్యలు నిల్చి తమ మంగళగీతములచే నమరలోకంబును బ్రతిధ్వనింపం జేయుచున్నారు అంతేకాదు ఇది యేటి యాశ్చర్యము! కృషీవలయువకు డానందముతోడను విస్మయముతోడను దిలకించెను. కనకమయగిరిపై కాంచనకమలమయ యగు మందాకినీనదిచెంత సుధాంశుకిరణ నిర్మిత సింహాసనము ముందు అసంఖ్య సురనారీజనమధ్యమున అసంఖ్య తారాగణమధ్యమున చంద్రరేఖంబోలి పరిపూర్ణకళాశోభితయై మున్ను దర్శనమిచ్చిన నారీవిగ్రహము ప్రత్యక్షమాయెను. ఆ 'రాజసముద్ర' తీరమున నవతీర్ణమైన తేజోమూర్తియిదియే. ఆహా! సందేహములేదు. జగన్మోహనమూర్తి!

రమణీమణి ముగ్ధహృదయుండగు కృషీవల యువకుని లలాటము నంటి ఇట్లనియె,—'ఏమి? నీ వచ్చుటకు పోంగోరుచుంటివా? అటులైన నందు కపారసాహసమును అపారసాధనయుం గావలసియున్నవి. ఈభీషణ మూర్తులును, అంతకంటె పరాక్రమవంతులును అగు దానవులను ముందు సమరంబున గెలువవలెను. ఈ మూసుకొనిన కండ్లను దెరువవలెను. ఈవిషణ్ణవదనమును విడువవలెను. దేవతల

నొక్క యాశీర్వాదమును బొందవలెను. ఈరక్తనదులను దాట వలెను అప్పుడుగాని నీవచ్చటకుఁ బోలేవు ఇప్పుడు చెప్పు. పోఁ గలవా?

యువకుడు—' దేవీ! ఆశీర్వదింపుము. తప్పక పోఁగలను.

రమణీమణి గంభీరమగు మధురస్వరముతో భూనభోంతరాళములు కంపింప నిట్లు పల్కెను,—' అటులైన లెమ్ము, అటులైన నింక నిద్రింపకుము.'

ఈకేక కాదైత్యరాజధాని గజగజలాడెను,—' లెమ్ము, లెమ్ము ఇఁక నిద్రపోఁగూడదు.'

యువకునకు మెలకువ వచ్చెను. సుఖస్వప్నము సమాప్తమాయెను. ఆతఁడు కన్నులు చిట్లించుచు నలువైపులఁ జూచెను. ఒకవైపు కాళిందీ నది మెల్లమెల్లగా ప్రవహించుచుండెను. నలువైపులను మనుష్యులెవ్వరును లేని చెట్లగుంపులుండెను. ఇందనుకఁ జూచిన పర్వతశిఖరమేది? దానవుల రాజధాని ఏది? ఆదేవతలేరి? ఆకనకగిరియేది? ఆ మందాకినీనది ఏమైపోయినది? ఆ బంగారు సింహాసన మెచ్చటికేగినది? దాని చుట్టునున్న అచ్చరకన్నెలందఱేమైరి వారిమధ్యను పూర్ణశశిరేఖంబోలి వెలుగుచుండిన జ్యోతిర్మూర్తి! అయ్యో! అంతర్ధానమైనదా? యువకుఁడు తహతహపడుచు వెనుకకు తిరిగిచూచెను. అచ్చట నా అలులాకుంతల సుగవధూమణి నిలిచియుండెను. ఏమిది! ఇదికూడ స్వప్నమేనా? ఈసంగతి స్పష్టము చేసుకొనుటకు యువకుఁడు నాలుగు వైపులను పరికింప నారంభించెను. ఏమిది? కలయా నిక్కువమా? ఆకాశమున నక్షత్రములు తళుకుతళుకునఁ బఱువిడుచున్నవి. చంద్రుఁడు కలకల నవ్వుచున్నాడు. క్రింద నీల వసనయు చంచలప్రాణయు నగు తరంగిణి తారహారముల నలంక

రించుకొని నృత్యము సేయుచున్నది. అట్లయిన నిది స్వప్నముకాదు. సత్యమేనా!

రమణి—లెమ్ము లెమ్ము. ఇఁక నిద్రింపఁగూడదు. ఏమి? ఈకంఠ ధ్వని యూసిగ్రలో విన్న మధురకోమల మనోహరమైన యా కంఠ స్వరమే గాఁబోలునని చకితుఁడై యూకోమలి దెసఁ గనుఁగొని లేచి నిలువఁబడెను

రమణి—మీయొద్ద ఖడ్గము లేదా?

నిద్రనుండి యిప్పుడే లేచిన యువకుఁడా ప్రశ్నకు మిగుల విస్మితుఁడయ్యెను. అందుచే నామెకు బదులు చెప్పుటకును గొంచెము నిర్ఘాంతపోయి మాటాడ నారంభించెను.

అసంగతి కనిపెట్టి యా సుందరాంగి జవాబు వచ్చునేమోయని కొంతతడవు వూరకుండెను. అప్పటికిని వల్లె కనపడని యా యువకు దూరకన్నందున నామె తిరిగి యిట్లు ప్రశ్నించెను,—'మీయొద్ద ఖడ్గమున్నదా? హృదయమున సాహసమున్నదా? బాహువులం బరాక్రమమున్నదా? నాళముల నార్యులరక్తము పారుచున్నదా? మనసున స్వర్గాదపిగరీయసి యను జన్మభూమిమీఁద గౌరవ మంటి యున్నదా? మాటలాడ రేమి?'

కృషీ—ఉన్నది.

రమణి— అట్లైన నా వెంటరమ్ము.

కృషీవలుఁడు మంత్రముగ్ధుఁడైన ట్లాతరుణీమణి వెంట వెంట నడచి పోయెను.

ఆ సుందరాంగి శీఘ్రముగా నడచి కొంచెము సేపటిలో మసీదు దగ్గరకువచ్చి చేరి యాకృషీవలునితో నిట్లనెను,—'మీ రొక్క క్షణకాల మిచ్చట వేచియుండుడు. నే నిప్పుడే తిరిగివచ్చెదను.'

యువతి మసీదులోని కరిగెను. కృషీవలుఁడును అచ్చట విశేషము

వేచియుండవలసిన యవసరము లేకపోయెను. అమె వెంటనే ఫకీరుతోఁ జెప్పి యాయన నచ్చటకు తీసుకొనివచ్చెను. గైరికవస్త్రధారియగు ఫకీరు కృష్ణవలుసి యెదుట ప్రత్యక్షమాయెను. వాని దక్షిణహస్తమున నొక భీషణకృపాణము చంద్రకాంతు లీనుచుండెను. ఆయన తెల్లని పొడుగగడ్డమును మీసములను జటాజూటములనుగల గంభీరాకారముఁ జూచి యాతని యొడలు గగుర్పొడిచెను. హృదయము భక్తిరసముతో నిండిపోయెను. అట్టి జ్యోతిర్మయమగు యోగిమూర్తి నాతఁ డెన్నఁడును జూచియుండలేదు. ఫకీరు కన్నులు పెద్దవిచేసి కృష్ణవలునిఁ జూచి మందహాసముతో నిట్లనియె,—'బిడ్డా! నీవిక్కడ నేయుండుము. నే నీ వీరుని వెంటఁదీసుకొని ముసల్మానులతో యుద్ధము సేయఁ బోదును'.

ఫకీరు తొందరతొందరగా ముందు నడిచెను. కృష్ణవలుఁడు గూడ నాయన వెంటనంటి [illegible] నడిచెను

## ౮

### కాఫరా లేక ముసల్మానా?

'ఊరుకో! ఊరుకో! ఔరంగజేబుచక్రవర్తియొక్క సేనాని అఫ్జుల్ ఖాను వచ్చుచున్నాడు' ఈప్రకారముగా హరదేవపురగ్రామములో నర్ధరాత్రివేళ నొక యిల్లాలు తనపిల్లవానిని భయపెట్టి నిద్రపుచ్చుచున్నది. బాదుశాహాయొక్క ప్రియ సేనాపతి అఫ్జుల్ఖాను చాల దినములనుండి కాఫరుధర్మము నూరుపేరు లేకుండ రూపుమాపుటకు ప్రయత్నము సేయుచుండెను. ఈ ప్రయత్నములో విశేషమేమి సేయుచుండెనన, 'జిజియా' లేక కాఫరు పన్ను అనుదానిని హిందూప్రజల నుండి వసూలు చేయుట 'కాయన

అనేక సార్లు దుర్దాంత పరాక్రమము చూపుచుండెను. ఒకప్పుడు హరదేవపురమునందును ఆ ప్రాంతముల నుండు ఇతర గ్రామములందు నున్న హిందువులు పన్నిచ్చుటకు నిరాకరించిరి. అఫ్జుల్‌ఖాను చాల సైన్యమును దీసుకొని రాజద్రోహులగు పురుషుల చేతులను స్త్రీల చెవులను కాలు వ్రేళ్ళను నఱకించుట కాజ్ఞయిచ్చి చాలమంది కాఫరులను గోరక్తముతో స్నానము సేయించి 'ఖురాను షరీఫ్' యొక్క కల్మా వారిచే జదివించెను. ఆ దినమునుండి ఈ గ్రామములలోని చిన్న పెద్దలును స్త్రీపురుషులును అందఱును అఫ్జులనిన జాల భయపడుదురు. విశేషముగ చిన్నపిల్లలు అఫ్జులుఖాననిన నొక పెనుభూతముగా దలంతురు. ఈ కారణముచే నీ తల్లి నేడు పిల్లవానిని అఫ్జులుఖాను పేరు చెప్పి భయపెట్టుచుండెను. పిల్లవాడు అఫ్జుల్‌ఖాను పేరు వినినతోడనే పకుప్పుహానివేసి గట్టిగా తల్లి మెడను కౌగలించుకొని కన్నులు మూసుకొనెను.

ఒక్క క్షణములో పిల్లవాడు తల్లిమెడను వదలి వెల్లకలబడెను. తల్లి యొడలు వణకుచు లేచి కూర్చుండెను. పిల్లవాడు మరల నేడువ దొడంగెను. నిజముగానే అఫ్జుల్‌ఖాను వచ్చియుండెను. ఊరిలో నంతయు భయముచే కేకలు రేగిపోయెను. ఆ కేకలలో 'మరలా అఫ్జులుఖానమ్మా! జిజియా పన్ను దమ్మిడీ బాకీ లేకుండా అందఱు నిచ్చివేసి యున్నారు. మరల వీ డెందుకు వచ్చాడమ్మా' అని అందఱును చెప్పుకొనసాగిరి. గుంపులు గుంపులుగా ముసల్మాను సైన్యములు ఇండ్లతలుపులు బ్రద్దలు గొట్టి యిండ్లలో దూరబడి వెండిబంగారము లెత్తుకొని పోవుచుండిరి. ఆవుల శాలలలో దూరబడి ఆవులను జెవులు పట్టి దోలుకొనిపోదొడంగిరి. స్త్రీలను శిఖలం బట్టికొని ఈడ్చుకొని పోవుచుండిరి. గ్రామవాసు లేడ్చుచు, 'చక్రవర్తిగారికి దండములు! మావల్ల నపరాధ మేమియులేదు.' అని మొరలిడుచుండిరి.

కాని యీ కొల్లలాలకించు వారెవరు? అఫ్జల్‌ఖాను గుఱ్ఱముపై నెక్కి ప్రోత్సాహముతో తన సిపాయీల కాజ్ఞ యిచ్చుచుండెను. 'ఖబడ్దారు! ఒక్క కాఫరుకూడ పారిపోనియ్యవద్దు. ఒక్కయువతి గాని ఆవుగాని చేతిలోనుండి తప్పించుకొని పోనియ్యవద్దు. ముసలి యాడవాండ్లను పిల్లలను నా క్రమమే నరికిపెట్టవచ్చును.'

పాపము! గ్రామవాసు లేమెరుంగుదురు? వారేమైన రక్షించుకొను నుపాయము నాలోచించుకొనకముందే యవనులు రాక్షసులవలె నాయుధములతో వచ్చి వారిపై బడిరి. మహమ్మదీయ సైన్యములు యువకులను వృద్ధులను తరుణులను గోవులను బంధించి తమ శిబిరమునకు గొంపోయిరి. ఆ నిర్జన ప్రాంతమునందు వారి యానందమునకు మేర లేదు. వారి తర్కవితర్కము లేమి? 'మొట్టమొదట నేగోవును వధింతము. ఎవ్వరే స్త్రీని చెఱబట్టవలెను. అఫ్జల్‌ఖా నేసుందరిని నెన్నుకొనునో' అని మీమాంసలు జరుగుచుండెను. ఈసమయమున పీరుబక్షనువాడు—'అరే రహీంఖాన్! ఇద్దఱు కాఫరులు త్రాడు తెంచుకొని పారిపోయిరిరా'

రహీంఖాను—'అట్లాగా! కాదు కాదురా! వాండ్రు వీళ్లలో వాళ్లు కారురా. ఇంకొక యూరు వాళ్లై యుండ వచ్చునురా.'

పీరుబక్షు—ఇంకో ఊరువాళ్లైతే నేమిరా కాఫరులేగా?

నిజముగాం గొంచెముదూరములో నిద్దఱు హిందువులు నదిలో స్నానముచేసి మహిమ్నస్తోత్రమును పాడుచు నాత్రోవను వచ్చుచున్నారు. పీరుబక్షుమాట పూర్తియైనతోడనే నాయిద్దఱును తొందర తొందరగా నచ్చటకు వచ్చిరి.

ఒకడిట్లడిగెను.—ఇదియేమి తమ్ముడూ! నేడిచ్చటింత గంద్రగోళమయ్యెను?

పీరుబక్షు జవాబిట్లు చెప్పెను—'నిన్నింకను కారణముఖముగు చుగ్గనా? కాఫరు! దరిద్రుడా! మీయిద్దఱను గూడ వీరితో గట్టివేయ వలెనా యేమి?

ఆగంతుకుడు—వీరి నెక్కడకు తీసుకొని వెళ్లెదరు?

పీరుబక్షు—నవాబుసాహేబుడేరాకొరకి-అరే చూస్తా వేమిరో! ఈ సాలానుగూడ కట్టరా పట్టుకొని—

ఆగం—ఎందుకు కంతతొందర బాబూ-మేమేమి పాటిపోవు వాం డ్రముగాము. అడిగి దానికి సమాధానంచెపితే ఇంతిలో నష్టమేమి పడిపోయింది? ఇంతమంది మనుష్యులు, ఇన్ని గోవులు, ఇంతమంది ఆడవాండ్రు-ఎందుకు వచ్చినది. పట్టుకొని వెళ్లి యేమి చేసెదరు?

పీరు— అరే కాఫరా!—కంబఖ్త్!— ఏమీ తెలియదనుచున్నాడు. ఈఆవు లన్నిటిని కోసి కబాబు వండిస్తాము. వీరి రక్తంలో ఈ కాఫరులను స్నానం చేయిస్తాం.

పీరుబక్షు చీకటిలో చూడలేకపోయెనుగాని వానివమాటలు విన్న వానికి కన్నులు జపాకుసుమము లట్లు ఆగ్రహముచే నెఱ్ఱబడియెను. పీరుబక్షు ఇంకను చెప్పుచుండెను, 'అటుపిమ్మట వీరంగఱిని ఒక్కొ క్కరినే కొఱతవేయించెదము. వీరిభార్యలను మేము నిక్కా కట్టు కొందుము.' అట్లనుచు ప్రక్కనున్న నొక్కముసుగువేసుకొనియున్న యువతిమెడపై చెయివేసి,-'ఈ మేలిముసుగునున్న బీబీజాన్‌తో మసీదుకువెళ్ళి పీరుబక్షు స్వయంగా నిక్కా—'

పీరుబక్షు పైమాట లింకను చిన్నగా పూర్తికాలేదు. ఆగంతు కులలో నొకడు వాని ఛాతిమీద నొక్కతన్ను అసిరిపడునట్లు తన్నెను. వాడు కొంచెముదూరముగిపోయి పడి స్పృహతప్పిపోయెను. రెండవమనిషి వెంటనే ఒకరిద్దఱు ఖైదీలను చేతులకట్లు వదలించి విడిచిపెట్టెను. పీరుబక్షు పడిపోవుటఁజూచి కొందఱు ముసల్మానులు

పఱుగెత్తుకొనివచ్చి యా యాగంతకు లిద్దఱపై నాక్రమించిరి. దూరమునుండి అఫ్జల్ ఖాను,—'ఆ ఇద్దఱినుగూడ వీరితో బంధించుకొనిరండి' అని ఆజ్ఞాపించెను.

కాని ఎవరెవరిని బంధించువారు? ఇద్దఱాగంతుకులును ఒక్క-క్షణములో దగ్గఱనున్న మామిడిచెట్టునుండి రెండుదిట్టమైనకొమ్మలు చేతఁబట్టుకొని పెద్దగంభీరమైన స్వరముతో బిగ్గరగా భోలోనాథుని స్తుతినిఁ జదువనారంభించిరి ——

పశూనాంపతిం పాపనాశం పరేశం
గజేంద్రశ్య కృత్తింవసానం వరేణ్యం
జటాజూటమధ్యే స్ఫురద్గాంగవారిం
మహాదేవమేకం స్మరామి స్మరామి॥ ౧
మహేశం సురేశం మరారాతినాశం
విభుం విశ్వనాథం విభూత్వంగభూషమ్
విరూపాక్ష సోమార్కవహ్నిత్రనేత్రం
సదానందమీడేప్రభుం పంచవక్త్రం॥ ౨
గిరీశం గణేశం గళే నీలవర్ణం
గజేంద్రాధిరూఢం గుణాతీతరూపం
భవం భాస్వరం భస్మనాభూషితాంగం
భవానీకళత్రం భజేపంచవక్త్రం॥ 3
శివాకాంత శంభో శశాంకాంగవాళీ
మహేశాంచశూలిన్ జటాజూటధారిన్
త్వమేకో జగద్వ్యాపకో విశ్వరూపం
ప్రమోద ప్రమోదప్రభో పూర్ణరూపం॥ ౪
పరాత్మానమేకం జగద్బీజమాద్యం
నిరోహం నిరాకార మోంకారవేద్యం

యతో జాయతే పాల్యతే యేన విశ్వం
తమీశం భజే లీయతే యత్రవిశ్వం॥ ౫
నభూమిర్న చాపో న వహ్నిర్న వాయు
ర్న చాకాశమాస్తే న తంద్రా న నిద్రా
నగ్రీష్మో న శీతం న దేశో న వేషో
నయస్యాస్తి మూర్తిస్త్రిమూర్తిం తమీడే మహేశం॥ ౬
అజం శాశ్వతం కారణం కారణానాం
శివం కేవలం భాసకం భాసకానాం
తురీయం తమః పారమాద్యంతహీనం
ప్రపద్యేపరం పావనం ద్వైతహీనం ॥ ౭
నమస్తే నమస్తే విభో విశ్వమూర్తే
నమస్తే నమస్తే చిదానందమూర్తే
నమస్తే నమస్తే తపోయోగగమ్య
నమస్తే నమస్తే శ్రుతిజ్ఞానగమ్య ॥ ౮
ప్రభో శూలపాణే విభో విశ్వనాథ
మహాదేవ శంభో మహేశ త్రినేత్ర
శివాకాంత శాంత స్మరారే పురారే
త్వదన్యో వరేణ్యో నమాన్యో నగణ్యః ॥ ౯
శంభో మహేశ కరుణామయ శూలపాణే
గౌరీపతే పశుపతే పశుపాశనాశిన్
కాశీపతే కరుణయా జగదేతదేక స్త్వం
హంసిపాసి విదధాసి మహేశ్వరోసి ॥ ౧౦
త్వత్తో జగద్భవతి దేవభవస్మరారే
త్వయ్యేవ తిష్ఠతి జగన్మృడ విశ్వనాథ

త్వయ్యేవ గచ్ఛతి లయం జగదేతదోశ
లింగాత్మకే హరచరాచర విశ్వరూపిన్ ॥ ౧౧

ఇద్దఱు వీరులును మహాదేవుని స్తుతించుచు చెట్లశాఖలతో మును ల్మానుసైనికులను కొట్టికొట్టి పడఁగొట్టుచుండిరి. ఖైదీలును ఊడదీసుకొని 'బోంబోం' అని మహాదేవుని స్తుతింప నారంభించిరి. అఫ్జల్ ఖాను భీముఁడును విస్మితుఁడు నగుచు సైనికులను సంబోధించి యిట్లనెను. 'అరే మీకు పౌరుషము చచ్చినదా? చేతిలో నాయుధముండియు మీరు చేతగానివారిచేత దెబ్బ తినుచున్నారా? మీరు తలచుకొనిన నిప్పుడే వారిని పరలోకమంపఁగలరు.'

ఈమాటలు విని ముసల్మాను సైనికులు కత్తులు చేఁబట్టి యాగంతుకులపై గదిసిరి.

ఆ యిద్దఱు వీరులును గొంచెమైన జంకలేదు, ఒక్క యడుగైన వెనుక వేయలేదు. హృదయమందు దేహము భయమనుమాట లేక యమానుష సాహసముతో నవిచలితచరణములతో వారు ఖడ్గములఁ జేపట్టి పోరాడువారిపై చెట్లకొమ్మలు వెట్టి కొట్టనారంభించిరి. తోడనున్న వారి 'బొంబొం శంకరు' అను జయధ్వని వినఁబడుచుండెను. ఖైదీలును ఈ చిత్రమును గనుఁగొని చెట్టుకొమ్మలవిరిచి చేతఁబట్టుకొని 'బొంబొం శంక' రని ముసల్మానుల అంతు కనుఁగొనసాగిరి. ఖైదీస్త్రీలుగూడ మంత్రముగ్ధలైనట్లు వెనుకనిలిచి చప్పటులుగొట్టుచు నొక్కకంఠముతో 'బోం బోం శంకరు' అని కేకలు వేయసాగిరి.

కాని ఖడ్గములముందర చెట్టుకొమ్మ లెంతసేపాగగలవు? శస్త్రధారులగు వారిముందు శస్త్రహీనులగు వా రెంతకాలము పోరాడఁగలరు? ఇద్దఱువీరులును కొంతసేపటికి విశేష మలసిపోయిరి. ఈసమయమున నకాత్తుగ రణక్షేత్రమం దొకవైపునుండి 'బొంబొం శంకరు' అని క్రొత్తవారికంఠము వినఁబడెను. ఈ శబ్దముతరువాత కొలది

నేపటికి తరుణ అరుణమూర్తి యగు నొక కృషీవల యువకుఁ డీయుద్ధమునవచ్చి కలుసుకొనెను—ఇది యేమియాశ్చర్యము! సరిగా నిదియే సమయమున నొక్క భూతముగా వారుండెడు ముసల్మాను ఫకీరు కూడ నొక్క దిక్కున కరవాలమును గైకొని 'అల్లాహో అక్బరు' అని కేకలు వేయుచు దశదిశలను మారుమ్రోగించుచు హిందువులకు తోడుగ వచ్చినిలఁబడి వారికి సహాయముచేయుచు మహమ్మదీయుల చెండాడ నారంభించెను.

## ౬

### మనుష్యుఁడా లేక భూతమా!

"ముసల్మానెవ్వఁడైనఁ గాఫరులతోఁ గలిసి ముసల్మానులతోఁ బోరాడునా? ఎన్నటికిని సేయఁడు కావున నిది యేదో దయ్యమో భూతమో."

'అది భూతమగుటకు సందేహమేమియును లేదు—కాని ఒక సంగతి మాత్రము బోధపడకున్నది హిందువులయొక్క భూతము ముసల్మాను ఫకీరు వేషమును ధరించి 'అల్లాహో' 'అల్లాహో' అని యెందుకు కేకలు వెట్టును? ఇట్టి భూతములు రెండుమూడు వచ్చి హిందువులకు సాయముచేసిన యెడల నిక మహమ్మదీయుల పని పట్టిదే.'

"అయినదేమో అయినది. ఇప్పుడు భూతమేగో అంతర్హితమైనది. ఇక పద—ఒక్క సారి మన సేనాపతి ఏమైనాడో చూచి వత్తము. అడుగో చూడు. అవచ్చేవాడే నేమో—

చావు తప్పి పాఱివచ్చిన నల్గురు ముసల్మాను భటులు కొంత

దూరములో గూర్చుండి పై చెప్పిన సంభాషణ సేయుచుండిరి. ఈసమయములో నెవ్వరో గుఱ్ఱమెక్కి వారివైపు వచ్చుచుండిరి—భూతము యొక్క భయమింతేకాకను వారిని విడువలేదు ఈరోజుల జరిగిన యనగానుష యుద్ధము భూతము యొక్క పని యనియే వారి విశ్వాసము. ఆపీరపురుషుని యొక్కయు ముసల్మానుడొకని యొక్కయు కత్తుల తళతళలును ఝుణఝుణలును గా హృదయమూంత రాళ్ళముల నింకను గలవరపరచుచునేయున్నవి ఆనాల్గు భూతములలో నొకటి బహుశః మనుష్య వేషమును దాల్చి ఇంకను తమను గొట్టుటకు వచ్చుచుండెనని వారు తలంచిరి. అందుచేత నింక నక్కడ నుండిన నేమైన నపాయము జరుగవచ్చునని వారల పాఱిపోవ సమకట్టిరి. ఇంతలో నశ్వారోహకుడు సమీపించి వారిని సమగాఱుంచి 'ఏమీ భయములేదు ఎందుకు పాఱిపోయెద' రని యడిగెను

రహింబక్షు—'అరే ఫూఫా! ఈయన మా నవాబు సాహేబు గారురా!'

'ఓరి మూర్ఖుడా! భూతము సంగతి నీకేమి తెలుసురా? అది యెన్ని వేషములైన వేస్తుంది. నీకు ప్రాణాలమీద ఆశ లేకపోతే నీవుండు. మేము పాఱిపోయి ప్రాణాలు దక్కించుకొంటాము.'

గుఱ్ఱపు సవారు అఫ్జల్ ఖానుడే. ఆయన కొంచెము సేపటికి పాఱిపోవు భటులను సమీపించి, 'ఓరి నమ్మకహరాములారా! మీరు ముసల్మానులైయుండి హిందువులకు భయపడి పాఱిపోవుచుండిరా? కాఫరులతో యుద్ధముచేసి వెన్నిచ్చి పాఱిపోయిన మీరు చచ్చిన పిమ్మట నేలోకమునకేగుదురో యెరుగుదురా?' అనెను.

పారిపోవువా రీమాట విని కొంచెము సిగ్గుపడి ధైర్యము చిక్కబట్టుకొనియాగిరి. రహీంబక్షు—ఔనౌను హుజూరు! నేను గూడ నామాటే చెప్పుచున్నాను. కాని ఫూఫా మీరు మాయజమానులు

కాదనియు హిందువుల భూత విగ్రావేషము వేసుకొని వచ్చినదని చెప్పినాడు. ‘మమ్ము గొట్టవచ్చుచున్నదని యన్నాడు.’

అప్జల్‌ఖాను సేనాపతి కెక్కడిలేని కోపమువచ్చినది. రహీం బక్షును వానితోటివానిని శిక్షించుటకు ఖడ్గమెత్తెను. రహీంబక్షు పూర్వా వెనుకకు పాఱిపోయి—‘ఓరి మూర్ఖుడా! నే చెప్పినది నిజమైనదా, ఇప్పుడు! ఇదుగో భూతమెత్తుచున్నది ఖడ్గం-ఒరే కరీం బాబా! ఇప్పుడైనా పాఱిపోయి ప్రాణం రక్షించుకో.’

ఇది చూచి యిక భయపెట్టిన లాభము లేదని అఫ్జల్‌ఖాను తెలుసుకొనెను. ఆలోచించి భూతమును నెమ్మదిగా నిట్లు చెప్పెను-‘ఈ వేళ మనము భూతములతో పోట్లాడినామా—యిదా మీ అభిప్రాయము? అటులైన మనము బ్రతికి ఎట్లు వచ్చితిమి? భూతములైన మనల నిందఱి నెట్లు వదలిపెట్టి వెళ్ళును? భూతముల చేతులలోపడి యెవ్వరైన బ్రతికి యుందురా’’

రహీం—ఆ మాట నిజమే. కాని యిది నుంపియేమైనా ఫకీరై యుండి హిందువులతోఁ గలసి మహమ్మదీయులకుఁ బోరాడు టెట్లు సంభవించును?

అప్జల్—ఇదియా మీ భ్రమ? ముసల్మాను కాఫరుకాఁగూడదా? నేనా ఫకీరును జాలదినములనుండి యెరుగుదును. వాడెక్కడున్నాడో కూడ నేను మీకు చూపించగల్గుదును. హిందువులు వానికి లంచం బెట్టి కాఫరులలోఁ గలుపుకున్నారు.

రహీం—మంచిదే. వాడు మనుష్యుడైన నల్వుగు హిందువులతోఁ గలిసి నూరు నూటయేబదిమంది ముసల్మానులను జూచుచుండగనే దయ్యమువలెఁ జంపివేసినాడే.

ఖానుసాహెబు ఈసారి సరియైన జవాబిచ్చుట కేమియుఁ దోచక కొంచెము సేపు యోచించి యిట్లనెను,—మీ రింతబుద్ధి

మంతులయ్యును ఇంతమాత్రము తెలుసుకొనలేక పోయిరి. మీరు మొదటినుండియు గుండెలలో భయముతోఁ గుందుచుండిరి. వాడు మనిషి కాడు దయ్యమనియే యుండిరి. అందుచే ముసల్మానుఁ డెవ్వడును అసలు పోట్లాడనే లేదు. ఆ భూతమును భయమువల్లనే నాకీరోజు సర్వనాశమైనంగ లేనియెడల హిందువులతో ముసల్మానుల కెన్నఁడైన సమయము జరుగునా? జరగడమే కాదు వినడమును లేదు. కగానుశరీరమంతా మరచిపోయినారా యేమి ఈ రోజున?

మెల్లమెల్లగ అప్జల్‌ఖాను లేఁగనుచగులను లేసిపోని భయముచే ముసల్మానులలోకి గురసిరియు నిజముగాఁ దలచుకొనిన జయమే యయ్యెడిదనియు బోధించెను అంత వారలు 'ఇప్పుడు యజమానుల యాజ్ఞయేమి?' అని యడిగిరి.

అప్జల్‌ఖాను సంతుష్టుండై యిట్లనెను,—'ఎంత సిగ్గుబొల్లపని! ఈ రోజు మనకు జయము కాక యోద్ధులుగాగా దన్నుకొంటిమి. ఈ సంగతి నెవ్వరికినిఁ జెప్పవద్దు. అందఱితోను మేము పాతికమంది ముసల్మానులు చచ్చి అయిదువందలమంది ఆయుధపాణులగు హిందువులు వచ్చి పడిరని చెప్పండి. ముసల్మానులు కొందఱు చచ్చి పోయిరి గాని హిందువులలో చచ్చిపోయినవారికి లెక్కలేదు. మఱియొక సంగతి! ఈరోజున నీ ఫకీరును వాని ముగ్గురు హిందువులను దగినట్లు శిక్షింపకపోయిన మన పరువుదక్కదు. ఈ యుద్ధక్షేత్రమునకు అర్ధకోసు దూరమున నదీతీరమున నొక ప్రాతమసీదున్నది. ఆ ఫకీ రామసీదులో నుండును. ఆముగ్గురు హిందువులు ఫకీరుతోఁగూడ మసీదుకు వెళ్ళియుండవచ్చును. మీరు గుప్పచప్పగా వారిపోకడలు గనిపెట్టియుండుడు. నే నిప్పుడు బాదుశాహ యొద్దకు పోయి యీ యవమానమునకు తగిన ప్రతిక్రియ నొనర్చుట కాలోచించెదను. శీఘ్రములోనే మీరు చూడఁగలరు. సమస్త హిందూ

దేశమును రక్తప్రవాహమై పోయెదును మీరు చాలభక్తిగా మీ యాజ్ఞలను నిర్వహింపుడు. తగిన బహుమానములుబడసెదరు.

అట్లు చెప్పి యెల్లవారనుచరులయొద్దను సెలవుపుచ్చుకొని అఫ్జల్ ఖాను గుఱ్ఱముపై నెక్కి మెల్లమెల్లగ నడీమ్మరువైపు చనెను. మెల్లగా పోవుటకు కారణమేమో యిచ్చట చెప్పెదము వాని శరీరమంతయు నొప్పులుపెట్టుచున్నది. యుద్ధములో పాఱిపోవునప్పుడు వాని వీపు మీదకూడ కొంచెము దెబ్బలుపడినవి. సిపాయీలున్నప్పుడు తన బాధ నేమియుఁ గనపఱ్పక దాగుకొను సిపాయీలు కన్నులుఁ త్రిప్పగానే ఖాన్‌సాహేబు వీపుమీద చేయియుంచుకొని,—'అగే దేవుడా! నొప్పిపెట్టుచున్నదిరా బాబూ' అనుకొనెను.

## ౧౦

### ఇదియంతా స్వప్నమేనా?

యుద్ధము సమాప్తమైన కొంచెము సేపైన తరువాత కృషీవలయువకుడు ఫకీరుతోడను తక్కిన యిద్దఱు హిందువులతోడఁగూడ యాలయమేగి మసీదు ముందరకువచ్చి నిలువఁబడెను. ఫకీరు—'బిడ్డా! ఇదియే నామందిరము లోపలకువచ్చి శ్రమతీర్చుకొనుము' అనెను

కృషీ—మందిరమా యిది మసీదా?

ఫకీరు నవ్వి ప్రత్యుత్తరమిచ్చెను,—'పవిత్రమగు ఇస్లాము ధర్మములో మందిరమును మసీదును, హిందువులును ముసల్మానులును, అల్లాయును భగవంతుఁడును, మహమ్మదు జనార్దనుఁడును. కురాను శరీఫును ఉపనిషత్తులును భేదముగ నుండవు. ఈ మందిరముయొక్క ప్రతిష్ఠాపకుఁడు చక్రవర్తి శహాజహాను ఆయన స్వయముగ నిద్దానిని

ముసల్మాను మందిరమని నామకరణ మిడెను. కాని ఆసంగతు లన్నియు నిప్పుడు విచారించుట కిది సమయముకాదు.”

పిమ్మట నా ఫకీ రద్దఱుహిందూవీరుల వంకను జూచి యిట్లనెను, ‘మిమ్ముల నిచ్చట నెక్కువసేపుంచు టింక న్యాయముకాదు. ఈ రోజు జరిగిన సమాచారమంతయు బాదుశాహ దగ్గఱకు చేరఁగలదు. అఫ్జల్ ఖానుఁడును ఇందుకు ప్రతిక్రియ సేయుటకు సర్వవిధముల బ్రయత్నము సేయఁగలఁడు అందుచే మీరు వీలయిన స్థలమునకుఁ బోవుటకు ప్రయత్నించవలెను. మీతోఁబాటీ వీరబాలకునిఁ గూడ తప్పక తీసుకొనిపోవలెనని నాయనురోధము. ఈతనివలన మున్ముందు మనకు లాభము కలుగఁ గలదని నాయభిప్రాయము.

ఆ హిందూ వీరులలో నొకరు కృషీవలయువకు నిట్లడిగెను,—‘వీరబాలకా! నీవు మాతో వచ్చుట కిష్టపడెదవా!’

కృ. కి—ఎచ్చటకు?

హి. వీ—రణసముద్రములోనికి.

యువకుఁడు సంతోషముతో జవాబిచ్చెను,—వీరవరా! దాహముచేఁ గొట్టుకొనుచున్న పధికుని మృగతృష్ణచే మఱింత యాశఁబెట్టి బాధించెద రేల? రణసముద్రమా! ఈ మ్లేచ్ఛపీడిత యార్యావర్తములో నారణసముద్ర మెచ్చట?

హి. వీ—మీరు నేడు యుద్ధస్థలమున కెక్కడనుండి వచ్చితిరి?

కృ యు—నాసంగతి యావత్తును మీకు చెప్పుటకు చాల కాలముపట్టును. కేవల మింతవఱకు చెప్పెదను. నేను మేవాడదేశపు ఒక దరిద్ర కృషీవలుఁడను. చాలదినములనుండి రణసముద్రమును వెదకుచుంటిని. రారోరు సేనాపతి దుర్గాదాసు ఆ రావలీపర్వత ప్రాంతమునకు రణవీరుల నందఱ సగౌరవముగ నాహ్వానించెనని విని

యుంటిని. మేవాడులో నింకెవ్వఱును నాకుఁదోడురాలేదు. అందుచే నేనొక్కఁడనే వచ్చియుంటిని.

అందొక్క హిందూవీరుఁడు సంతోషపూర్వకముగ యువకునిఁ గౌఁగలించుకొని యిట్లనియెను,—కృషీవలబాలకా! నీవెవ్వరిని వెదకుచుంటివో వాఁడిడుగో. దుర్గాదాసు హృదయము నీహృదయముతోఁ గలిసిపోయెను తమ్ముఁడా రమ్ము ఆరావలియొక్క యెత్తైన శిఖరములందు మనము హృదయముల నిట్లు కల్పుకొని రణసముద్రములందు దూకుదము.

కృషీవలు డాశ్చర్యముతో హిందూవీరుని దిక్కుచూచి యిట్లనెను,—'ఇట్టి శ్వేతచందనశోభితమైన యున్నతలలాటము' ఇట్లు తేజోగర్వములతోఁ బ్రకాశించు నుజ్జ్వలనేత్రంబులు, ఇట్టి వీరత్వపూర్ణంబులగు మీసంబులు, ఇట్టి దీర్ఘములైన బాహువులు, ఇట్టి కరుణామయ కంఠస్వరంబు, దుర్గాదాసునందు దప్ప మఱియెవ్వరియందుండఁగలవు? దుర్గాదాసునందు తప్ప మఱి యెవ్వానిభుజములందింత బలముండఁగలదు? ఒక్క చెట్టుకొమ్మతో వందలకొద్ది ప్రాణంబులు నమసిపోయె. దుర్గాదాసుని కంఠము దక్క మఱియే హిందువు కంఠమున 'బోంబోం శంకర్' ధ్వని వచ్చిన హిందువునైన నమృతముపోసి బ్రతికింపఁగలదు?

అట్లనుచు కృషీవలుఁ డాశ్చర్యపడుచు దుర్గాదాసుని వీరశరీరమును జూచుచుండెను.

ఫకీరు నవ్వుచు,—'వీరబాలకా! నేను నీవెవ్వరో తెలిసికొంటిని కావున నింక నీవు దుర్గాదాసునకును ఆతని స్నేహితునకును నీవెవ్వరో దాచియుంచుట లాభములేదు' అనెను.

కృషీ—నే నిచ్చటకు వచ్చునప్పుడు మాతల్లి 'నన్నెవ్వరికినిఁ దెలుపకుండుట' కాజ్ఞాపించెను. నే నందులకు వాగ్దానమొనరించితిని.

ఇప్పుడు తమ యాజ్ఞయొక్కలో అట్లు చేసెదను.

ఫకీరు — మీరు నీసంగతెవ్వరికినిఁ దెలియకుండనుంచెదరు. రారోరు వీరా, దుర్గాదాసు! ఈనిసంగతి వినిన మీరు విస్మితులును ఆనందితులు నయ్యెదరు. ఈయన మేవాడాధిపతి మహారాణావారి పుత్రుఁడు. కుమారరాణా అమరసింగు.

దుర్గాదాసు సంతోషముచేఁ బరవశుఁడై కృషీవలవేషధారియగు రాజకుమారుని కంఠమును గౌఁగలించుకొని యిట్లనెను, — నేను మీకు సదా దాసుఁడను. మీసంగతి నాతోఁ జెప్పుట కింత సందేహింప నేల? నేఁడు నాజీవితము ధన్యము! మీరు నాతో దయసేయుఁడు. అచ్చట పూర్వోక్తశ్మశ్రుమును జూడఁగలరు. యోధపూరు రాణిమహిషి యొక్క నూతన చైత్యమందిరములో ననంఖ్య వీరుల కరవాలంబులు దమ యొరలనుండి బయల్వెడలి ప్రకాశించుచున్నవి. ఇప్పు డొక్క సారినాతో మసీదులోనికి రమ్ము. మహారాణికి మిమ్మెఱింగించెదను.

అమరసింహుఁడు — జోధపురరాణి యన్న మూడు వేషముసందు నాస వారలు పట్టఁగలను. ఆమెతో ముందుగాఁ జెప్పి నన్నింకెవరికిని తెలియఁజెప్పవద్దని ప్రార్థింపుడు. మంచిది నడువుడు, ఆమె దర్శనము సేతము.

దుర్గాదాసు కృషీవలవేషధారి యమరసింహుని చేయిఁబట్టుకొని మసీదులోనికి తీసుకొనిపోయెను. మసీదుమధ్య నొక్క యంగణ ముండెను. అందు అడవిపువ్వుల చెట్లు పెరుగుచుండెను. బహుశః ముందు మంచి పువ్వుల చెట్లుండి యుండవచ్చును. కాని యవి యన్నియు నిప్పుడు చచ్చిపోయి వానిస్థానమున నడవిపువ్వుల చెట్లు బయలుదేరెను. మసీదు చాల సుందరముగానే యుండెను. ఈతోట యందు ఇద్దఱు రమణీమణులు నిలిచియుండిరి.

దుర్గాదాసు — 'వీరబాలకా! మీయెదుట యోధపురమహారాణి

యరుంధతీ దేవియు నామె ప్రక్కను అంబరరాజకుమారి అంగాలికయు
నున్నారు.

కృషీవలుఁడు కన్నుల దెరచెను—ఎదుట ప్రధానముగా నీల పరిధానిని రాజమహిషి, ఆమె ప్రక్క జగద్ధాత్రి దేవివలె నున్న నొక్క సాధ్వి, నిలిచియున్నారు ఇదియేమి స్వప్నమా? చేతితో గన్నులు దేవ్లక్రింద కృషీవలబాలకుఁడు చిన్ననాఁడు వేటకంఁబోగ సముద్ర తరంగతీరమున నే దర్శనం సిచ్చెనో యే దివ్యాంగనను నాఁటి నుండియు వెదకుచుండెనో యా మోహో ఈమె! ఆహా! ఈమె యిప్పటి కంటెకూడ మనోమోహనమూర్తియై కాన్పించుచుండెను.

దుర్గాదాసుని యాజ్ఞననుసరించి కృషీవలుఁడు భూమిపై మోకాళ్ళ మీఁదనొరగి యభివాదన మొనర్చుచు జ్ఞానశూన్యుని భంగి యాసుందరాంగి చరణములపై బడెను. ఏమియో తెలియలేదు తత్క్షణమే, అంబర రాజకుమారి అంగాలికయు శరీరము పులకరింప హృదయము కంపింప స్మృతితప్పి చూచుచుండెను ఆహా! దేవి! స్వప్నము సత్యమయ్యెనా యేమి?' అనుచు రాజకుమారుఁడు అమరసింహుఁడు మహారాణీ అరుంధతీదేవి పాదములపై మూర్ఛితుండై పడిపోయెను.

# ౧౧

## వీడ్కోలు

ఉదయముననే ఫకీరుయొక్క మసీదు దర్వాజాయొద్ద నొక్క సుందరి యొక్క తెరయే నిలువఁబడియుండెను. ఫకీరు మోకాళ్ళపై నొరగి నమాజుచేయుచుండెను. నమాజు పూర్తియైనతోడనే యాయన కన్నులెత్తి యారమణీమణి దిక్కుచూచి యిట్లడిగెను,—బిడ్డా!

నేడు నీమోము విన్నవోయియున్న దేల? ఏదైన నశుభసమాచారము వినియుంటివా?'

రమణీమణి చేతులు మోడ్చి, 'తమయొక్క సెలవు గైకొనుటకు వచ్చితిని.' అనెను.

ఫకీరు—సెల వెందుకు?

రమణి—దేవా! నిర్భాగ్యురాలినై నే నిట్టి ప్రశ్న వేసెదను? నా సంకల్పము మీ కెట్లు తెలియకుండును?

ఫకీరు ఆ పలుకుల కసంతుష్టి నొంది యిట్లు మాఱు పల్కెను,— అభాగ్యురాలా! నీవు దుర్గాదాసుని కొండకోట కేగుట కాలోచించుచుంటివని తోచుచున్నది. యింగుగా కొన్ని ప్రశ్న లడుగఁ బోవుచుంటిని. వానికి సమాధానము లిమ్ము.

రమణి—చిత్తము—అడుగుడు.

ఫకీరు—నీపతి సన్యాసివేషము నూనియున్న రాజకుమార యమునరసింహుడు నిన్నానవాలు పట్టెనా?

విలాసకుమారి మోము వంచుకుని సగము సగము మాటలతో,—'నన్నానవాలు పట్టుట కాయన కెట్లు వీలగును?' అని జవాబు చెప్పెను.

ఫకీరు—నీ వాతనిచూచుటతోడనే తెలిసికొంటివిగదా?

విలాస—దేవా! నాతప్పు క్షమింపుడు. తమరు మాస్త్రీ హృదయములఁ జొచ్చినను మా నారీరహస్యములను గనుఁగొనఁ గలుగుదురా?

ఫకీరు—అట్లైన నీ వాయనను దర్శింప తత్తరపడుచుంటివి కాబోలు!

విలాస— తమ రెంత భ్రమపడితిరి! ఈమందభాగ్యురా లాయన దర్శనమునకు తత్తరపడుటలేదు. ఆయన నన్నానవాలు పట్ట లేక

పోవుట మంచిదేయైనది. ఈకన్యకు నే నెవ్వరో యామెకు తెలు పను. కడచిన రాత్రిమన మందిరములో నాయన అంబర రాజ కుమారి అంబాలికను జూచి సన్నిహితు చేసి రహస్యముగ పొంచి యుండి జరిగిన వృత్తాంతమంతను గనిపెట్టియుంటిని. పిమ్మట రాజ కుమారితో మాటలలో నన్నుయు గూర్చి తెలిసి ఆయమ చిన్న తనములో నొకనాడు రాజకుమారి అంబాలికను రాజ సముద్రతీరమున రక్షించెనట——ఆనాటినుండియు నంబాలికపై ప్రేమచే మోహితుడై యుండెను అంబాలిక యింతవఱ కాయన నెవ్వరో గ్రహింపలేదు. ఆయన నిజముగా మేవాడదేశములో నొక [illegible] యే యామె అభిప్రాయము. నా హృదయములో గూడనొక క్రొత్త యాలోచన సంచరింప బ్రారంభించెను. [illegible] మ్లేచ్ఛ సంహారము గావించు నాశ నాహృదయమునందు క్రొత్త చిగురు లెత్తుచున్నది. చంద్రగిరిపై కత్తి యెత్తి [illegible] సంహరించు సంకల్పము నాయందు జనించుచున్నది.

'బాలికనగు నా ప్రగల్భములను క్షమింపుడు. వీరుల హృదయ ములు తాము వలచిన స్త్రీలపై ప్రేమచే సమ్మోహితులై యసాధ్య కార్యములను గూడ సాధించును గదా యవనయుద్ధములో జయ మొందినచో వారి ప్రేమవాంఛలు సఫలత నొందునని వారెరింగి రేని, ఈ యార్యావర్తమంతయు ముసల్మానుల రక్తముతో తడిసి పోవునని మీరు శీఘ్రములో జూడగలరు. భారతదేశమునుండి శత్రువులు పాఱిపోయెదరు. నేటి యీ పైశాచికలీల ఆర్య జాతి యొక్క విజయోత్సవములోనికి మాఱిపోవును. ఆ సమయమున నో దేవా! ఆహిందువుల విజయోత్సవసమయమున మహాదేవా! ఈ యవనధ్వంసకారియగు వీరయువకునితో త్రిలోకసుందరి అంబరరాజ కుమారికి వివాహమగుటను గన్నులారఁ గాంచి ధన్యురాల నయ్యెదను.''

ఫకీరు పరార్ద్రదృష్టి నెరపుతో,—'కుమారీ! ఈ కఠోరసాధనయందు నీ హృదయమును నీవు రక్షించుకొనఁగలవా?' అని యడిగెను.

విలాసకుమారి కన్నుల నుండి నీరు గారుచుండఁ బల్కెను.— తమ శిష్యురాలనై యుండి యాంతరమాత్రము నిగ్రహమును జూపలేనా? తమ దివ్య నియమములను డి యిచ్చిన శిక్ష వ్యర్థమగునా? ఆశీర్వాదమిమ్ము, దేవా! ఆ యాశీర్వాదబలమున్నఁ నా హృదయమును మీ మహామంత్రశక్తి నడచెదను గాక! అరుంధతీదేవి కూడనుండి తమ మాతృమందిరమునకుఁ దగిన సిద్ధపడుచున్నది. ఆజ్ఞ యొసంగుము. నీలాశ్వము నెక్కి ... నేనుగూడ నరిగెదను. కొన్ని దినములైన పిమ్మట మీవద్దకు తిరిగి వచ్చెదను.'

విలాసకుమారి ఫకీరునకు నమస్కరించి యచటినుండి వెడలి పోయెను. అట్లు సౌందర్యముతో నెప్పుడెప్పుడెల్ల నాయన కొక్క మాట యామెను గుఱ్ఱించి ... వచ్చుచుండెడిది. అట్టియెడ నమస్కరించునపుడు ఫకీరామె నెల్లప్పుడును దీవించుచుండెడివాఁడు. నే డేలొకో యాశీర్వదించుటకాయన సంకోచించినాఁడు!

## ౧౨

శరత్కాలము. శుక్లపక్షరాత్రి వేగుచున్నది. చంద్రుఁడు రాత్రియంతయుఁ బరువెత్తుటచే నలసి కునుకువచ్చి తూలి యాకాశముమీద నుండి క్రిందపడి యుండవచ్చునని యనుకొందుము. ఈసమయమున నొక కొండనానువున నిరుక్కైన త్రోవప్రక్క దుర్గాదాసు పడుకొని నిద్రపోవుచుండెను ఆయన ప్రక్క నా కృషీవల యువకుఁడు కూడ పడుకొనియుండెను. కాని నిద్రపోవుటలేదు. ఆయన మనసులో నే విచారముండెనో తెలియరాదు. కొంచెము

దము. ముకుందదాసు ఈస్త్రీలను వెంటఁదీసుకొనిపోఁగలఁడు.

కృషీవలుడు—వద్దువద్దు, వీరవరా! ఒకవేళ శత్రుసైన్యము మనల సిద్ధఱిగి వచ్చి స్త్రీలవెంటఁ బడినయెడల వారిని రక్షించుట కష్టమగును. మీరుకూడ వారివెంట వెడలుము. నేనొక్కడనే శత్రు సేనల నడ్డగించెదను.

దుర్గాదాసు కొంతసే పాలోచించి కృషీవలుని సుకుమారవదన మండలముతట్టు వెల్లనై చూచి యిట్లనెను—'ఇంతకంటె వేరుపాయములేదా? ప్రియవీర బాలకా! వీరుని భంగి ప్రాణమియ్యనుంటివా? సురలోకమందు దీనిబహుమానమును బొందగలవు! మహారాణీ ఆలసింపఁదగదు. శీఘ్రముగఁ దురంగమెక్కి బయలుదేరుడు.

కృషీవలుఁ డొక్కసారి రాజకుమారిదెస కన్నులు పూర్ణముగ విప్పి వీక్షించెను. ఆ కంటిచూపులలో రాజకుమారి కృషీవలుని హృదయాంతరాళభావము నిట్లు చదివెను—'మీకొరకు ప్రాణ మర్పించుటలో నా స్వర్గమున్నది.' దుర్గాదాసును దుఃఖముతోఁగను లభిమానము తోడను కన్నులు నీరునింపుచు గుఱ్ఱముపై నెక్కెను. మహారాణియు అంగొళికను ముందుకూర్చుండబెట్టుకొని గుఱ్ఱముపై సవారయ్యెను. గుఱ్ఱము బయలుదేరఁబోవుచుండ నంబాలిక కళ్ళెము లాగి గుఱ్ఱమునాపి దుర్గాదాసుతో నిట్లనెను,—'దుర్గాదాసు! మీరు క్షత్రియవీరులు కారా? నేడు మీరు ప్రాణములకు భయపడి శత్రువులకు నమర్పించ పారిపోయెదరా! ఈ వీరబాలకు నొంటరిగ శత్రువులకు సమర్పించి పాఱిపోయెదరా?"

దుర్గాదాసు గంభీరస్వరముతో నిట్లుప్రత్యుత్తర మిచ్చెను.—'బాలికల యుపదేశము వినుట కిదిసమయముకాదు. మహారాణీ! గుఱ్ఱముపోనిండు. లేనియెడల మిమ్మును రక్షించుట మాకు కఠిన మగుటయేకాదు, అసాధ్య మసంభవముకూడ నగును.'

అంబాలిక అప్పటికిని గుఱ్ఱమును లాగి పట్టుకొని ఆపివేసెను మహారాణి—' కుమారీ! నీవేమి నేడుబొత్తుగా మైమరచియున్న ట్లున్నావు ''

అంత నాంబరరాజకుమారి కన్నులనుండి వేడినీరు గార్చుచు గద్గదకంఠముతో, '—' దేవీ! మీకు ప్రాణములపై నిశ్శేష మోహ మున్న యెడల దుర్గాదాసుతో మీరు పొండు నేనీ వీరబాలకుని--'' అని యేమో జవాబు చెప్పుచుండెను.

అంతలో కరవాలములు కొట్టుకొను చప్పుళ్ళగపడి రాజకుమారి మాటలు మ్రింగివేసెను. ఆమె యెన్నియో యుద్ధములఁ గాంచెను. కాని బాలికనియొక్క కరవాలముతో రెండు మూడు వందల కర వాగములు డీకొనట నేడే యామె మొట్టమొదట వినుట? ఈ సంగతిచూచి రాజకుమారి ప్రాణమెగిరిపోయెను.

ఆమె,—' హా! నిష్ఠుర దుర్గాదాసు! యిదియా నీవీరధర్మము ?' అని చెప్పుచు మహారాణిచెంతయందు మూర్ఛపడిపోయెను. అనంత రము మహారాణియు గారోగు సేనాపతియు తమ గుఱ్ఱములను తోం దరగాఁ బఱుగెత్తించుకొని శైలశిఖరమును జేరుకొనుచుండిరి.

తెల్లవారినది ఫకీరు కన్నులు మూసుకొని యేమియో యోచించు కొనుచుండెను. ఆయన కన్నులు దెరచునప్పటికి ఎంతమందియో ముసల్మాను సిపాయిలు కృషీవల యువకుని సంకెలతోఁ గట్టి వెంటఁదీసుకొని యీయన వైపునకు వచ్చుచుండిరి. ఆయన దగ్గఱకు వచ్చునప్పటికాయన వారి నాయకుని యెదుటకేగి యిట్లనెను,— మీరు నాపిద్రోహతకు తగిన శిక్ష నొసగుటకు చక్రవర్తిగారి యొద్దకు తీసుకొనిపెడలఁ దలచినట్లు నాకు తోచినది దయచేయుఁడు. నేనును మీ వెంట వచ్చుటకు సిద్ధముగా నున్నాను

నాయకుండగు అఫ్జుల్‌ఖాను తన యనుచరుల కిట్లు సెలవిచ్చెను.

'మీరీఫకీరు పహారాలు నక్కరపద్దు. వీని చేతులకు వెంటనే యురదండములను వేయుఁడు.

ఫకీరు నవ్వుచు నరదండములను వేయించుకొనుటకు చేతులు సాచెను.

## ౧౩

### దర్బారు.

ఉదయముననే అజ్మీరులో చక్రవర్తియొక్క దర్బారు. రాజప్రాసాదమున కెదురుగ దర్బారుకై ఆమ్ వేయఁబడినది. చంద్రకాంత శిలానిర్మితములైన పెద్దపెద్ద స్తంభములు ప్రకాశించుచున్నవి. వాని మధ్య ముత్యములతోరణములు ఉయ్యాలలూగుచున్నవి. వాని యెదుట రత్నసింహాసనమున కొక్క రత్నదామములు సూర్యకిరణములఁ బ్రతిఫలించుచు ముత్యములతో నలంకరింపఁబడిన స్తంభములమీఁదను మణిమయచంద్రశాలములమీఁదను సమాగతసభాసదుల శిరోవేష్టనముల మీఁదను వింతవింత రంగులఁ బరపుచుండెను. దర్బారుకు రెండువైపులను సైన్యములు ఆయుధపాణులై కదలక మెదలక చిత్తరువులవలె నిలిచియుండెను. రత్నసింహాసన మింకను శూన్యముగా నుండెను. చక్రవర్తిగారింకను రాలేదు. సైన్యములును ఉమ్రావులును ఆయన రాక కెదురు చూచుచుండిరి. పహరావాండ్రచే పరివేష్టింపఁబడియున్న ఖైదీకృషీవలుని చెంతనే ప్రక్కనున్న ముసలిఫకీరును సభాసదులందఱు విచిత్రముగఁ జూచుచుండిరి. కృషీవలుడు శ్రద్ధఁబెట్టి చూడఁగా నాగడ్డములు మీసములు గల మహాసభికులం దొక్క హిందువును గన్పడలేదు. అంత నకాత్తుగ నొక్కసారి 'అల్లాహో అక్బరు' అని పెద్ద కేక వినఁ

బడెను. వెంటనే ఫిరంగులు మ్రోగెను. అమీరులు ఉమ్రావులు సేనాపతులు సిపాయీలొక్కసారి వంగి సలాము చేసిరి. క్షణకాలములో సభ యంతయు నిశ్శబ్దమయ్యెను. చక్రవర్తి కొంచెముగ జేతు చిఱునవ్వు నవ్వుచు గంభీరముగ నరిచి మెల్లగ సింహాసనమును నాసీనుఁడయ్యెను అట్లు క్షణకాలము మాటలాడకుండెను. పిమ్మట చాల గంభీరముగ సభవారి నుద్దేశించి యిట్లు మాటలాడెను,— ముసల్మాను ప్రముఖులారా! సామంత మహారాజాదియ ప్రధానులారా! ఇన్నిదినములనుండియు నీ యావద్భారతఖండమును మహమ్మదీయధర్మము నేకచ్ఛత్రాధిపత్యముగ స్థాపింపవలెనని యెంతయో ప్రయత్నించి యున్నాము. కాని ప్రయత్నమంతయు విఫలమైనది. దని యొక్క మాట వినకవలన నాకు తోచుచున్నది. సేనాపతి అఫ్జల్ ఖాను నాతో నివేదనచేసి యున్నాడు. ఎవ్వరో యొక ప్రసిద్ధ ముసల్మాను ఫకీరు ముసల్మానులయెడల ద్రోహియై హిందువుల పక్షమవలంబించి చాల మంది మహమ్మదీయులను [illegible] వేసినాడట. అందుచే నా ముసల్మానునకు గొప్పదండన కాజ్ఞ నొసంగుడని మిమ్ము ప్రార్థించుచున్నాను. కాని యీ మాటలయందు నాకు విశ్వాసములేదు. అఫ్జల్ ఖాను తన ప్రార్థనకు తగిన యాధారములు చూపించక పోయిన యెడల నా మాట యబద్ధమని కొట్టివేయుదు.

ఒక వృద్ధసభాసదుడు లేచి క్రోధపూర్వకముగ నిట్లనియె,— "మహాప్రభో! ఇది యసంభవమైన మాట. కేవలము మహమ్మదు పైగంబరుయొక్క అవతారమూర్తులగు ఆలంగీరు బాదుశాహా రాజ్యము సేయుచుండ ముసల్మాను ఫకీరు కాఫరులతో కలియునా? ఈమాట మేము స్వప్నమునందును నమ్మజాలము. ఇందు అఫ్జల్ ఖాను తగిన ప్రమాణములు చూపకపోయినచో నాతఁడే యాశిక్ష యనుభవింపవలెనని మా కోరిక.

లందు నేను పాపులను శిక్షించుటకును సాధులను రక్షించుటకును నా ప్రాణమిచ్చి యుద్ధమును చేయుదును ఇదియే నాయిహలోక ధర్మము, ఇదియే పరలోకధర్మము, ఇదియే నా యిష్టగురుదేవు లగు మహమ్మదులవారి సత్యసనాతనధర్మ దేశసారము

ఫకీరు మాటలు విని సభాసదులందరును విస్మితులును స్తంభితులు నైరి. బాదుశాహా క్షణకాలము మాటలాడకుండ విచారించి గంభీరభాషణముల నిట్లనియె,—'వినవోయి కపటాచారీ, కాఫరుల కంటెను గాపాత్ముండ వగు ఓ ఫకీరు వేషధారీ! పాపండా! నీవు నీకు దుర్బుద్ధి పుట్టి మహమ్మదుల పవిత్రనామము నుచ్చారణచేసి యీ యఖిల మునసల్మాను సభాసదుల చెవుల నపవిత్రము చేసితివి ఈపవిత్ర మహమ్మదీయ రాజసింహాసనము నెదుర ఘోరతర అవమానము గావించితివి. నీవు మా మునసల్మానుల వీరధీరుల హృదయమును జిచ్చు బెట్టితివి. ఇందుచే నీకు హిందూస్థాన బాదుశాహా యిట్లు ప్రాయశ్చిత్తము విధించుచున్నాడు నీవు ఉక్కయిన తలాగును బిలిచి కత్తితో నీ పాపముయొక్క నాలుకను గోయించి యావన్మంది మునల్మాను ప్రజలముందును నూకరపాదములపై పాతవేయించుట కుత్తరువు చేయుచున్నాను.

ఇట్లు బాదుశాహా ఇచ్చిన తీవ్రశాసనమును సభాసదులందరును విని యాశ్చర్యపడిరి. ప్రధానమంత్రి దిలిమారుఖాను లేచి నిలువంబడి చేతులు జోడించుకొని—'మహాప్రభూ! తము రీ వ్యక్తి మునసల్మాననియు పైగా ఫకీరనియు మరచితిరి కాంబోలు!' అనెను.

సమ్రాట్టుగ్రుడై కంపించుచు నిట్లు సెలవిచ్చెను,—'దిలిమారు! తిన్నగా విను. ఏవ్యక్తి కాఫరును, మునసల్మాను గారవించునో యావ్యక్తి మరణదండన కర్హుడని కురానుషరీఫులో దఖరబద్ధమై యున్నది.'

అందుమీఁద నెంకెవ్వరును నోరెత్తుటకు సాహసింపలేరు. అమీరులు ఉమ్రావులును పెద్దలు గదలింపనేరక గంభీరతాపూర్వకముగ ఫకీరు మోమువంకఁ బదే దృష్టిబెట్టి చూచుచుండిరి. కేవలమొక్క యుష్జాల్‌ఖాను మోమునందే ప్రసన్నత మెఱయుచుండెను. అతఁడు లేచి నిలువఁబడి యిట్లు పల్కెను,—'ఇఁక నీ ఫకీరువేషధారి వేషమునతో నున్న కాఫరు యువకునికి ఉచితమైన దండన మొసంగ వలసియున్నది.'

బాదుశాహా—'ఔను. హిందూయువకుని ఉమ్రావుల యెదుట నిలువఁ బెట్టుము.'

కృషీవలుఁడు బాదుశాహాయొక్క యాజ్ఞానుసారము సభాసదుల యెదుటకు వచ్చి నిలువఁబడెను. అంత బాదుశాహా చెప్ప నారంభించెను,—'మా యెదుట నిలువఁబడియున్న సుందర బాలకుఁడు జాతియందు హిందువుఁడైనను పెద్దపెద్ద ముసల్మాను వీరులతో సమానముగఁ బోరెను. అందుచే నితనిని ముసల్మానులలోఁ గలుపుకొని గొప్ప యధికారముమీఁద నియోగించవలెనని నా కోరిక. ఈమనిషి ముసల్మానుఁడైన పిదపనతఁడు మా రాజ్యముయొక్క కీర్తి నభివృద్ధి సేయఁగలఁడు. హిందూయువకుడా! ఉమ్రావులకు సలాము సేయుము. నీభాగ్యరేఖ బయలుపడినది. నేడు సూర్యాస్తమయమునకు ముందు నమాజు సమయమునకు వీరందఱును నిన్ను ముసల్మానునిఁ జేసి బహుసన్మానయుతమగు నుమ్రావు పదవి నొసంగుదురు. నీవీరత్వమున కిది తగు బహుమానమని మేము తలచెదము.

మాయకృషీవల యువకుఁ డామాటల కిట్లు ప్రత్యుత్తర మొసంగెను,—'భారత సార్వభౌమా! యవనుల సేవ హిందూవీరుల కీసమయమున లాభదాయకమైన మాట నిజమే. కాని నాభుజములు

మాత్రము భారతశత్రువులైన దానవుల వక్షస్థలములను బ్రద్దల గొట్టుటకు సృజింపఁబడినవి గాని యవనచరణసేవ సేయుటకు కాదు'—

చక్రవర్తి మోము కందిపోయెను. ఆయన క్రోధదుఃఖములతో నలువైపులను దిలకించుచు నిట్లు పలికెను,—'ఆహా! ఉమ్రావులారా! నేడు మనమందరమును మేల్కొనియుఁ గలఁగనుచున్నామా యేమి? కేసరి శిరంబును నక్క కాలఁ దన్నుచున్నది కదా? మంచిది,—తలారులారా!'

వెంటనే సైన్యమధ్యమునుండి తళతళలాడు కత్తులఁ జేఁబట్టుకొని భయంకర రూపులగు కొందఱు తలారులు ఎదుటకు వచ్చి నిలువఁబడిరి

వృద్ధ ముసల్మాను ఫకీరు తొందరతొందరగా బాదుశాహ యొక్క ముఖమండలము వైపు చూచుచు దర్బారు మండపము కంపింప వజ్ర గంభీరస్వరంబుతో బల్కెను,—'ఔరంగజేబు చక్రవర్తీ! ఆకర్ణింపుము— మూర్ఖతకు కూడ మేరయున్నది—హ్రస్వదర్శిత్వము నకును హద్దున్నది. ఈఫకీరుయువకుని రక్తమొక్కబొట్టు భూమి మీద పడెనేని, నీ పాపిష్ఠిశిరము భూమిమీఁద వేయివ్రక్కలై పడునని తెలిసికొనుము.

చక్రవర్తి క్రోధముతో పండ్లు కొఱుకుచు,—"అరే పిచ్చి ఫకీరు! నే నెవని ననుకొంటివి? భారతవర్ష రాజాధిరాజును!"

ఫకీరు తిరస్కారముతో బాదుశాహాయొక్క ముఖమండలమును జూచుచు కన్నుల వెంట నగ్నికణంబులఁ గ్రక్కుచు,—'మీరు రాజాధిరాజులా! ఒక్కసారి పైకి కన్నులెత్తి తిలకింపుడు. ఎవరు రాజాధిరాజులో తెలియఁగలదు.

చక్రవర్తి మంత్రహతుఁడైన తెఱఁగున పైకి కన్నులెత్తి చూచు

కొనెను. పిమ్మట మరల కన్నులు తెరచి తిన్నగా తన శిరస్సును ఆకాశమువంకకే యుంచి చూచుచుండెను. ఇదియంతయు మంత్ర ప్రభావమో లేక మెస్మరిజమో తెలియరాదు ఔరంగజేబున కిట్లు గాన్పించెను. ద్వాదశచంద్రుల కిరణజాలములచే నిండిన మండలము. అందు గౌరవమయమైన కాంతితో దివ్యతేజస్సుతో రత్నకిరీటంబుతో రాజాధిరాజు అక్బరు జ్యోతిర్మయ విమానమునఁ గూర్చుండి యుండెను. విమానమునకు నాల్గువైపులను సిద్ధసాధ్యామరులు పరమానందమునఁ గూర్చుండియుండిరి. హృదయంబు డిల్లవడ చూపులు వెల్తి నడ నౌరంగజేబుపైన కినఁబడిన రాజరాజేశ్వరమూర్తినిఁ జూచుచుఁ జూచుచు మరల నొకసారి క్రిందకు తన సభామండపము వైపు చూచెను. ఇదవఱకున్న రత్నరాజిదస్తమును వివిధమణితోరణ విభాసితంబును విచిత్రవర్ణవిభ్రాజితంబునునగు సభామండప మేమైనదో తెలియదు. ఆస్థానము భీషణమును గోమహర్షణంబును అంధకార బంధురంబునై గన్పట్టెను. ఆ అంధకారమున భీభత్సవదనవికటదశన దానవ సంఘములు వికటహాసముతో కోలాహలము గావించుచుండిరి. ఎదుట నాకాశమునుండి రాలిన చంద్రబింబమును బోలి దుమ్ములో పొరలుచున్న దేవమూర్తి యాయనతండ్రి షాజహాను బంగారు గొలుసుతో బంధింపఁబడియుండెను. దగ్గఱనే పెద్దఅన్నగారగు దారా భ్రాతృవరుని వీరమూర్తి శూలముపై పడియుండెను. ప్రాణప్రియుఁడగు షుజాసోదరుని తరుగఁబడిన తల గగనతలమున వ్రేలాడుచుండెను. ప్రయదర్శనుఁడగు మురాదుసోదరుని యొడలు రక్తముతో జరజర చిందుచుండెను.

చక్రవర్తి యొక్క కేకపెట్టి సింహాసనమునుండి లేచి నిలువఁబడెను. ఆయన శరీరము గడగడ వణకి పోవుచుండెను. ఆయవస్థఁజూచి ఉమ్రావులందఱును దగ్గఱకు పరువెత్తుకొని పోయిరి. చక్రవర్తి

యకస్మాత్తుగా జబ్బుపడెనని వైద్యులను బిల్చుటకు చారులు పఱు వెత్తిరి. కొంతమంది యాయన చేయిఁబట్టుకొని యారామగృహము నకుఁ దీసుకొనిపోయిరి. దర్బారు విసర్జన మయ్యెను.

## ౧౪

ఇది సమయము కాదు

సాయంసమయమున చక్రవర్తి యారామగృహమున నస్వస్థుడై యుండెను. సమీపమున నఫ్జుల్‌ఖాను చేతులు జోడించుకొని నిలిచి యుండెను. చక్రవర్తి—'సేనాపతీ! ఏమి నీయభిప్రాయము? శత్రువులు తప్పించుకొనుటచే బహుశః నిమనను గుందుచుండవచ్చును' అనెను.

అఫ్జుల్‌ఖాను,—'ప్రభువులకు వారిపై ననుగ్రహము కల్గిన వారు నాకు శత్రువు లెట్లగుదురు? చిత్తము! కాని వారు మాత్రము భావి కాలమందు మనరాజ్యమున నొక్కింతే గడబిడ సేయక మానరు! అని ప్రత్యుత్తర మొసగెను

చక్రవర్తి—సమస్త ఉమ్రావులును హాకీములును చెప్పిన మాట త్రోసివేయలేక పోయితిని అందుచేత నేనే స్వయముగ కారాగారమునకు పోయి వారిని వదలిపెట్టించితిని

నేడు చక్రవర్తి ముఖమండలమున గంభీరవిచార మున్నదను సంగతి అఫ్జుల్‌ఖాను కనిపెట్టలేకపోయెను అతఁడు నిట్టూర్పు పుచ్చుచు ప్రత్యుత్తరమిచ్చెను,—'వారి యదృష్టభాగ్యమింత వినురని నేను స్వప్నమునందైనఁ దలంపలేదు'

చక్రవర్తి—వట్టి మాటలతో విచారించిన నేమి ఫలము? మంచిది,

ఇప్పు డీవృద్ధ ఫకీరు భావములను గూర్చి నీయభిప్రాయమేమో తెలియఁజేయుము.

అఫ్జల్ —పిచ్చివాఁడు, పాషండుఁడు, కాఫరువాడు, నరాధముఁడు

చక్ర — నే నారంభించిన నూతన రాజనీతి చాల హానికరమని ఫకీరు తలంచుచున్నాఁడు. వారి యభిప్రాయములో మనుపు అక్బరు బాదుశాహా నడిపించిన రాజనీతి మొగలుసామ్రాజ్యపక్షమున సర్వోత్తమము.

అఫ్జల్ —పిచ్చివాఁ డంతకంటె వేరే ట్లాలోచించును? కాఫరైనవాఁడైన ముసల్మానులఁ బ్రశంసించునా? దొంగవాఁడు వెన్నెల రాత్రి నెన్నఁడైన మెచ్చునా?

చక్ర — ఈవిషయమున నీమనసులో నేసందేహము లేదా? పూర్వకాలపు రాజనీతి కంటె నానూతన రాజనీతియే యన్నివిధములను మంచిదని నీకు నిస్సందేహమేనా?

వేఁడుకొనఁగ అఫ్జల్‌ఖాను చేతులు జోడించుకొని యిట్లు బదులుచెప్పెను,—'మహాప్రభో! ఈవిషయములో తిరిగి మీ రిప్పుడు నన్ను ప్రశ్న యడుగుచున్నారా! తమవంటి విశిష్టరాజనీతిజ్ఞు లీపృథ్విలో నింకెక్కడైన జన్మించియుండిరా? అక్బరు పాదుశాహా చేసిన వేడుకచే కాఫరులకు ఒడలు మదమెక్కిపోయినది. ఆసమయమున నది ముసల్మానుల రాజ్యము, ఇది హిందూరాజ్యమని వేరుపఱచుటకు వీలు కల్గెనా? ఇన్నిదినములైన తరువాత ఆలంగీరు చక్రవర్తులు ముసల్మాను వంశమునకు సూర్యులవలె నుద్భవించినారు. ఈఘోరాంధకారమును దరిమివేసి కురానుశరీఫ్ యొక్క జ్యోతిని వెలిగించి జాగరణము గల్పించిరి—తమ బాహువులయందలి శక్తిచే నాసేతుహిమాచలపర్యంతమును నందలి కొలది రాజ్యములు తమను శరణుజొచ్చినవి. మీభీషణ పరాక్రమమునకు తాళలేక

గాంధపుత్ర మహారాష్ట్ర దుర్దాంతరాక్షసగణంబులు భయభ్రాంతులై మ్లానప్రాయులై పడియున్నారు తమ సర్వబల మసహాయను మైన కోట్ల కొలది హిందువులు మహారాష్ట్రీయులు [illegible] పై బడియున్నారు. అంతేకాక—"

ఔరంగ—కాదు కాదు నా సామ్రాజ్యమునకే [illegible] వచ్చుచున్నది. ఈ ఇచ్ఛకము లాడకు అఫ్జల్‌ఖాను గొప్పవిజయముతో వచ్చెదనని తన్నుటకు—

ఈ మాట అనుచు చక్రవర్తి అఫ్జల్‌ఖాను రొమ్ముమీద లాగి యొక్క తన్ను జోరుగా తన్నెను. దానికి వాడు నేలమీదపడెను. పిమ్మట చక్రవర్తి యిట్లు పలవింపదొడంగెను—'ఓరీ నీచా! ఇక నోరు మూసుకొనుము. నీవట్టి ఇచ్ఛకపు వేషధారుడవని నే నేను మొగలు సామ్రాజ్యము నిపాతలము గావించితి. నా రాజనీతిజ్ఞతకు ఫలితము పరిపండుచున్నది. నేను ఇరువదికోట్ల భారతీయులు నాగుండెలలో రక్తము పానము చేయుచున్నారని యుచితులై యున్నారు! ఓరిమూర్ఖుడా! ఇదియా నా రాజనీతిజ్ఞత! ఇరువదికోట్ల హిందువులను కత్తికి గొట్టి నశింపజేయ దలచితిని. ఇదియే నా రాజనీతిజ్ఞత! ఒక మహావీరజాతిని నేను గులాములను జేయ దలంచితిని. నా బాహుబలము పూజ్యమాయెను! అయ్యో! అయ్యో! ఈబాహుబలముచే నాదక్షిణహస్తమును తెగగొట్టితిని! అరే స్తోత్రపారశాసృత వాకి అఫ్జల్‌ఖానా, నేను ధర్మాంధకారమూర్తినై సంపాదించిన ఫలితము! నావిశాల రాజ్యమందు హాహాకారధ్వనులు ప్రతిధ్వనించుచున్నవి. ఇదియేనాధార్మికతకుపరిణామము. నాప్రాణప్రియుడగు దారాను చంపితిని.' తండ్రిని ఖైదు చేసితిని '

బాదుశాహా చేతులుజోడించికొని కన్నులు నీరుగార్చుచు పైకి చూచుచు చెప్పదొడంగెను,—"రాజకులగురు మహారాజా! అక్బరు

సార్వభౌమా! ఒక్కసారి నీ దివ్యచక్షువులతోఁ జూడుము. మీ పవిత్ర వంశమునకు కులాంగారుఁడును నీచాశయుఁడును నగు ఔరంగజేబుని మూర్ఖతచే సువర్ణ భారతవర్షము కాలి బుగ్గయై పోవుచున్నది. మీ ప్రేమ రాజ్యము పాపసాగరమున మునిగి నాశనమై పోవుచున్నది. మర్త్యలోకమున మీరు ప్రతిష్ఠించిన ఆ యానందమయమగు నందన వనము నీ ఔరంగజేబు నేడు హాహాకారమయ ఘోరారణ్యమును జేసి వేసెను గదా!

ఔరంగజేబు కొంతసేపిట్లు బిగ్గరగా గదియందు ప్రచారము సేయుచు మరల నిట్లు పలుకసాగెను,—'కాదు, కాదు, ఇది సమయము కాదు, ఈ ప్రచండాగ్ని నెవ్వరును చల్లార్పలేరు. త్రికాలవేది ఫకీరూ! నీవు నరరూపమున నున్న దేవతవు. నీవు కేవలము మనుజుఁడవు కావు. దేవతామూర్తియైన మహమ్మదుయొక్క దూతవు. రాక్షస ఔరంగజేబుని గర్వమును చూర్ణము గావించుటకు స్వర్గమునుండి నీవు పంపఁబడి యుంటివి. నాకు శిక్ష నిచ్చితివి. కాని యో దేవా! ఇరువది యేండ్లకు పూర్వమే ఈ నరపిశాచమునకు శిక్షను మిచ్చిన నెంత బాగుండెడిది! ఇప్పుడీ ప్రచండహాలాహలము చల్లార్చుటకు నా శక్తి చాలునా! వందలకొలఁది సంవత్సరము లిది మండుచుండును గాబోలు. యావత్తు భారతవర్షము గాల్చి వేయునందాక నిది చల్లారదు కాబోలు. తరుణము మించిపోయినది—ఓరీ సేవకా! లెమ్ము. బాదుశాహా అఫ్జుల్ ఖానుని మరల నొక్క తన్ను తన్ని యిట్లు చెప్పసాగెను. 'లేరా సేవకా! లేరా సైతాను! చక్రవర్తియొక్క సైతాను సేవకా! ప్రేతయజ్ఞమునకు పూర్ణాహుతి నొసంగుము. అదుగో విను, దగ్గఅలో హిందువుల ఘోరగర్జన మాకాశమును బ్రద్దలుగొట్టుచున్నది. మహారాష్ట్రుల భీషణకోలాహలము, రాజపుత్రుల భీమగర్జనము, పంజాబీయుల వీరారావము వినవచ్చుచున్నది. పోయి యడ్డగింపుము!

పోయి కాఫరుల రక్తప్రవాహములో జాతీయనావను నడుపుము. పరిణామ మెట్లైనఁ గానిమ్ము. కాని ఇతిహాసమున ఔరంగజేబుని పాడుపేరు రక్తాక్షరములతో వ్రాయనిమ్ము. యుగయుగంబులును ఐతిహాసికులు కన్నులనీరుఁగార్చుచు ఆలంగీరు చక్రవర్తియొక్క నిష్ఠురరాక్షసలీలను వర్ణించిన వర్ణింతురు గాక!

---

# ద్వితీయ ఖండము

## ౧

### ఆరావళీ కొండలెక్కుట

అరావలీ కొండలక్రింద యోధపుర మహారాణి యరుంధతియు అంబర రాజకుమారియు విలాసకుమారియును గూర్చుండి విశ్రాంతిఁ దీసుకొనుచుండిరి. దుర్గాదాసును ముకుందదాసును దగ్గఱనున్న శిబిరములోని రాజపుత్రులతోఁ గలిసికొనుటకు పోయియుండిరి.

విలాసకుమారి—రాణీగారూ! దయచేసి ఇటుచూడుడు, అంబాలిక యింతవఱ కేడ్చుచునేయున్నది.

అరుంధతీదేవి—అయ్యో ఎంతకష్టము! అంబాలికా! నీవు క్షత్రియ కన్యవు కదా. క్షత్రియవీరులు యుద్ధము సేయుటఁజూడ నీహృదయము వ్యాకులపడఁదగునా? ఇప్పుడును నీకన్నులనుండి నీరు కారుచున్న దే. ఆశ్చర్యముగా నున్నది!

అంబాలిక—మహారాణీ! నాకన్నులనుండి ఈ జన్మమున్నంత వఱకు నీరు కారుచునేయుండును. అక్కటా! దేవీ! ఆఢిల్లీనగరములో

నాదినమున వందలకొలది స్త్రీలు నిప్పుగుండములఁబడి తగులఁబడినపుడు మీరు నన్నుఁగూడ నాయింటఁ బొమ్మని యేల యాజ్ఞాపింపరైతిరి? ఇట్లయిన నాయీ బాధయంతయుఁ దొలఁగిపోయెడిది గదా!"

మహారాణి కొంచెము చిన్నబుచ్చుకొని యభిమానము వ్యాజయమున నందడింప లేచి యిట్టునిటు పచారు సేయసాగెను

విలాసకుమారి—రాజకుమారీ! ఆ కృషీవల బాలకుఁడు యుద్ధమునఁ బ్రాణము సమర్పించునని మీకెట్లు నమ్మకము?

అంబాలిక—మీయుద్దేశము నేనా కృషీవలయువకుఁడు చచ్చిపోవునని భయముచే వ్యాకులపడుచున్నాననియా?

విలాస—మఱి యింకెందుకు?

అంబా—దుర్గాదాసుని కరకుఁగనుచూచి నా హృదయము వేదనపడుచున్నది. వాఁడు కృషీవలుఁడు కాకుండిన నే రాజవంశమునందైన జన్మించియుండినయెడల మీరోజు చేసిన చందమున శత్రువుల చేతులలో సర్పించి ప్రాణములను రక్షించుకొనుటకు పాఱిపోయి వత్తునా? కొద్దికులమునఁ బుట్టిన కృషీవలయువకుఁ డగుటవలననే వాఁడు మానమర్మము లెఱుంగకుండ నంత కార్యమునకు పూనినాఁడు.

విలాస—రాజకుమారీ! నామాట వినుము బాలకునిఁగూర్చి చింతింప నవసరములేదు. నిరాశచెందవలసిన పనిలేదు. పరమేశ్వరుని దయవల్ల మీ కృషీవలయువకుఁడు నూర్వురు ముసల్మానులను జంపి యుద్ధమందు విజయలాభమునొంది మీ యొద్దకు తిరిగి రాఁగలఁడు.

రాజకుమారి సగర్వముగ నిట్లు ప్రత్యుత్తరమొసంగెను,—'విలాసకుమారీ! నీ వేమనుచుంటివి? నా కృషీవలయువకుఁడా? నా యొద్దకు తిరిగి వచ్చువాఁడా? నాకును వానికి నేమిసంబంధము? ఏమి నీకు

తెలియదా ! నేను రాజేంద్రనందనిని. వాడు నిచకులోత్పన్న కృషీవలుడు ! నాసంకల్పము దూరమైపోయినది.

విలాస—ఆమాటలు పిమ్మట నాలోచించుకొందము. అదుగో చూడు, దుర్గాదాసిట్లు వచ్చుచున్నాడు. బహుశః మన మిప్పుడే మాతృమందిరమునకు పోవలసియుండును.

దుర్గాదాసు జోధపుర రాజమహిషితో నిట్లనియె,—'దేవీ! సాయంకాలము కావచ్చుచున్నది. రాజులందఱును సర్దారులందఱును గూడియున్నారు. తమ యాజ్ఞయైనయెడల మేము వారిని మాతృమందిరమునకుఁ దోడ్కొనిపోదుము.

అరుంధ—సరే, ఇఁక నాలస్య మెందుకు?

దుర్గాదాసు రణభేరి వేయించెను. ఆ ధ్వానమును విని క్షత్రియ వీరులు స్త్రీలతోఁగూడ గుడారములనుండి లేచి గుఱ్ఱములపై నెక్కి ముందుకు వెడలిరి. పదాతులు వారి వెంట నడిచిరి.

దుర్గాదాసు అరుంధతీదేవితో నిట్లనెను.—'మీరు స్త్రీలను వెంటఁ దీసుకొని ముందుపొండు. నేను పురుషులను వెంటఁదీసికొనివచ్చెదను. దేవీ! నేఁడు రాజపుత్రస్థానమునకు శుభదినము—నేఁటి ఈ అపూర్వదృశ్యము భారతదేశపు మహేతిహాసమందు సువర్ణాక్షరంబులతో వ్రాయదగును.' పిమ్మట దుర్గాదాసు బిగ్గఱగా నాకాశము కంపించునట్లు పలికెను,—'సోదరులారా! అందఱు నొక్క కంఠముతోఁ జెప్పుడు. జయ! భారతజననికి జయ.!''

కంఠము కంఠముతోఁ గలిపి కూపస్మంది రాజపుత్రవీరులును, 'జయ! భారతజననికి జయ!' అరావళికొండ కంపించుచు ఘోరముగఁ బ్రతిధ్వనించెను,—'జయ! భారతజననికి జయ!'

ఆ నాఁటి కధికమగు వీరనారీమణుల వెనుక దుర్గాదాసు ప్రక్క లెక్కలేనంతమంది వీరభటులు పార్వత్యప్రదేశముచు ౫౦

పింపఁజేయుచు నారావలీకొండ లెక్క నారంభించిరి. విలాసకుమారి తన నీలాశ్వము నారోహించి యరుంధతీదేవితో కొండ నెక్కుచు పాటపాడనారంభించెను ఆమె యమృతమయ కంఠముతో స్వరము గలిపి. ఇతర స్త్రీలును గాన మారంభించిరి.

## ౨

### చివఱకు ప్రేమ

సాయంకాలమునకు ముందు కృషీవలుఁడు ఆరావలీపర్వతమునకు క్రింద నొక్కడును గూర్చుండి యేమార్గమున నరుంధతీదేవియొక్క మాతృమందిరమునకు బోవలెనో యని యోచించుచుండెను. అట్లుండగాఁ గొంతసేపటికి నొక్క గుజ్జరపుసవారు గీతమును బాడుచు వానివైపునకు వచ్చుచుండెను. తాను బోవలసిన బాట యెద్దని యడుగుట కాకృషీవలు డాగంతుకుని యెదుటకు పోయి నిలువఁబడెను. వానినిఁ జూడగనే యాగంతుకుడు తియ్యనికంఠముతో నిట్లనెను,—"నేను మిమ్మునే వెదకుచున్నాను. మీరు బాదుశాహా ఖైదునుండి తప్పించుకొని యిట్లు వచ్చిరి బహుశః నన్నెరుఁగరు? కొంచె మిక్కడేయుండుడు. ఇప్పుడే వచ్చెదను."

ఆగంతుకుఁడు కొంచెము దూరమేగి తన వేషమును మార్చివేసెను ఆమనిషి తన సిపాయివేషమును వదలి స్త్రీ వేషమును దాల్చెను. రొమ్మునుండి లోహకవచమును దీసి యాస్థానమున ముత్యములహారములు ధరించెను. నడుమునుండి కత్తినూడలాగి యాస్థానమున వడ్డాణమును బెట్టుకొనెను. కాలిజూతాలు బారవేసి యందెలు తొడిగికొనెను. అటు పిమ్మట వెంటనే తల పాగాలో నుండి మహాకాల సర్పంబు పగిది చరణములవఱకు బారైన

వేణీభరంబు విస్తరించెను. ఆహాహా! ఈసుందరరూప మెక్కడనో కృషీవలుం డీవఱ కొక్కసారి చూచియుండినట్లున్నది. ఔనౌను. ఆ సుందరమోహనమూర్తి! నాడు కాళిందీతీరమున నిర్జనప్రాంతమున స్వప్నమునఁ గానఁబడిన యవనసమరమునకు మార్గమును జూపించిన దివిశ్వమోహనమూర్తియే—

రమణీలలామ దగ్గఱనున్న నొక చెట్టుపైకొమ్మమీఁదకెక్కి తన సిపాయి దుస్తులను గట్టివేసెను. అటుపిమ్మట నామె కృషీవలుని దగ్గఱకు వచ్చి నిలువఁబడి నవ్వుచునిట్లనెను,—'ఇప్పుడు నన్నెవరో ఆనవాలు పట్టెదరా? నేనెవరో నిజముగాఁ జెప్పుడు.'

కృషీ—మీరాదివ్యసుందరీమూర్తులు

రమణీమణి మధురహాసితయగుచు నిట్లనియె,—'ఈ యభాగ్యురాలి మోమున మీరేమి దివ్యసౌందర్య లక్షణమును గనిపెట్టితిరి?

కృషీవలుఁడేమియుఁ బ్రత్యుత్తరమియ్య లేక పోవుటను జూచి రమణీలలామ మరల నిట్లు ప్రసంగించెను,—'నేడు మీరనినమాటలు మరెన్నఁడు ననవద్దు—నన్ను విలాసకుమారియని పిలువవలెను. నేను చిన్నతనమున వేషభూషనాదులం దెక్కువ ప్రేమ కలదాన నగుటచే నన్ను మాతండ్రి 'విలాసకుమారి' అని పిలుచుచుండెడివాడు.' ఇట్లనుచు నామె తన దుస్తులవైపునకును నగలవైపునకును జూచుచు మధురస్మితయగుచు 'నింకను నాకు వేషభూషణముల యెడల మనసు తగ్గలేదు ఆసంగతి యటులుండనిండు—ఇప్పు డొంటరిగఁ గూర్చుండి యేమి చింతించుచుండిరి?'

కృషీవలయువకుడు—'రారోరు సేనాపతి దుర్గాదాసీ కొండమీఁద నున్నట్లు తెలియవచ్చినది. కాని యెక్కడున్నాడో ఏత్రోవఁ బట్టుకొనిపోయిన నాయనను గలిసికొనవచ్చునో యీ సంగతులు దెలియకున్నవి.

విలాసకుమారి యిట్లు ప్రత్యుత్తరమిచ్చెను,—‘మిమ్ము మాతృమందిరమునకుఁ దీసుకొనిపోవుటకే యన్వేషించుచుంటిని. ఆయపూర్వమాతృమందిరము మనకు చాలదగ్గఱనేయున్నది పదండి’ మిమ్ము నే నచ్చటకుఁ దీసుకొనిపోవుదును కాని మీ కచ్చట రాచకుమార్తె యగు నంబాలిక దర్శనముకాదు.”

యువకుఁడు చకితుఁడై యిట్లడిగెను.—‘అటులైన రాజకుమారి అంబాలిక యెచ్చటనుండును? ఆమె రాఠోరుసేనాపతితోడను మహారాణితోడను ఇట్లువచ్చెనుగదా?’

కాంతామణి చిరునవ్వునవ్వుచు నిట్లనియె,—‘ఏల మీ రామెను గూర్చి యడిగెదరు? మీ కా రాజకుమారితో నేమిపనియున్నది? మీరు వీరులు యోధులు ఆమె యబల, వగలాఁడి. మీరు దరిద్రులు కృషీవలురు. ఆమె మహారాజనందని.’

ఈమాటలు బలుకుచుండ నామె ముఖచంద్ర మండలమున రాహుచ్ఛాయలు వడినట్లు గాన్పించెను. ఆమె కొంతతడవూరకుండి మరల చెప్పసాగెను.—‘నా కర్థమైనది. మీ రామెయెడల ప్రణయయుతులై యుండవచ్చును, కాని మీ ప్రణయమున కిది సమయమా? నిజముగ నాలోచింపుడు. మీ స్వర్గాధికమైన భారతజనని యవనపదదళితమై నేలదొరలుచున్నది. అట్టియెడ మీకొక చపలాక్షిపై నను రాగమా! మీరు క్షత్రియవీరులు గదా! మీచుట్టును పిశాచపీడితమై యార్యావర్తము హాహాకారములు సేయుచున్నది. మీ హృదయము రమణీదర్శనలాలసమై యున్నది. సిగ్గు సిగ్గు.’

యువకుఁడు మాటలను లక్ష్యము సేయక మరల, రాజకుమారి అంబాలిక యెచ్చటనున్నదో తెలియునా? అని యడిగెను.

ఆ మాటల కా కాంతారత్నము మరల నవ్వెను. ఆమె యవలంబించిన గంభీరత యామె మందహాసము వెనుక దాగుకొనియుండెను.

హృదయాంతరాళమున పారుచున్న సిగ్గుచ్ఛాయాతరంగిణిలోని యగాధాంధకారముపై నెగురు పిల్లవాయువులచేబుట్టు వీచీమాలికలక్రింద మరుగుపడి యుండెను.

విలాసకుమారి యిట్లు నవ్వుచు నిట్లనియె — 'ఇంతలో నా మాటయే మఱచుచున్నారు. నేను కొన్ని దినములనుండి రాథోరు సేనాపతి కోట యందున్నాను. ఆ బాలికకూడ మిమ్ముగూర్చి యొక్కయో మాటలు పల్కినది కాని మా పత్నియగునని మీరు ప్రణయ చింతను జిక్కియుండ సంకట యుద్ధము సేయు రెవ్వారు! రాథోరు సేనాపతి దుర్గమునకు జేరకముందు నాతో మీరొక్క బాస చేయవలెను.'

యువకుడు—యథాశక్తి యొసగెదను ఏమిటో చెప్పుడు.

స్త్రీ—శపథము సేయుడు యుద్ధము సమాప్తము కాకుంతవఱకు మనోవాక్కాయకర్మలందు శత్రుసంహారముతప్ప మఱియొక్క యోచన సేయకుడు. మొదట శత్రుసంహారము తరువాత ప్రణయోపాసన. ఇందుకు మీ బాస యొసంగుడు. నా చేతిలో చేయి వేయుడు.

కృషీవలుడు—సుందరీ! బహుదినములనుండి మ్లేచ్ఛవధయందు దీక్షితుడనై యున్నాను. నా జీవిత మాసాధనమందు ధారవోదును.

ఆ శపథమున కాతరుణీమణి యానందము చెప్పఁదరముకాదు. అనంతర మిద్దఱును కొండపై కెక్కనారంభించిరి. ఆకాశమునుండి నవ్వులరాసియగు జాబిల్లి తరుణీముఖ చంద్రమండలముపై సుధావృష్టి గురియుచుండెను. కృషీవలుడు కన్నులువిప్పి కాంతామణివంక నొక్కసారి చూచెను. చూచినంత నాతని మనసు తటాలున పులకరించెను. ఏదియో జ్ఞాపకమువచ్చిన ట్లుండెను. ఇట్టి తరుణీమణి నేపూర్వము చాలదినములక్రింద వివాహమండపమున జూచినట్లాతనికి తోచెను.

కృషీవలుఁడు చకితుఁడై యడిగెను.—'మిమ్ముల నింతకుముం దెక్కడనో యొకసారి చూచినట్లు జ్ఞాపకము'

స్త్రీ—ఆనాడు అడవిలో నదీతీరమునఁ జూచితిరి. ఇంతలోనే మరచితిరా?

కృషీ—అంతకు ముందు, చాలదినములకు ముందు, చిన్ననాడొకసారి ఎక్కడనో చూచినట్లున్నది. కాని జ్ఞాపకమువచ్చుటలేదు. ఎక్కడనైనఁ జూచియుంటినా?

అకస్మాత్తుగా తరుణీమణి కొకవిధమైన భయముదయించెను. క్షణకాలము ఆమె మాఱుమాటాడలేక యూరకుండి ధైర్యము తెచ్చుకొని యిట్లనెను—'మీరేదో భ్రమపడియున్నారు. బహుశః నావంటి యభాగ్యురాలి నింకెవ్వరినైనఁ జూచియుండవచ్చును, పోనిండా సంగతులెందుకు? అదుగో చూడుడు,—దగ్గఱకువచ్చినది మాతృమందిరము. ఎఱ్ఱజెండా యెగురుచున్నది. నాకిచ్చినబాస మరువఁగూడదు,—మొదట యుద్ధము పిమ్మట ప్రణయము.

## 3

### సంగర హారతి

విలాసకుమారి—కృషీవలయువకుఁడా! అదుగోవిను. హారతిసమయ యమున శంఖధ్వని యదుగో! వీరవరా! ఇక్కడొక్కింతసేపు నిరీక్షింపుము. దూరమునుండివచ్చు శంఖారావమువిని హృదయమును బరిశుద్ధము చేసికొనుము. పిమ్మట దగ్గఱ కేగుదము.

ఇదియేమి శంఖధ్వని! శంఖధ్వని యేమి ఇంత మధురమైయుండునా? శంఖమునుండి యేమి ఇట్టి సుందరధ్వని బయలుదేరునా? శంఖధ్వనినుండి యింత యమృతవృష్టి గురియునా? శంఖధ్వని యేమి

యను రాగపూర్ణహృదయుల నింత వేదురు నొందించునా? ఒకవేళ నిది వీణానాదమేమో! వీణానాద మింత గంభీరముగ నుండునా? వీణానాదముచే నీకుల ప్రాణ మీాతెరంగున నున్మత్తమగునా? వీణయొక్క స్థాయి యొక్కసారిగ సప్తమస్వరములను కెక్కగలదా! కృషీవలుఁడు తిన్నగా గ్రహింప లేక పోయెను. ఈశంఖధ్వనిలో సంగీత లీలాప్రపంచమున ప్రేమ స్రవంతులైన కామినీజనుల మధుర కంఠములు గూడ గలిసియున్నవి.

పిమ్మట కృషీవలుఁడు కనుఁగొనెను. పంద్రెండుగురు రమణీ మణులు పాడుచు మందిరమును వెలువడివచ్చిరి. వారి వెంట నింక ననేక మంది స్త్రీలు పాటలు పాడుచు మందిరము ముందువచ్చి నిలువఁబడిరి. వారినిఁ జూచి విలాసకుమారియుఁ ఒఱువెత్తుకొనిపోయి కలుసుకొని తానుగూడ వారితో స్వరము గలిపి పాడనారంభించెను.

కొంచెము సేపటికి స్త్రీలయొక్క పాట ముగిసెను. కాని యిది యేమి? ఇది నారీమణుల గీతములకు ప్రతిధ్వనియా ప్రత్యుత్తరమా? స్త్రీల పాట ముగియక పూర్వమే ఒకవిధమైన భీషణమును లోమహర్షణమును గంభీరమునగు భేరీరవమును గానితో మేళవించి కరవాల ఝణఝణారవములు గీతధ్వనులును వినఁబడెను. అమృత భాషాతరంగిణీ కలకల నిస్వనంబు లరాత్తుగా సింధుగంభీరగర్జనంబుల లోనికి పరిణమించినట్లు తోచెను. కృషీవలుఁ డాశ్చర్యముతోఁ డఁ దిలకించెను. మందిరమునకు రెండవవైపునుండి వందలకొలది వీరులు వందలకొలది ప్రళయకాలజీమూతములభంగి కరవాలతటిల్లతాసమ హాసముతో పాడుచు నాడుచు మందిరమునుండి మైదానమున కరుగుచుండిరి.—కృషీవలుఁడు మంత్రముగ్ధుఁడై వినుచుండెను.—

ఆపర్వతముమీాద నార్యవీరులు హారతిగీతములుపాడి నృత్యములు సేసి యారావళీపర్వతములఁ గంపింపఁజేయుచుండిరి. పైకి లేచిన

కరవాలములు ఒండొంటితో నొరయుచుండెను. వీరు లిట్లు చెప్పు కొనుచుండిరి,—నేడు భారతభూమిని దానవులనుండి రక్షించెదము, అసురుల ప్రాణముల చేతను గీ పిడిపింతము.

కృషీవలుఁడు తాఁ మోయుచున్న ఖడ్గమును ఒరనుండి తీసి పెట్టె వాని చందమునఁ బయట పెట్టి స్వాత్మమందిరమునుండి వెలువడిన మంగళారతియందు కలిపికొనెను.

## ౪

### విజయపాలుఁడు

ఉదయమున దుర్గాదాసు కృషీవలునితో మాటలాడుచుండెను. దుర్గాదా సిట్లు పలికెను, 'యువరాజా! మాతో ఝూరులో యుద్ధమునకు నడువ సిద్ధముగ నున్నావా?

కృషీవలుఁడు (మాట కడ్డమువచ్చి) రాథోడ వీరా! మీరే నన్ను యువరాజని బిలిచిన నే సింక నామూరు వేషమును రక్షించు కొనుటెట్లు?

దుర్గా—క్షమింపుము. నేను మఱచితిని. మీయజ్ఞాతవాసము సంపూర్తి కావంతవఱకు నేను మిమ్ములను కృషీవలభటుడనియే సంబోధించెదను. నాతప్పు క్షమింపుడు. తమ సంగతి వెల్లడిసేయుటకు తగిన సమయ మాసన్నమైన నపుడు నాతప్పు క్షమింపఁ బ్రార్థించుచు తమకు నాచేనైన కానుక సమర్పించుకొందును.

కృషీ—ఇప్పుడు తమ యాజ్ఞయేమో సెలవిండు. ఝూలోరు యుద్ధమునకు వచ్చుటకు నేను సంసిద్ధుఁడనై యున్నాను. తమదే యాలస్యము.

దుర్గా—నేను హారవతి రాజకుమారుఁడు విజయపాలున కెదురు

చూచుచున్నాను. ఆయను నిప్పుడే యిచ్చటకు రాఁగలడు మీ రాయనను జూచినఁ జాల సంతోషింపఁగలరు. ఈబ్రహ్మసృష్టిలో నాయన యొక యద్భుతవ్యక్తి.

కృషీ—ఆయన పే రెచ్చటనో వినియున్నాను. ఆసురాం బ్రాత నికి 'కాలాపహాడ'ని పేరుపెట్టినారు

దుర్గా—ఆయన నాచుట కెత 'కాలాపహాడో' కార్యాగుందు కూడ నంత విచిత్రమైన మనిషి. ఆయన చాల కల్లకపటములు తెరుగనివాడు ఎవనితో నెప్పుడైన నేమైన నాలుగు మాటలాడినప్పుడా మాట కర్థ మాయనకే తెలియును కాని యాయన వీరత్వము మాత్ర మసాధారణము. మీరింక మాని నాశ్చర్యపోవుదురు. అగుగో వచ్చుచున్నారు మనదగ్గఱకే వచ్చుచున్నారు మీకిప్పుడె తెలియఁగలదు. మీతో నెన్ని తమాషామాటలాడునో చూడుడు.

కృషీవలునకి ప్రత్యక్షమాయెను పల్లగొండవలె నున్నాఁడు మనిషి. నెత్తిమీద తలపాగా చుట్టుకొనుచు వచ్చుచున్నాఁడు. దగ్గఱకు వచ్చి బిగ్గఱగా నవ్వుచున్నట్లు పలుకనారంభించెను,—"దుర్గాదాసు! చెప్పవేమి? ఇంతవఱకు చెప్పినదేమిటి? ఆఁని చివఱకైనదా లేదా? రాణాసింహుని తేజసింహుని ఇంత గొప్పయుద్ధమునకు సేనాపతులను జేసి మీరెట్లు పంపించిరి? చివఱకు నేనుగూడ శరణుజొచ్చవలసి వచ్చునేమో. మంచిది, ఇంక నేమి హాస్యము. సైన్య మెచ్చట నున్నది?"

దుర్గా—అయిదువందల గుఱ్ఱపు సవారులును వేయిమంది పదాతులును మీకొఱకు వేచియున్నారు. మిగిలిన ఇరువదివేలమంది సిపాయీలును తేజసింహునివెంట రణరంగము వెళ్ళియున్నారు. జయపూరు జైసలుమీరులనుండి ఎంతమందియో సిపాయీలు రావలసియున్నారు. వీరుగాక చక్రవర్తిగారి కుమారుడు అక్బరు డెబ్బదివేల సిపాయీల

తీసుకొని ముందుకు వెడలియున్నాడు. బహుశః వారిప్పటికి ఝాలోరు చేరియుందురు. పది బలమైన సైన్యములు తీసుకొని మనము మొగలు రాజధాని ఢిల్లీపై దండెత్తి తరువాత బాదుశాహా ప్రస్తుతమున్న అజ్మీరును ముట్టడింతము. పరమేశ్వరుని దయవల్ల పాపియగు నౌరంగ జేబును గొలది దినములలో సింహాసనమునుండి పారఁదోలఁగలము.

విజయ—హా! ఔను మంచిదే అయిన చెప్పుడు ఇంత పెద్ద సైన్యమునకు సేనాధిపతి యెవ్వరు? ఔరంగజేబు కుమారు డగ్బ రేనా యేమి?

దుర్గా—(నవ్వుచు) మీరుండగా నింక సేనాపతి యెవరని యడుగవలెనా? తమరు సర్వసేనాధిపతులు. తేజసింగును అక్బరు ప్రభృతులును మీకు సహాయ సేనాపతులు. ఇక్కడనుండి మేమిద్దఱ మును మీకు సహాయముగా బయలుదేరి వచ్చెదము.

విజయపాలుడు (సహర్షముగా)—నేను నరే సర్వసేనాధిపతిగా నుం దును. మీరు స్థిరపరచినారు-మంచిది! సరిగా చేసితిరి! వీరుని మహ త్వము వీరుడే గ్రహింపఁగలడు. గాని మఱి యెవ్వరికి తెలియ నగును? దుర్గాదాసు! విను నే నొక్కమాట చెప్పెదను. ఆమాట నీ వెన్నఁడును మరువకుము. ప్రతియుగమునందును ఇద్దఱు వీరులు మాత్రమే యవతరించుచుందురు. కృతయుగమందు నిశుంభుఁడును రక్తబీజుఁడును, త్రేతాయుగమందు కుంభకర్ణుఁడును, హనుమంతుఁ డును, ద్వాపరమునందు భీమసేనుఁడును రెండవవా రెవరో మరచి పోయితిని నోటిలో నాడుచున్నది. హా! జయద్రథుఁడు! ఇక మన కలియుగములో విజయపాలుడు ఉరవుకాలాపహాడును రెండవవాడు దుర్గాదాసు! వీరుగా కితరులు అట్టా అట్టాంటి వీరులే. హుం మీ రే మనెదరు? నిజమేనా? నాతో వచ్చు నిద్దఱు సహాయక సేనాపతు లెవ్వ రెవ్వరు? మీరును రెండవవారు?

దుర్గా—రెండవవా. డీవీరయువకుఁడు.

విజయపాలుఁడు తీవ్రదృష్టితో కృషీవలుని దిక్కు చూచి, యిట్లనియె,—'వీరయువకుఁడా? ఎక్కడనుండి వచ్చితివి? నీ వెవరు? తమ్ముఁడూ మాటలాడవేమి?

కృషీ—నేను మేవాడదేశపు ఒక దరిద్రవ్యవసాయకుఁడను.

విజయ—మేవాడదేశపు వ్యవసాయకుడవా? కృషీవలుఁడవు. మంచిది మంచిది బహుమంచిది నీవు ఢిల్లీపాదుషాతో యుద్ధము సేయుట కిచ్చటకు వచ్చితివి. హాం! శరీరము గట్టిగానే యున్నది. ముఖమున వీరశ్రీము నిండుగా నున్నది. నీవు నాఁగలిపదలి కత్తిచేఁబట్టి యెన్నాళ్లయినది.

అహా! హా! కృషీవలపుత్రుడు సేనాపతి! ఇదియే ప్రధమ పర్యాయము నేను వినుట.

కృషీ—మా మేవాడులో మహారాణావారి యాజ్ఞ—ధనికులు దరిద్రులు యావన్మంది యుద్ధవిద్య నేర్చుకొనవలెనను ఒలపంతము.

విజయ—వహావ్వా! మంచిజ్ఞాపకము చేసితిరి. మేవాడరాణా జయసింహుడు, మీకు బహుశః తెలియదనుకొనెదను. ఆయన వరసకు నాకు బావగా రగుదురు. ఆయన ఇప్పుడు జయసముద్రతీరమున నుండి కమలాదేవిగారియగాధప్రణయ ప్రవాహములో పడి బుటకలు వేయుచున్నాడు దుర్గాదాసు, చూడు, మీతో నింకొకమాట చెప్పవలసియున్నది. ఒకయుద్ధములో ననేకమంది సేనాపతు లున్న పెద్ద గడబిడ అయిపోవును. ఈ సంగతి మీకు తెలియదా? అందఱును ఎవరి త్రోవ వారు చూచుకొందురు. కొందఱు, యుద్ధమేమైన నగుగాక 'నాప్రాణ మెట్లు బయటపడును' అనిఅనకొందురు. కొందఱు 'ఎట్టి భయంకరమైన యాపదలో పడితిమిరాబాబూ! యుద్ధ మెట్లాగి పోవునురా నాయనా!, డేరాలోనికిపోయికూర్చున్న బ్రతికిపోదుము?'

అని తలంచుచు కొందఱు అటు నిటు నాల్గువైపులం జూచుచు పాఱి పోవుటకు సందు ఏది రా!' యని తిలకించెదరు.

దుర్గా—మీకీవిషయమును చింతవలదు. నేను యుద్ధసమయములో పాఱిపోవుటకు సందు చూచుకొనువాఁడను గనిపెట్టి యుందును.

విజయ—వ్యంగ్యముగ నేను చెప్పుటలేదు. ఈ తక్కిన వీరుల సంగతి చెప్పుచున్నాను మీరు పాఱిపోవుటకు సందు వెదకరని నాకు తెలియును. మీరు పాఱిపోవునెడల నొక్కసారే పరలోకమునకు దారిచూచెదరు పరుల భూలోకమున నుంచరు. ఇందుచేతనే చాల మంది సేనాపతులవద్ద కేవలము మీరొక్కరున్న బాగుండునని నేననుచున్నాను.

దుర్గా—సరే అక్కడకువెళ్ళి ఎటులఁజేసిన యుక్తమో అట్లు చేయుదము. మంచిది పోవుదము దయసేయుఁడు అదుగో రణభేరి వినఁబడుచున్నది సైన్యములు కూడియున్నవి.

కొంచెముదూరములో నాత్మమందిరమున కింకొకవైపున రణదుందుభి మ్రోఁగనారంభించెను దుర్గాదాసు విజయపాలు కృషీవలులతో ముందుకు సాగిపోయెను.

## ౫

### సార్వభౌముని యుత్తరము

ఝాలోరు దర్బారునందు దుర్గాదాసును విజయపాలుడును కృషీవలుడును ఇంక ననేక రాజపుత్రసేనాపతులును సభతీర్చి కూర్చుండిరి. వారి యెదుట నూతనబాదుశాహా అక్బరు చిన్నవోయిన మోముతో

జైసల్మీరు రాజకుమారుఁడగు కేసరిసింహునితోఁ గలిసి నిలిచి యుండెను.

కేసరిసింహుఁడు—దుర్గాదాసు! మీరిరువురును రాజస్థానమున కేమాయెను నెరుఁగనేరరు. ఈ నలభైయేండ్ల రాక్షసచక్రవర్తి ఔరంగజేబు రాజపుత్రవీరులను కలుపుకొని తనముఁగలవలె కొన్నిసార్లు మోసపు దెబ్బలు కొట్టియున్నాఁడు. ఇతనిచేసిన మోసమెంత గట్టిమైనది!

దుర్గా—నేనిట్టి బలియగునని స్వప్నమందైనఁ దలంపలేదు. ఒక్కసారిగా రాజపుత్రులందఱి బుద్ధియు నెచ్చటికో నెగిరిపోయినది! ఔరంగజేబు వెంట మాయోపాయమున నాఁడో స్వయం రాజపుత్రజాతియొక్క మూలమంత్ర మెంతటి ఘూర్ణితమయ్యెనో నిండియున్నదో వారలే మెఱుంగుదురు!

కేసరి—నాహృదయము పశ్చాత్తాపమున దహించుకొనిపోవుచున్నది. రామసింహు డుత్తరము చేతిలోఁ బెట్టుకొని నాయొద్దకు వచ్చినప్పుడే నేను చెప్పియున్నాను. 'మీ రీయుత్తరమునందొక్క యక్షరము కూడ నమ్మవద్దు. ఇది ఔరంగజేబు మాయమాత్రమే గాని యింకొకటి కాదు.'

దుర్గా—ఉత్తరములో నేమున్నది?

కేసరి—రామసింగు తీసుకొని వెళ్ళినాఁ డా యుత్తరము. అందులో తాత్పర్యమిది,—'అక్బరు కుమారా! నీవు చేసిన చమత్కార వ్యవహారము నీచిన్న జాబునందు వర్ణింపఁజాలను. నాకు చాల సంతోషముగానున్నది. నీవు తీసుకొని వచ్చుచున్న డెబ్బదివేల సైన్యము ఢిల్లీకి చేరగానే యిచ్చటి సైన్యముతోఁ గలిపి కాఫరుల సైన్యముపైఁబడి నురుమాడవలెను. వెంటనే కాఫరులను వెంటఁదీసుకొని నా యొద్దకు రమ్ము.'

దుర్గా—ఎటువంటి భయంకరమైన మాయవాఁడో చూచితివా?

ఇట్టి యుత్తరమును నమ్మువారు కూడ జగత్తుమీద నుందురు కాబోలు.

కేసరి—ఎట్టి యాశ్చర్యము జరిగినదో చూడుడు. ఈయుత్తరము చూడగనే మనసేనాపతు లందఱును మహామతియగు నక్బరును 'విశ్వాసఘాతకుఁ'డనియు 'మోసగా'డనియు కారులరచి యతని సత్యతను ఉదారతను అవమానపరచి తమ తమ సేనలను దీసుకొని వెడలిపోయిరి. నేను వారి నెంతయో ప్రార్థేయపడి యొక్కక్షణ కాలము వేచియుండుడని కోరితిని. కాని నామాట యెవ్వరును విన లేదు. హిందూసేనలు వెడలిపోవుటను జూచి ముసల్మాను సైన్యములును ఢిల్లీ దెసకు పయలుదేరిపోయెను.

అక్బరు—వా రొక్కక్షణకాలము నిదానించి నాకాజాబు సంగతి చెప్పియుండిరేని నేను వారి భ్రమలను దూరముచేసి వేసెడివాడను—నేను మోసగాడనో కాదో దుర్గాదా సెరుంగును—నేను సమస్త విషయము లీతనతో విప్పి చెప్పియుంటిని. చాల దినములనుండి చక్రవర్తి దుష్టచర్యలను అత్యాచారమును జూచి నేను హృదయమునఁ గుందుచుంటిని. రాజపుత్రులతో సంధిచేసుకొని సఖ్యముతో నుండుట కర్తవ్యమని నే నెన్నోమారులు చెప్పి, యందు కాయనను వేడుకొంటిని. కాని యాయన పట్టిన మూర్ఖప్రతిజ్ఞ నాయన విడువలేదు. అనేకమంది ముసల్మాను సిపాయిలు హిందువుల యెడల చక్రవర్తి సేయుచున్న దౌర్జన్యమును జూచి మనస్సు సంక్షోభించియుండిరి. నేను నామనస్సులోని మాటను వారికి చెప్పగానే నాప్రస్తావము నామోదించి నాకు తోడగుటకు సిద్ధమైరి. కాని విధిలిఖితము నెవ్వరు తప్పింపఁగలరు?

దుర్గా—ఫలిత మేమైనను ఈ రాజపుత్రజాతి యంతయు మీ యెడల పూర్తిగ కృతజ్ఞులై యుందురు.

అక్బరు—ముసల్మాను మహారాజ్యములో నాకింక నిలువ నీడ

లేదు. చక్రవర్తి నా ప్రాణములు బ్రతికించెదనని చెప్పెను. కాన నా ప్రాణములకు ఝుడియుటలేదు గాని నా భార్యబిడ్డల యవస్థ దలచుకొని విచారపడుచున్నాను.

కేసరి—నా దేశమందు మీ రానందపూర్వకముగ నుండవచ్చును. మేము బ్రతికియుండగా ఔరంగజేబు మీ యొడలిమీది యొక్క వెంట్రుకనైన కదల్పగలడా ?

దుర్గా—నేటినుండి మీరు నన్ను మీ సోదరునివలె నెంచుకొనుడు. నే నిదిగో ప్రమాణముసేయుచున్నాను. సుఖమునందుగాని దుఃఖమునందుగాని సమస్తవిషయములందును దుర్గాదాసు మీ కిష్టుడును దోడునీడయై యుండగలడు.

అక్బరు—ఆ విషయములో నా కేమియు సందేహము లేదు. రాజపుత్రవీరులారా! నేడు మీకొక క్రొత్తసంగతి నేను వినిపించుచున్నాను. మీరు దుర్గాదాసుయొక్క మహాత్మ్యమును గూర్చియు ఔదార్యమును గూర్చియు నొక సంగతి వినినయెడల మీ రానందితులును విస్మితులు నయ్యెదరు. ఒకనాటి రాత్రి చక్రవర్తి తన దూత నొకనిని ఫకీరువేషము వేయించి రహస్యముగా దుర్గాదాసుయొద్దకు పంపెను. దూతవచ్చి దుర్గాదాసుతో నిట్లు చెప్పెను,—'మీరు అక్బరు కిక ముందునుండి సహాయము సేయకుండినఁ జక్రవర్తిగారి కోరిక. అందుకొఱకు ఎనిమిదిలక్షల రూపాయ లాయన పంపించియున్నారు. ఇవిగో తీసుకొనుడు. దుర్గాదాసా మాటలువిని ఎనిమిది లక్షలరూపాయల సహితముగా దూతను నా దగ్గఱకు తీసుకొనివచ్చి యిట్లనెను,—'తండ్రిగారియొక్క ధనముమీద నధికారము కొడుకుకుండును. అక్బరూ! మీతండ్రిగారు నాయొద్ద కెనిమిదిలక్షల రూపాయలు పంపియుండిరి. వీనితో మీ కేమైన యవసరముండిన నుండవచ్చును. నాకవసరములేదు.' అటుపిమ్మట దుర్గాదాసు దూత

గూర్చుండఁబెట్టుదుము. ఏల మాటలాడవేమి? మొదలకుఁడవై నిలుచుండెద వేమి? ఢిల్లీసింహాసన మెక్కఁగనే అన్నిటికంటె ముందేమి సేయవలెనో యెఱుగుదువురా? ఎఱుఁగుదువనుకొనెదను. మీ రాయనెట్లు చేసియున్నాఁడో అలాగుననే మీరుకూడ చేయవలెను. మేము ఔరంగజేబును ఖైదుచేసి మీయెదుట హాజరుపెట్టెదము. అప్పుడు మీరు వానిని తీసుకొని వెళ్ళి చేతులును కాళ్ళును గట్టి యొక నిర్జన ప్రదేశములో ఖైదుచేయవలెనని యాజ్ఞాపించవలెను. ఔరంగజేబు తండ్రి షాజహాను నేడేండ్లు ఖైదులో నుంచినాఁడు. మీరు ఔరంగజేబును పదునాల్గేండ్లు ఖైదులో నుంచవలెను. అటుపిమ్మట గాడిదవలె ఆతనిని గాడిదపై వేయించవలెను. తరువాత షఁ గావలె మోకాజ ముక్కు ముక్కును చెవులును గోయించి పట్టణము నల్గువైపుల నూరేగింపవలెను.

దుర్గా—తమ యాజ్ఞ ఎట్లైన సరియే ఇప్పుడు మాత్రమందిరమునకు పోవుదము రండు. పోయి తరువాత వాడిపోయిన సేనలను సేనాపతులను వెదకి కూర్చుకొని యుద్ధయాత్రకుఁ బయలుదేరుదము.

దుర్గాదాసు అక్బరుయొద్దకు వచ్చి గ్రామ్యమైన మాటలతో నిట్లనెను,—'మీరు కాలాంతహాత యొక్క నవ్వులాటమాటల కాగ్రహింపకుడు. ఆయన కల్లకపటములు తెలియరు. కాని యాయన స్వభావ మందరెఱుఁగుదురు. కులాసామీరాజ సమయానుసారము లేరు గదా. మీ రిప్పుడు భార్యాబిడ్డలతో లూనీనది యొడ్డుననున్న నా పర్ణకుటీరమునం దుండవచ్చును. అక్కడ ఏకాంతముగ కాలము గడపవచ్చును.

---

౬

## వీరప్రదర్శనము

హిందూవీరులు కొండకోటనుండి బయలుదేరి ముసల్మాను శిబిరముపై నాక్రమింపఁబోవుచున్నారు. తోటయొక్క రక్షణభార మెవరికి సమర్పింపవలెను? దుర్గాదాసు శీఘ్రమే దక్షిణపువైపున కేగవలెను. కోటయం దెంతమందియో రాజవంశీయ రమణీమణులు దిగియున్నారు ఈ విపత్సమయమున నీ జవాబుదారీకార్యమును నిర్వహింప యోగ్యులెవ్వరు? దుర్గాదాసుని యుద్దేశమున హారమతి రాజుకుమారుడు విజయపాలు డీగౌరవపదమునకు యోగ్యుడు. కాని యిందుచే నితరరాజులు తమ కవమానమని యోచించుచుండిరి. విజయపాలుఁడు గొప్పవంశమువాడే. వీరత్వమునందును గొప్పవాడే. కాని యాతని నెవ్వరును గౌరవించరు. కారణమేమన వాడు గొప్ప సాహసికుఁడేగాని సహజముగ బుద్ధిశూన్యుఁడని చాలమంది యభిప్రాయము ఆయనకు పెద్దపని చిన్నపని యను భేదభావములేదు. దిట్టముగ నల్లమందుభాయిగాడు. ఎటువంటి కార్యమైనను చిన్న పెద్ద భేదము పెట్టుకొనకుండ మనస్ఫూర్తిగఁ జేయువాడు. చాలమంది యాతనిని మూర్ఖుడందురు. వానిని వేళాకోళము సేయుదురు. కొంతమంది వానిని పిచ్చివానినిచేసి యవమానింతురు. వాని పొడుగు లావు చూచి బొగ్గును ధిక్కరించు శరీరచ్ఛాయచూచి పెద్ద ముందుకు నాగిపోయిన పొట్టచూచి స్త్రీలాతనికి కాలాపహాడని (నల్ల కొండ) యని హాస్యపుపేరు పెట్టిరి. ఈ కారణమున నీ విషయములో దుర్గాదాసు నిశ్చయమున కేమియు రాలేక మహారాణి యరుంధతీ దేవితో నాలోచించుట కరిగెను. మహారాణితో నామె యన్ని

సంగతులను జెప్పెను. రాజకుమారి అంబాలికయు నప్పుడా మెయొద్ద కూర్చుండియుండెను. ఆమె యిట్లు వక్కాణించెను—'వీరులలో నెల్ల నధిక ప్రతాపవంతుం డెవరో ఆ వీరుడు మా రక్షణభారము వహింపవలెను.' కాని యా యుత్తమ ప్రతాపవంతుని నిర్ణయించు టెట్లు?

ఉదయమాయెను. కోట కరక్రోసు దూరముగ క్రిందనున్న నొకటి రెండవవైపున గుడారము వేసియుండెను. కోటకు మధ్యనున్న నొక కొండశిఖరముపై నెరజెండా యెగురుచుండెను. శిబిరముయొద్ద చాల మంది గుంపులుగూడి యుండిరి. అందఱును బెంగ్గ కొండకొనపై నెగురుచున్న జెండా నతురతతో జూచుచుండిరి. అందఱకంటె ముందు రాథోరు సేనాపతి దుర్గాదాసు నిలిచియుండెను. కొండపై నొక వీరభాగమున నిల్చి యనేకమంది స్త్రీలు కౌతూహలపూర్వకముగ శిబిరమువంకం జూచుచుండిరి. విజయపాలుడు గుఱ్ఱమెక్కి దుర్గాదాసుప్రక్కకువచ్చి నలుదెసలను జూచుచుండెను.

దుర్గాదాసు గొంతెత్తి గంభీరస్వరముతో బల్కెను,—'రాజస్థానమండలి రాజవంశసంభూత మహావీరులారా! ఆలకింపుడు,— మీరు లేని కాలమందు మేము మహారాణీ, రాజకుమారి మొదలైన రమణీమండలియొక్క సంరక్షణభారము విజయపాలుని కొసంగ సంకల్పించినారము. కాని యీ విషయములో కొంతమంది కాక్షేపణ యుండుటవలన మిమ్ము నీనాటి వీరప్రదర్శనమునకు బిలిపించవలసినది. కొండశిఖరముపై నదుగో ఎఱ్ఱజెండా యెగురుచున్నది. ఆ పతాకము నెవ్వరు విజయపాలునికంటె ముందు ముట్టుకొనిపోయెత్తం గలరో వారీనాటి వీరప్రదర్శనమున పరాక్రమవంతులుగా పరిగణింపం బడుదురు. అట్టివారు కుమార విజయపాలునితోగూడ కోటరక్షణ కెన్నుకొనంబడుదురు. మీ యందఱలోను కుమార విజయపాలునితో

పోటీపడగల వారు ముందుకు రండు ఇష్టమైనవారు గుఱ్ఱములపై నెక్కి ఈ వీరపురుషునితో సఱువెత్తి యెదుటనున్న శైలఖండమును దాటి, నదిని దాటి పిమ్మట వికటశైలమునెక్కి యా యెఱ్ఱజెండా నెత్తుడు."

కొందఱు శ్రీ విచిత్రవర్ణ కార్యములను వీరత్వముచూపు టెందుకని తమలో తాము సణుగుకొన నారంభించిరి. నిర్భయ విజయపాలునితో నీ కార్యమునందు పోటీపడు తెగువ కొందఱు విరమించుకొనిరి. ఒకవేళ ప్రయత్నించినచో యింత భయంకరమైన యెడల నందఱును నవ్వుదురేమో లేక స్త్రీలు చప్పట్లు కొట్టుదురేమో యని చాల మంది రాజపుత్రయువకులు విజయపాలునితో పోటీకి నిల్చుటకు సందేహించిరి.

దుర్గాదాసు కొంచెముసేపు నిరీక్షించి యెవ్వరును ముందుకు రాకుండుటను గాంచి నవ్వుచు నిట్లనెను,— 'రాజపుత్రస్థానములో రాజపుత్రవంశజులలో నెవ్వరును విజయపాలునితో సరిసమానముగ నిలువఁగలవారు లేరని తెలియవచ్చుచున్నది. కాని యీ వీరధాత్రి మార్వాడభూమియందు వీరత్వము కేవలము రాజప్రాసాదముల నాలుగుగోడలమధ్యనే లేదు. అందుచే నో యుచ్చవంశసంభూత రాజపుత్రవీరులారా! రాజసఖులారా! మఱియు నో రాజసేనాపతులారా! మీలో నెవ్వరైనను సమర్థులైన వారున్నయెడల ముందుకు రండు!"

దుర్గాదాసు రాజకర్మచారుల వైపునకును సేనాపతుల వైపునకును చాలసేపటివఱకు నిరీక్షించియుండెను. జనులందఱును మునుపటివలెనే నోరుమూటాడక నిశ్శబ్దముగ నిలిచియుండిరి. అంతట రాథోరు సేనాపతి అభిమానసంక్షోభములతో నావేశమునొందుచు గొంతెత్తి ఇట్లు పల్కెను,— మొదట నాకర్థమగుటలేదు. రాజపుత్రవీరత్వము వెల్లడియగుటయందు వెరచుచున్నదా! తరువాత

నాకింకను ఆశవీడలేదు. సమస్తసైనికభటులారా! ఆలకింపుడు సమావేశ మైన ప్రేక్షకులారా! యువవృద్ధ జనులారా! మఱియు నోయున్నత వంశసంభూతులారా! అతిహీనవంశసంజాతులారా! మీయందు రాజ పుత్రరక్తము ప్రవహించుచున్నయెడల [illegible]కు [illegible] — లేని యెడల నేటివీరప్రసిద్ధి యిచ్చటనే సమస్తమైపోవును కోట్ల కొలది వీరుల తల్లియగు మార్వాడ భూమి నేడు కేవల మొక్కవీరుని తల్లి మాత్రమే యగును. [illegible] చూడుడు... [illegible] మాతృమూర్తి [illegible] దేవి పీఠముపై రక్తపతాకము ప్రక్క నార్యావర్త[illegible] [illegible] లను జేత ధరించి నిలిచియున్నారు.'

దుర్గాదాసుని పై మాటలు సమాప్తము కాకముందే నాల్గువైపు లను గోలాహల ముత్పన్నమాయెను. కరతాళధ్వనులు చెలరేగెను. అందఱు నాశ్చర్యముతోఁ జూచుచుండిరి. శిబిరమున కావల ప్రక్క నుండి యొక్కతరుణవయస్కుఁడు నూనూగు మీసములతో మధుర మందస్మితవదనంబుతో పంచకల్యాణి గుఱ్ఱంబుపై నెక్కి దుర్గా దాసుని యెదుట కరుదెంచి యభివాదనంబు సలిపి విజయపాలుని ప్రక్క నిలువఁబడెను.

విజయపాలుఁడును జిరునవ్వుతో నాకృషీవల సైనికుని దెస నాపాద మస్తకమును దృష్టి నిగిడించి చూచి గుఱ్ఱమును సవారి వదలుమని సన్న చేసెను. ఇద్దఱును బయలుదేరిరి. ఈఅపరిచిత యువకుఁ డెవ్వరో విజయపాలుని యోడించి వేయునని ప్రేక్షకులు విస్మితులై చూచుచుండిరి. కృషీవల యువకుని గుఱ్ఱము మిట్టపల్లములను, సెలయేళ్లను దాటుటలో విజయపాలుని గుఱ్ఱము కంటె సునాయాస ముగాఁ బోవుచుండెను. ఇద్దఱి గుఱ్ఱములును గొంచె మెచ్చుతక్కు వగ నింతవఱకు సరిసమానముగనే పోవుచుండెను. కాని పతాక మున్నగుట్టయొద్దకు వచ్చునప్పటి కచ్చటనున్నది భయానకస్థానము.

అక్కడ వారు అలుపుదీర్చుకొనుట కొక్కింతతడవాగిరి. పైన యెగురు చున్న పతాకమును దానిచుట్టునున్న గట్టును వారొకసారి పరికింప విద్దఱకును మనసులోని యాశ నిరాశయైనది. ఒకరి మొగము లొకరు చూచుకొని తిరిగి గుఱ్ఱములను వదలిరి. కాని యొక్కింత దూర మేగగనే యతఁడు పైకిపోవుట దుర్లభమని తెలిసికొని యొక కిటికీకిల్లు వాలుకొని యుద్దేశించుచుండెను. ఎంత ముందుగా కేగినను, అతని వెనుకకు జరుపఁబోవుచున్నది మాహాత్మ్యముగాను. వేదికపై నున్న రమణీమణులు వారి యుద్ధమువీరుల దుర్దశఁగాంచి నవ్వుచుండిరి దుర్గాదాసు దూరమునుండి ఏమియో కేకవేయుచుండెను గాని వారికి వినఁబడుటలేదు. కృషీవలయువకున కేమియుఁ దోఁచుటలేదు. ఈయుద్యోగము వ్యర్థమని త్రోసిపుచ్చి వెనుకకు తిరుగుట మర్యాద కాదు. ఇట్టి సమయమున నకస్మాత్తుగా కోటపైనుండి యొక్క గులాబి పువ్వువచ్చి యాతని వక్షస్థలమునఁ బడెను. కృషీవలుఁడు కన్నెత్తి చూచెను—సుందరమగు వేదికపై నొక మూల విలాసకుమారి నిలిచి యుండి నెమ్మదిగా పైటచెంగు కప్పుకొని నవ్వుచు కొండ కొక వైపునకు సంజ్ఞ సేయుచుండెను. ఆ సంజ్ఞనుగ్రహించి కృషీవల యువకుఁడు కొండ యుత్తరదిశకుపోయి చూచెను అచ్చటి మార్గము కొండపై కెక్కుటకు ఎక్కువవీలుగా నుండెను. మనసులో విలాస కుమారికి కృతజ్ఞతావందనము లర్పించుచు నతిత్వరితముగ పతాకముదగ్గఱ కరిగెను. ఇచ్చట విజయపాలుఁడా సంగతి నెఱుంగక కృషీవలయువకుఁడు హతాశుఁడై వెనుకకు తిరిగిపోయెనని తలంచు చుండెను. కాని యొక్కమారుగ నాల్గువైపులనుండి కోలాహల మాదుర్భవ మయ్యెను. అదివిని యాతఁడు కన్నులెత్తి పైకి చూచెను. కృషీవలయువకుఁడు జెండాప్రక్క నిలువఁబడియుండెను. ఇం కేమున్నది! పరాభవము! క్రోధాభిమానములు పట్టలేక విజయపాలుఁడు

గుఱ్ఱమును చబుకుతో గొట్టి కొండ యెక్కనారంభించెను. మరల నాల్గువైపులనుండి కోలాహలము సాగెను. దానితో పాటు పైనుండి కృషీవల సైనికులును కేక వేసి,—'ఇదుగో నారాజు. పతాకము నాచే జిక్కెను' అని చెప్పెను.

విజయపాలుని గుఱ్ఱము కొండచరియనుండి జారి ఒక్క విసురున క్రిందఁబడెను. ఒడ్డూపొడుగూ గలిగి 'కాలాపహాడు' ప్రాణములు నిలుపుకొనుటకు గట్టిగా నొక గండశిలను బట్టుకొనెను. నాల్గు వైపులను కేకలును నవ్వులును కరతాళధ్వనులును చెలరేగెను

## ౭

### జయమాల

రక్తపతాకమును జేపట్టి ప్రసన్నవదనముతో కృషీవల సైనికుఁడు నారీమణుల యెదుట నిలుచుండి యుండెను. నాయికయు అంబాలిక చేతియందు జయమాలయుండెను. మహారాణికి ప్రణామము లాచరించి మోకాళ్ళపై కొరగి చేతులు జోడించుకొని యత్యంత భక్తితో కృషీవల యువకుఁడొకఁడు నృపమయకిశోరమూర్తి వంక— తనచిన్ననాఁడు హృదయమందిరమునఁ ప్రతిష్ఠించిన దేవీమూర్తి వంక కన్నులెత్తి చూచెను. అంబాలిక నారీజనమధ్యమునుండి కొంచెము ముందుకువచ్చి నిశ్చేష్టురాలై పోయెను. ఆమెహృదయమున ఆనందమును ఆశయు సంశయమును ఒకదానితో నొకటి గొట్టుకొనుచు గందరగోళము సేయుచుండెను. శరీరము వణఁక నారంభించెను. జయమాల నిష్టము వచ్చినట్లు వేయుటకు మహారాణి యామెకు తిరిగి సన్న చేసెను. అంబాలిక కృషీవలుని దగ్గఱ కరిగి కంఠమునందు వేయవలెనని జయమాలను బైకెత్తెను. కాని యాసమయమున ప్రే

క్షకుల మధ్యనుండి యొక్క గొప్ప కేక వినఁబడెను,—‘ రాజకుమారీ ! ఆగు, ఆగు !’’ జైసల్మీరు రాజకుమారుఁడు కేసరిసింహుఁడు జనసమూహమునుండి ముందుకు వచ్చి చెప్ప నారంభించెను,—‘ రాజస్థానపు రాజవంశీయ వీరులారా ! రాజవంశీయ రమణీరత్నములారా ! మనమీనాటి రాష్ట్రవిప్లవములో మన స్వాతంత్ర్యమును గోల్పోవుటయే గాక దానితోఁ బాటు మనక్షత్రియుల యమూల్యధనంబగు జాతీయగౌరవంబును సహితము గోల్పోవుచుంటిమి. అందుచేతనే మన రాజరమణీమణుల నందఱు రక్షణార్థమై కులశీలములు లేనట్టియు నీచవంశోద్భవుండైనట్టియు నొక యువకుని నియోగింప సంసిద్ధులమైతిమి ! అందుచేతనే రాజాధిరాజగు జయసింహవల్లభుని కుమార్తెచే నొక దరిద్ర కృషీవల యువకుని జయమాల నిప్పించు మహోత్సవమును గాంచుట కిక్కడ కూడు కొంటిమి !

విజయపాలుడును కొంచెము ముందు కరుదెంచి రాజకుమారి దెసఁగాంచి నవ్వుచు నిట్లనియె,—‘ జయపూరు రాజకన్యకామణి యొకవేళ కృషీవల యువకుని కంఠమందు జయమాల వేయఁదలచు కొని యుండవచ్చును. కాని ఈవిషయమున నారీమండలి పక్షము నుండి యేయాక్షేపణయు లేక పోయినను ఉత్తమవంశీయులగు సమస్త రాజపుత్రులకు మాత్రము తప్పక యాక్షేపణయుండఁగలదు.’

ఈమాటలు విని క్రోధలజ్జాభిమానములతో రాజకుమారి పెదవుల కంపింప కన్నులనీరు నించుచుండెను. ఆమె మహారాణి వంకఁ దిరిగి గర్వముతో కన్నులెత్తి చూచెను. ప్రేక్షకులలోనుండి యెవ్వరో తెలియ, దిట్లని కేక వేసిరి,—‘ రాజమహిషీ ! రాజకుమారి నోదార్పుము ’

మహారాణి యరుంధతీ దేవి యేమిసేయుటకును దోచక యొక్కసారి ప్రేక్షకులవంకఁ జూచి యంబాలికను వెనుకకు తిరిగి రమ్మని సం

జ్ఞచేసెను. అంత రాజకుమారి మనోధైర్యము సడలిపోయెను. ఏమియో మాటలాడవలెనని తలయెత్తి నలువైపులఁజూచెను. అప్పటికిని కృషీవలయువకుఁడామె చరణతలమున భూమిపై మోకాళ్ళపై కూరగి చేతులు జోడించుకొని పైకి కన్నులెత్తి పారితోషికమును బడయుట కొఱకు చూచుచుండెను భక్తుఁడు పవిత్రమంత్రమున దేవీ ప్రతిమను ప్రాణప్రతిష్ఠఁగావించి చేతులు జోడించి ప్రార్థించుచున్నట్లా యువకుఁడు గాన్పించుచుండెను.

రాజకుమారి మఱియొక్కసారి కృషీవలయువకుని దీననిరాశనయనంబులతో కరుణాకటాక్షవిక్షేపంబు గావించెను. పిమ్మట మరల క్రోధాభిమానములు బైకొన నలువైపులకు దృష్టి నిగిడించి చూచి తనచేతిలోని పూలహారాలను ముక్కలుముక్కలుచేసి విసరి పాఱవైచి యచ్చట నిలువక వెంటనే కోటలోని యొక గదిలోనికి తొందరగా తొందరగా వెడలిపోయెను

విజయపాలుఁడు బిగ్గరగా నవ్వుచు జైసల్మీరు రాజకుమారుని సంబోధించి యిట్లనియెను,—"రాజకుమారసాహెబు! మీకిప్పుడర్థమైనదా? నారీజనము యొక్క మాటలలో దీనినే ప్రేమయని యందురు"

## ౨

### స్వర్గములో పిశాచము

కట్టకడపటకు కోట రక్షణభారము విజయపాలునకే సమర్పింపఁబడినది. కృషీవలు డితరసైనికుల వలెనే యాయనకు సహాయము సేయుచుండెను. ఇందు కృషీవలుఁ డసమ్మతిఁ జూపలేదు. అంతేకాదు అవమానమని కూడ తలంచలేదు. ఏలయన నాతనికి తెలియును. దుర్గాదాసును అరుంధతీదేవియుఁ దప్ప తాను మహారాణా జయసింహుని

పుత్రుడనియు భావి మేవాడ రాజ్యాధీశ్వరుడనియు నెవ్వరెరుంగరు. ఇట్టి మారువేషమున తన కాగారవసియైనదని రానేరదని యాతఁడు మొట్టమొదటినుండియు నెఱుఁగును.

మరునాఁడు సైన్యములు యుద్ధయాత్రకొఱకు సమకూడుచున్నవి. కోటనుండి బయలువెడలు నపుడు దుర్గాదాసు కూడిన సైన్యములను బరీక్షించునపుడు ఎల్లరు వచ్చియుండిరిగాని కేవల మొక్క జైసల్మీరు రాజకుమారుఁడు కేసరిసింహుఁడు గన్పడలేదు.

కేసరిసింహుఁడప్పు డొంటరిగ తన గదియందు కూర్చుండి చింతాసముద్రమున మునిఁగియుండెను. దుర్గాదాసు తనను బిల్చుచున్నాఁడని వినినంతనే యాతఁడు తన చింతాసముద్రమునుండి బయటకు వచ్చి మెల్లమెల్లగా నంతిపురమునకు దారి పట్టెను. అచ్చటం బాలిక యున్న బంగారు కుటీరమునకుఁ జేరి ద్వారముయొద్ద యొక్కింతసేపు యోచనసేయుచు నిలిచెను. అట్టియెడ నాతనిరాక నెరింగి లోపల నుండి యొకదాసి బయటకు వచ్చెను. కేసరిసింహుఁడంత నాదాసితో 'అంబర రాజకుమారి యెచ్చటున్నది' యని అడిగెను

దాసి వ్రేలితో లోపల చూపించెను. 'ఆమె ఏమిచేయుచున్న' దని యాతఁడు తిరిగి ప్రశ్నించెను.

దాసి,—'మీరే పోయి యామె నడుగవచ్చును' అని ప్రత్యుత్తరమిచ్చెను.

రాజకుమారుఁడు లోనికిపోయి చూడ నామె యొక్కతయే నేలఁ గూర్చుండి యొక సగమురచించిన చిత్రపటమును బూర్తిసేయుచుండెను. ఆయన గదియందు ప్రవేశించుట నామె గుర్తింపలేదు. ఆతని కాలిజాడల చప్పుడు నైన నామె గమనింపక పటమునందే తనదృష్టి నంతయు నుంచి దిద్దుచుండెను.

కేసరిసింహుఁడు తొందరపాటుచే కంఠము గద్గదికవడ బిగ్గరగా,

'రాజకుమారీ!' అని కేకవేసెను.

రాజకుమారి యులికిపడి చిత్రపటమును భూమిమీఁది పైకెత్తియా తని వంకఁజూచెను. యువరాజు 'రాజనందనీ! ఏమింత యేకాగ్రచిత్తముతో చిత్రపటమును లిఖించుచున్నా వెవ్వరిది?' అని అడిగెను.

రాజకుమారి లేచిమెల్లమెల్లగ,—'కుమారులిచ్చటి కెందుకు వచ్చితి' రని తిరిగి ప్రశ్నించెను.

యువరాజు మరల ప్రశ్నించెను,—'రాజకుమారీ! యెవ్వరిచిత్రపటమును రచించుచుంటివి? ఆ కిశోరంబో? కృష్ణశైల కృషీవలు పైని కుని చిత్రపటముకాదు గదా?'

ఈ మాటవిని రాజకుమారి కొంచె మస్థిరయైపోయెను. కన్నులు పెద్దవిచేసి యామె యువరాజువంకఁ జూచుచు నిట్లు జవాబుచెప్పెను. మీ యనుమానము పూర్తిగ నిజము. ఇది కృషీవలకుమారుని చిత్రపటమే. నేను చిరకాలమునుండి ఈ కృషీవలునియొక్క చిత్రపటమును లిఖింపవలెనని ప్రయత్నము సేయుచున్నాను.

యువరాజు—ఛీఛీ. రాజనందనీ! ఈ చిత్రపటమును ముక్కలు చేసి పాఱవేయుము.

రాజకుమారి పండ్లతోఁ నాల్కను గొఱికికొనుచు చిత్రపటమును రొమ్మునకద్దుకొని గద్గదస్వరముతో నిట్లనెను—'ప్రియమైన వస్తువు నెవ్వరైన వక్షమున దాచుకొందురుగాని పాఱవేయుదురా!'

యువ—అటులైన నా సందేహము స్పష్టమైనది. లోకులు నీమీఁద నారోపించిన కళంకముకూడ సత్యమన్నమాట.

రాజకుమారి—రాజకుమారా! లోకులు నామీఁద నేమి కళంక మాపాదించిరి?

యువరాజు—లోకులిట్లు చెప్పుచున్నారు అంబరి రాజకుమారి యొక్క కృషీవలయువకునిఁజూచి మోహించినదట—

రాజకుమారి—యువరాజా! వీరపురుషుల వీరత్వమును జూచి మోహించుట క్షత్రియనారీమణుల ధర్మము. ఇదినాయెడ కళంక మెట్లగును? గౌరవమే యగును. ఇప్పుడు నాకర్థమైనది. నిన్న నా కృషీవలయువకునికి నేను జయమాలను పారితోషికముగ నిచ్చినసమయమున మీరు గన్యాయముగ నన్నవమానపరచితిరి. మరల నింకొకసారి అట్లే యవమానముసేయఁ దిరిగి వచ్చితిరి.

రాజకుమారి కన్నులనీరుఁ గార్చుచు నభిమానముచేఁ దడఁబడుచు నచ్చటనుండి వెడలిపోవుటకు ప్రయత్నము చేసెను. కాని కేసరి సింహుఁ డామెకడ్డమేగి—'రాజకుమారీ! ఆలకింపుము. నే నిప్పుడు నీతోఁ జెప్పవచ్చిన మాటలీవఱకెన్నఁడును నానోటినుండి వెడలలేదు.' అని పలికెను.

పిమ్మట నొక్క క్షణమాగి మరల నాతఁడు చెప్పసాగెను—'బహుశః నీకు జ్ఞాపకముండవచ్చును. నిన్ను నాకిచ్చి వివాహము సేయవలెనని రాజమహిషి కెన్నిదినములనుండియో యున్నది. నేను నిన్నుఁ జూడనంతవఱకు ఆప్రస్తావముమీద సమ్మతిపడలేదు. కాని నే నీ కోటకువచ్చి నీ దివ్యలావణ్యసుధాలహరి నాస్వాదించిన నాటి నుండి నాతమకంబు పెరుగుచున్నది. నేను రాజమహిషితో నాసమ్మతినిఁ దెల్పితిని. కాని నీవు నన్ను నిరాకరించినటుల నాకు పిమ్మట తెలియవచ్చినది.

రాజకుమారి—యువరాజా! వ్యర్థవచనములతో నేమి ప్రయోజనము? మీరు మహారాణితో పలుమారు చెప్పియుండిరి. నేనును ఆమెతో ననేకసార్లు చేతులుమోడ్చి 'నాకు మీతో వివాహమిష్టము లేదని' విన్నవించుకొంటిని.

యువరాజు—రాజనందినీ, ఆలకింపుము. నేను నీతో కడసారి చెప్పుటకు వచ్చియుంటిని. ఈజీవితములో పాతికేండ్ల ప్రాయము

వఱకు శత్రువులతో యుద్ధము సేయుటతప్ప యింకొక విచారమును హృదయమున నెఱుఁగను. కాని నిన్ను చూచినప్పటినుండియు నా మనసు పిచ్చెత్తిపోయినది. అదిగో చూడు,—కోహ్రక్కి క్షత్రియ వీరులు యవనయుద్ధయాత్రయం దుత్సుకులై నాకొఱకు కనిపెట్టుకొని యున్నారు. ఇట్టియెడ నొక్కసారి పల్కుము అంబాలికా! నీవు నా దాన వయ్యెదవా? నీ మాట వినిన నా కొఱకు సంసిద్ధులైన వీరుల వెంటఁబోయి యవనుల నురుమాడెదను. లేనియెడ ఇప్పటికైన నీకు దయ రానియెడ నా హృదయమునుండి నాపై యాశ నూడఁబెఱికి పాఱవేసి వీరధర్మమునకు శాశ్వతముగా సెలవిప్పించి పాఱవేసె దను. అంతేకాక—అని చెప్పఁబోవుచు యువరాజు మాట యాపి భూమివంకఁ జూచుచుండెను.

అంబాలిక అభిమానపూర్వకముగ,—'అంతేకాక యేమిటి?' అని ప్రశ్నించెను.

యువరాజు ఇట్లు ప్రత్యుత్తరమిచ్చెను.—'అంతేకాక చెప్పమందువా? ఒక పైశాచిక ప్రతిజ్ఞ పట్టఁబోవుచున్నాను వినెదవా? చెప్పుటకు నాలుక యాడకున్నది. నాకు పిచ్చి యెక్కినది. పిచ్చివానికి లజ్జెక్కడిది? ఉన్మాదునికి ఆత్మాభిమానమేమి? కంచి వీను రాజనందినీ! నా ప్రతిజ్ఞయేమో విను. నేటి కొక్క సంవత్సరములో నిన్ను యవనపిశాచముల యొడిలో బాఱవేసెదను. ఈ సువర్ణపారిజాతమును నందనవనమునుండి పీకి నరలోకమునఁ బాఱవేసెదను.'

ఈ మాటలు పల్కునపుడు యువరాజు కేసరిసింహునకు తన సుందరవీర మూర్తిత్వమును గోలుపోయి కాలసర్పమూర్తిత్వమును గైకొనిన శంబరరాజకుమారి కాశ్చర్య మింతకంటె యెక్కువ కల్గునా? ఆమె యొక్కంతతడవు నిర్ఘాంతపోయి కేసరిసింహుని ముఖమండలమును ద దేకదృష్టితోఁ జూచి యిట్లనియె,—'ఇది కేవలము

నొక్కసారి తన చిన్న కుమారుని అజితసింహునిఁ జూడవలెనని కోరిక తెలియఁజేసినది. అందుచే నేను కొన్ని దినముల క్రింద రహస్యముగ వాసి నిచ్చుటకు రప్పించితిని—అరుంధతీ దేవి నాగృహము నకు దయచేసి సందువలన నాగృహము పావనమైనది. ఆమె తిరిగి వెంటనే వెడలిపోఁగలదు—అంత మనము అయిదువందల విశ్వాస పాత్రులగు ననుచరులను వెంటఁదీసుకొని దక్షిణదిశకరుగుదము. పరమేశ్వరుని దయయున్న మనము తిరిగి త్వరితముగ రాఁగలము. అదుగో చూడు, శంశేరాలీ మీకుమార్తె చాందుబీబీని అజితసింహుని ఎత్తుకొని యిట్లు వచ్చుచున్నాడు.

శంశేరుఆలీ రెండు చేతులలోను అరవిరిసిన కమల కళికలఁ బోలు నిద్దఱు శిశువులను జేతులు బట్టుకొని యచ్చటకు వచ్చి నిలువఁబడెను. ఇందొక డేడు వత్సరముల బాలకుఁడు మహారాణి అరుంధతీ దేవి కుమారుఁడు. మఱియొకరు తొమ్మిది వత్సరముల బాలిక అక్బరు కుమరిత

అజితసింహుఁడు శంశేరాలీ ముఖము వంకఁ జూచి యడిగెను,— 'కాకా? నువ్వు చెప్పావే ఈరోజు మనము రాఖీబాంధవుల మవుతామని! ఎక్కడ కాకా! రాఖీబాంధి కాలేదేం?'

దుర్గా—రాఖీబాంధికే నిన్నును చాందుబీబీని ఇచ్చటకు పిలిపించినది.

చాందుబీబీ అక్బరు తొడమీదఁ గూర్చుండి సాదరముగ నాతని పెగవిని పట్టుకొని ఇట్లు పలికెను—బాబా! ఈరోజు నీవింత విచారంగా వున్నావేం? నీఒంటో ఏలాగుంది?

అక్బరు—ఏమీ లేదమ్మా! నాఒంట్లో చాలా బాగానే ఉందమ్మా.

చాందు—మనం ఢిల్లీ యెప్పు డెడదాం?

అక్బరు—మీ కాకాయ నడుగు. మనం డిల్లీ యెప్పు డెడతామో యతనికి తెలుసు.

చాందుబీబీ అక్బరు ఒడినుండి లేచి స్నేహపూర్వకముగ దుర్గా దాసు మెడను కౌగలించుకొని,—'చెప్పవూ, కాకా' అనెను.

దుర్గాదాసు మధురవాక్కులతో ప్రేమ పూర్వకముగ నిట్లనెను,—'ఎందుకమ్మా! నేడు డిల్లీకి పోవాలని నీకింత మనసైంది? నీకిక్కడేమైన కష్టంగా వుందా?'

బాలిక—'లేదు కాకా! ఇక్కడ నాకేమీ కష్టం లేదు. ఇక్కడున్న సుఖం నాకు ఢిల్లీలో కూడ లేదు. ఇక్కడ మాదొడ్డమ్మ మాఅమ్మకంటెః గూడ నామీద దయగా వుంటుంది. ఇంతేకాక ఇప్పుడు—''

చాందుబీబీ అజితుని చేయి పట్టుకొని చెప్పసాగెను,—'మాముద్దు తమ్ముడు నాదగ్గఱ కొచ్చాడు. ఇందుచేత కూడ నాకేంకష్టంలేదు.'

దుర్గా—బిడ్డా! అటులైన ఢిల్లీ వెళ్ళాలని యడిగావెందుకు?

'చాందుబీబీ కొంచె మాలోచించి యిట్లు పలికెను,—'కాకా! నాకదుపులో మాట చెప్పరా? ఈరోజు మాఅమ్మ చెప్పింద, నాయనగారట తాతగారి మీద కోపగించి యిక్కడకు వచ్చారట. కాకా! నాన్నగా రెందు కల్లాచేశారు? మాతాత ఎంత మంచివాడో బహుశా మానాన్న ఎరుగ డనుకుంటాను. మాతాతకే నామీ దెంతో ప్రేమ. నేనే మడిగితే అది ఇచ్చేవాడు. అందుచేత నాన్నగారిని తాతగారి దగ్గఱకు తీసుకొని పోయి స్నేహం కలిపేస్తాను. తరువాత కావలిస్తే నాన్నగారితో కలిసి తిరిగి రావచ్చు.'

చోళబాలయొక్క వెడగుమాటలువిని దుర్గాదాసును అక్బరును నవ్వుకొనసాగిరి. బాలిక మరల మాటలాడసాగెను,—'ఇంకొక మాట! బాగా జ్ఞాపకం వచ్చింది. తమ్ముడు అజితునాతో చెప్పాడు,

నేను తనను తాతగారిదగ్గఱకు తీసుకొని వెళ్ళితేటా ఆయనట చంపేసే స్తాట్ట! అంతేనా తమ్ముడూ నీవన్నది? నీవీమాట నాతో చెప్పలే?”

అజితు—నేను నీతో అబద్ధ మాడొచ్చాననుకున్నావా ఏంటి? నామాట అబద్ధమైతే ఇంకా మా భయ్యానడుగు కావలిస్తే.

చాందు—కాకా విను! ఇదెప్పుడైనా జరుగుతుందా? నేను తమ్ముణ్ణికూడా తీసుకొని తాతగారిదగ్గఱకు వెళ్ళితే ఆయన ఒళ్లో కూర్చోపెట్టుకొని ఏమన్నా పెటతాడా లేక చంపేస్తాడా? ఈ ముద్దు మొగంమీాద ముద్దెట్టుకుంటాడా కొడతాడా! ఛీ ఛీ అజితు ఎప్పుడిట్లాంటిమాట లనకోయి.

అజితు—చాందుబీబీ, నీకేం తెలియదుగాని ఊరుకో—’

చాందు—ఇదేమి టజితూ! నీవు నన్ను మళ్ళీ పేరెట్టి పిలుస్తున్నావు? నీకు జ్ఞాపకంలేదూ నేనేం చెప్పానూ? నేను నీకంటె రెండేండ్లుపెద్ద నన్ను అక్కా అని పిలువమని చెప్పలే?

అజిత్—మఱచిపోయాను అక్కయ్యా?

చాందుబీబీ—ఏమిటో చెపుతున్నావు చెప్పు.

అజిత్—నేను చెప్పేదేమంటే, అక్కయ్యా! నీకేం తెలియదుగాని ఊరుకోమని నేను విన్నదేమంటె, మీ తాత అలంగీరు బాదుశాహ నన్ను శత్రువుగా చూస్తాడు. భయ్యానడుగు తెలుస్తుంది కావలిస్తే.

చాందు—మంచిది, అట్టాగే అనుకుందాము. కాని మా తాత చచ్చిపోతాడనుకో, అప్పుడుకూడా నీవు నాతమ్ముడవైతే నిన్ను శత్రువనుకుంటాడా? తమ్ముడూ నేను చెప్పేదేమంటే, నీ వొక్కసారి నాతో ఢిల్లీరా నేను మా తాతతో అన్నీ చెపుతాను. నీవు నాతమ్ముడవు. నామీాద చాలదయగా వుంటావు. నిన్నేమీ అనొద్దంటాను. నీ కప్పుడు తెలుస్తుంది. మా తాత నన్ను చూచినట్టు

గానే నిన్నూ చూస్తాడు. నీకేం భయంలేదు. మా తాత మంచి వాడు!

అజితు—ఆయన నీమాట వినకపోతే ఏంచేస్తావు?

చాందు—ఆ! ఎందుకువినడు? వినకపోతేనా? తాతగడ్డం పట్టుకొనిలాగి ముక్కుమీద ఒక్క గుద్దుచ్చుకుంటా. నే నెప్పుడైనా దేనికోసమైనా పట్టుపట్టానా అప్పుడు తాతచేసితీరతాడు. మాఅమ్మ ఒకనాడే మాతాతనడిగి కోహినూరు పట్టుకురమ్మన్నది. నేనువెళ్ళి ఆయనవొళ్ళోకూర్చుని, 'తాతా! మీకోహినూరుమణి నొక్కసారి ఇయ్యరూ? అన్నా. అంటేను ఆయన నన్నన్నాడూ,— 'ఇదేమిటమ్మా బీబీ! కోహినూరు ఎవరైనా ఎవరికైనా ఇస్తారా?' నేనన్నానూ, 'కోహినూరు ఇయ్యకపోతే నీగడ్డ మూడలాగుతా చూచుకో' అంటేనూ తాతే,—మంచిదిబీబీ! రేపు నీకిస్తానుగాని నాగడ్డ మికనెప్పుడూ ముట్టుకోడానికి వీలులేదు.' నా కప్పుడిస్తేనా అప్పుడే అమ్మపెట్టెలోదాచేసేదాన్ని. కాని మానాన్న నన్నిక్కడికి తీసుకొచ్చేసాడు.

అజితు—మాభయ్యాచెపితే నేనునీతో చక్రవర్తిదగ్గఱకువస్తాను. కాని ఆయన నన్ను శత్రువుగాచూస్తే నేనూ ఆయన నల్లాగే చూస్తాను.

దుర్గా—ఆ సంగతులన్ని తరువాత ఆలోచిస్తాంగాని మిమ్ముల నెందుకు పిలిపించామో చెప్పమన్నారా!

చాందు—ఎందుకు పిలిపించారు కాకా!

దుర్గా—ఈరోజు మీరిద్దఱూ అక్కా తమ్ముడూ ఒకరికొకరు చేతులకు రాఖీబంధనము చేసుకోవాలి.

అజితుకును చాందు బీబీకిని చేతి కొక్కొక రాఖీనిచ్చి దుర్గాదాసు,—'అజిత్! మీఅక్క చాందు బీబీ చేతికి కట్టు' అనెను.

అజితు నవ్వుచూ చాందుబీబీయొక్క చేతికి రాఖీని కట్టెను.

దుర్గాదాసు,—'చాందు బీబీ! నివుకూడ తమ్మునిచేతికి రాఖిని కట్టుము.' అనెను.

చాందుబీబీ అజితు చేతిని తన చేతితో పట్టుకొని ముద్దాడి 'నాముద్దుతమ్ముడా! రావోయి. నీ కరకమలమునకు రాఖిని గట్టెదను.' అని పల్కెను.

అది అయినతరువాత చాందుబీబీ దుర్గాదాసుతో నిట్లడిగెను,—'కాకా రాఖీ కట్టుకుంటే ఏం లాభము?'

దుర్గా—సోదరీసోదరుల ప్రేమకంటె నీ లోకములో నధిక మింకే మున్నది? అందుచేతనే బిడ్డా! అనేక దినములనుండి రాఖీబంధనము యొక్క యాచార మీ హిందూదేశములో నున్నది నేటినుండి మీ రిద్దఱును సోదరీసోదరుల పవిత్రస్నేహముతో వర్తిలుదురు. ఈనాడు శుభదినము! అజితు తమ్ముడు, చాందుబీబీ అక్క. మీరిద్దఱును ఒకరికొకరు రాఖిని గట్టుకొన్నారు. ఇక నీ నరకంకాళమయ భారతశ్మశానముమీద భాగీరథీప్రేమధార ప్రవహించునుగాక! కృష్ణ సుభద్రల ప్రేమ మరల నవతరించునుగాక!

చాందు—'కాకా! నాయనా మీరును అన్నదమ్ములేగా. మీ రెందుకు రాఖీ కట్టుకోలేదు?'

దుర్గా—తప్పకుండా కట్టుకుంటామమ్మా. రా తమ్ముడు అక్బరు! శంషేరాలీ నీవుకూడా రా, మన మందఱము రాఖీకట్టుకుందాము.

దుర్గాదాసును అక్బరును శంషేరాలియు చాల ప్రేమతో నొండొరులకు రాఖిని కట్టుకొనిరి. పిమ్మట దుర్గాదాసు,—'ఇప్పుడు మేము ముప్వురమును గలిసి మూడులోకములు జయింపఁ గలము.'' అనెను.

చాందు—'కాకా! నా కింకా రెండు రాఖిలియ్యి- అమ్మ కొకటీను దొడ్డమ్మ కొకటీను కడతాను.''

గుర్గాందాను నవ్వుచు చాందుబీబీ చేతికి మతిరెండు రాఖీలిచ్చెను. ఆ రెండు రాఖీలను చేతఁబట్టుకొని చాందుబీబీ అజితుభుజము మీద చేయివేసి యంతఃపురమున కేగెను.

## ౧౦

### దే శ ౦ హి ష్కా ర ము

గొండకోటయం దంతఃపురమున నొకగదిలో నొక యేడేండ్లబాలిక తాళము వేయుచు నొక పాటపాడ నారంభించెను—

కులవర్గములను దలఁపగ నేలా?
ధనహీనకృషీవలు డనుటేలా?

దాని చుట్టును నిలిచియున్న కొంతమంది స్త్రీ లాగీతమునువిని నవ్వుకొనుచుండిరి. ఒక్కతె ఉలికి గత్తిపోయి చేతితో బాలిక నోరు మూసి 'పిచ్చిపిల్లా! అంబాలిక వింటుంది కొంపతీసి''

అంబాలిక గదిప్రక్కనిలిచి వినుచున్నదని యా స్త్రీ లెరుఁగరు. ఆమె విలాసకుమారితోఁ గలిసి యిచ్చటికే వచ్చుచున్నది. ఈ సమయములో గీతమువిని యామెతో నిట్లనియెను,—'నీకు నమ్మకము లేక పోయిన, సఖీ యీ పాటవిను;—ఈ పాట నా మీదనే కట్టినారు. ఇక్కడ నిలుచఁబడి కొంచెమువిను; చూడు నా సంగతి ఎంతమంది ఎత్తుకొని హాస్యము చేయుచున్నారో. మహారాణీగారు నాడు కృషీవలునికి దండ వేయుమన్నప్పటినుండియు నందఱును నా మాట యెత్తుకొని యెల్లరి సేయుచున్నారు. ఎగతాళై పోయింది బ్రతుకు!''

విలాసకుమారి—నీ కీమాటలను లక్ష్యముచేయు నవసర మేమి? వెళ్ళుదమురమ్మ, పద.

అంబాలిక—అట్లు కాదు, నన్ను చంపుకొన్న ట్టేసరి ! కొంచెమాగి వినవలెను. అక్కడింకను ఏమి మాటలువచ్చునో.

చివాట్లు తిని బాలిక యూరకున్నది. కాని యిప్పుడు ఆడువాండ్ర గోల ప్రారంభమైనది.

ఒక స్త్రీ—చూశావా, అక్కా! పల్లకొంటట్టె నోరుమూయఁగలిగాము—పెద్దవాళ్లైతే నోరు మూసేవాళ్లెవరు? మూయించుకునే వాళ్లెవరు!

మఱియొక స్త్రీ—ఔనమ్మా! నీ వన్నమాట నిజమే—మాటవీధి కెక్కింది. కాని నాపగల వారెవరు?

మరియొక యామె నవ్వుకొనుచు అడుగుచున్నది.—

"ఎవరిమాటనమ్మా సఖి! నా చెవి కింకాపడలేదు. కాస్త చెప్పుదమ్మా!

నాల్గవ స్త్రీ—ఇంకా ఎవరిమాటుంది. మన అంబాలిక మాటే.

మూడవయామె—ఎవరితో నేమిటి?

మొ-స్త్రీ—ఎవరున్నారు? ఆ చక్కని నాపూ చక్కని నాపూ వాడే. కృషీవలుడు కులం తక్కువాడే. ఆ మాటలకు స్త్రీలందఱును కిలకిల నవ్వసాగిరి.

అంబాలిక యామాటలువిని కన్నుల నీరుగార్చుచు విలాసకుమారి వంకఁ జూచి యిట్లనెను,—'విన్నావా సఖీ! ఎట్లాంటి మాటలనుచున్నారో. నే చెప్పినమాటలు నిజమేనా ఇప్పుడు?

అట్లు పలికి యామె విలాసకుమారిని చేయిపట్టుకొని ప్రక్కనున్న యొక యేకాంతగృహమునకు తీసుకొనివెళ్ళి ఇట్లనెను,—'చెలీ! ఇక్కడొక్కక్షణము కూర్చుండుము. నీతో నా దొక్క ప్రార్థనయున్నది.?

విలాస—కోపమేమైన వచ్చినదా?

అంబా—అటువంటి మాటలంటే కోపంరాదా?

విలాస——(నవ్వుచు) చెలీ, ప్రేమకొఱకు కెన్ని పాట్లైనా సహించు కోవలెను.

అంబా——(కండ్లనీళ్ళు పెట్టుకొనుచు) సఖీ, నీవు కూడ నన్ను ఎగతాళి సేయుచుంటివా! నా భాగ్యమిట్లున్నది! ఇప్పు డొకసంగతి చెప్పెదవినుము. నీతో తప్ప ఇంకెవ్వరికిని చెప్పను. నీతో నేను గలిసికొన్నప్పటి నుండియు నీవు నన్ను చెల్లెలిగాఁ బ్రేమించుచుంటివి. అందుచే నీ కొక్క ప్రార్థన సేయుచున్నాను. నీవు నే డొక్కసారి కృపీవల యువకునిఁ గలిసికొని యాతనితో నిట్లు చెప్పు,——'నీ నుండి యంబరరాజకుమారి యొక్క భిక్ష యడుగుచున్నది. అది యేమన నీ వీకోటను వదలి మఱియొకచోటికి కరుగుము. మఱియు——"

అట్లు చెప్పుచుండ నొక్కసారి గొంతుక గద్గదికఁబడెను. విశాల నేత్రముల రెంటిని భేదించుకొని వేడి కన్నీటిధారలు జారఁజొచ్చెను. ఆమెహృదయవేదనను వెల్లడింపసాగెను,——'మఱియు, ఇఁక నీ జన్మలో నన్ను గలిసికొనుటకు వీలులేనిచోట కరుగుమనుము.'

ఈ మాట చెప్పుచుఁ జెప్పుచు నంబాలిక విలాసకుమారి మెడపట్టుకొని యామె యొడిలో మొగము నొంచుకొని బిగ్గరగా నేడువ నారంభించెను. విలాసకుమారి తన చీరచెఱఁగుతో నంబాలికయొక్క కండ్లఁదుడుచుచు,——'అందులో తప్పేమి యున్నది? చెప్పవచ్చు' ననెను.

రాజకుమారి పెద్దనిట్టూర్పుతో తలయెత్తి ఇట్లనెను,——'ఏమంటివి? సఖీ! తప్పేమున్న దంటివా? చెప్పెదను వినుము. నేను సంగతులన్నియును విప్పి చెప్పెదను. ఇప్పటికి పదిసంవత్సరముల క్రింద నేను మాతల్లితో నొకసారి మేవారు వెళ్ళితిని. అప్పు డొక కింశుకవృక్షము క్రింద కేవల మొక్కసారి వానిని చూచియుంటిని. ఆ సమయమున నేను——అదీయేమి సఖీ?——"

వెంటనే విలాసకుమారి ముఖము కందిపోయెను. ఆమె అంబాలిక చేతినుండి మోడ వదలించుకొని లేచి నిలువబడి రెండుచేతులతోడను గుండెలను తడుముచుకొనుచు తనలో తానిట్లను కొనెను,—'ఇక నే నాచుకొనలేకుంటిని. గురుదేవా! మీ అనుమానము బహుశః నిజమగునేమో. హృదయమును నొక్కిపట్టుకొందుంచగలనా? నా మతి చెడి పోవునేమో? లేదు, లేదు! ధైర్య మవలంబించెదను."

అంబాలిక యామె యెఱ్ఱవడిన మోమువంకఁ జూచి కరుణాస్వర మున నడిగెను,—'అదియేమి అట్లు కుంటివి? సఖీ! నీకు కోపమువచ్చె నా లేక నామాటలకు సహింపము కొనుచుంటివా?

విలాసకుమారి అతిశీఘ్రముగ తన హృదయమును సంబాళించు కొని అంబాలికను కౌఁగిలించుకొని యిట్లు పలికెను.,—'క్షమింప వలెను, రాజనందనీ! చాలదినములనుండి నాహృదయములో నొక వ్యాధియున్నది. మధ్యమధ్య నది రాత్రులు నాకుమొదలి కొక వికా రమును గలుగఁజేయును. ఎవరైనఁజూచిన నాకు కోపమువచ్చిన దేమో యనుకొందురు కాని యది యొక్క కేవల మొక్క క్షణమే యుండును. ఇక కొన్నిదినములు రాకుండఁ జేసికొందును. నీవు జెప్పఁబోవుచున్న దేమో చెప్పుము రాజసముద్రతీరమున కేవల మొక్కసారి చూచితివని యెటులుపిమ్మట?"

అంబాలిక విలాసకుమారి ముఖమునకు నాశ్చర్యముతోఁ జూ చుచు నొక్కక్షణకాలము నిశ్శబ్దముగ నూరకుండి మరల చెప్ప నారంభించెను,—'ఊఁ, చెలీ నేనానాఁడు చాలచిన్నదానను, నాకు ప్రేమంటే ఏమిటో తెలియదు. ఏదో పిట్టపేరో చెట్టుపేరో అను కున్నాను. అప్పటినుండియు నీశరీర మా నీచవంశోద్భవ దరిద్రకృషీ వలుని ప్రేమతోనిండి నిబిడీకృతమైపోయినది. నా శరీరరక్తముయొక్క ప్రతికణమందు నాతనియెడ ప్రేమ ప్రవహించుచున్నది. అటుపిమ్మట

ఎనిమిది సంవత్సరములకు, సఖీ! నీవెఱుఁగుదువుకదా ఆబూకొండలనుండి తిరిగి వచ్చునప్పుడు ఫకీరు మసీదునందు ఆ పంద్రెండేండ్ల బాలకుఁడు ఒక్కసారిగా పఱుగెత్తిపోవుచున్న స్వప్నమునందు త్రిభువనమోహన మహేంద్రరూపమునుధరించి నాకు తిరిగి ప్రత్యక్షమైనాడు. వాఁడు నాకాళ్ళమీఁద పడిపోయినాఁడు ప్రక్కను మహారాణి నిలిచియున్నది. నేనును లజ్జాశ్చర్యానందములచే స్మృతిదప్పి భూమిమీఁద మూర్ఛిల్లితిని. సఖీ! నీవే యోచింపుము. ప్రాణముండఁగా మరచిపోఁగలనా? ఇంకను చెప్పవలసియున్నది. వినుచెప్పెదను సఖీ! మరనాఁడు త్రోవలో రెండువందల ముసల్మానుసైనికులు మాపై నాక్రమించినపుడు, వీరయువకుఁడు నాకొఱకు ప్రాణమిచ్చుటకు సిద్ధపడి యొక్కసారి నావంకఁ జూచెను రెండువందలయవనుల నెదుర్కొనెను. అటుపిమ్మట వాని రక్తమును గ్రోలుటకు ఒక్కసారిగా వందలకొలది ఖడ్గములులేచినవి. అదిచూచి నేను మహారాణీ యొడిలో మూర్ఛపోయితిని. కఠినహృదయుడగు దుర్గాదాసును అంతకంటె కఠినహృదయురాలగు మహారాణియు నాతని నొంటరిగ మృత్యుముఖంబునవిడిచి నన్ను తీసుకొని పాఱివచ్చితిరి! ఇన్ని దినములైనపిమ్మట నింత యుపనింద పాలై సఖ యాతని మరువఁగలనా!”

విలాసకుమారి అంబాలిక మోమును ముద్దుపెట్టుకొని ఇట్లడిగెను —‘మంచిమాట! బాగుగనేయున్నది. రాజనందినీ! అట్లైన నీవెంతపాషాణహృదయవు! నీవాతని నిప్పుడు దేశబహిష్కారము సేయఁ బూనియున్నావుగా! ఏముఖముపెట్టుకొని యాతనిని జన్మపర్యంతమును విడువనున్నావు?

అంబాలిక మరల విలాసకుమారి కంఠము నాలింగనముసేసుకొని కన్నీటితో నామె వక్షమును గడుగుచు నిట్లనెను,---‘సఖీ! ఎంత దుఃఖము! నేను రాజనందినినై బుట్టితినే! అయ్యో ఆతడునీచ వంశమునం దుద్భవించెనే! హా! విధాత! ఎంతపని చేసితివి!

అంబాలిక తిరిగితిరిగి ఆజ్ఞాపించుటవలన విలాసకుమారి కృషీవలుని బిలిపించి రాజకుమారి యొక్క యభీష్టము నెరిగించెను. కృషీవలుఁడు సమ్మతించి మరునాఁ డుదయముననే కోటను వదలి వెడలి పోదునని వాగ్దానము చేసెను ఆరోజు సాయంకాల మగుటతోడనే నక్షత్రకాంతియందు అంబాలికయు విలాసకుమారియు నొక యరుగుపై నిలిచియుండిరి. కృషీవలుఁడు వారి యొద్దకు వచ్చి చేతులు జోడించుకొని యిట్లు పలికెను,—'రాజనందని! నేను మీ యాజ్ఞానుసారము కొండకోటను విడిచి వెడలిపోవుచున్నాను కాని నా తప్పు మన్నింపుఁడు. ఒక్కమాట యడిగెదను,—'నేను మీ యెడల నేమైన నపరాధము చేసియుంటినా?'

రాజకుమారి యీ మాటకేమియు జవాబియ్యలేదు. కృషీవలుఁ డంధకారమున నా రాజకుమారి కన్నులవెంటఁ గారు జలబిందువులను గాంచలేకపోయెను. కృషీవలుఁడు మరల నిట్లడిగెను,—'అటులైన నేనీ సమయముననే యిక్కడ నుండి వెడలిపోవలెనా?'

రాజకుమారి మెల్లగాఁ బ్రత్యుత్తరమిచ్చెను—'ఎంత త్వరగా వెళ్ళిన నంతమంచిది, యువకా! ఆలస్యము చేయ నేమియు నవసరము లేదు.'

కృషీవలుఁడు—మంచిది, మీ యొక్క పునర్దర్శనమును గూర్చి యాశ హృదయములో నుంచుకొనవచ్చునా?

రాజకుమారి—నన్ను తిరిగి కలుసుకొనుటకు మీ కేమి యవసరమున్నది?

విలాస—యుద్ధము సమాప్తమైన పిమ్మట రాజకుమారి మీకు

మునల్మానులను జయించినందులకు బహుమానముగ వరమాలిక లొసంగగలదు.

అంబా—హాం, సఖి! ఇది హాస్యమునకు వేళకాదు. మంచిది పొమ్ము, వీరవరా! ఇప్పు డిట నుండవలసిన యావశ్యకము లేదు. ఈశ్వరుఁడు నీకు మంగళము లొసంగు గాక!

కృషీవలుడు రాజకుమారి కభివాదనములు చేసి వెడలిపోయెను. అంబాలిక చీరచెఱఁగున తన మోము సద్దుకొనుచు మరల నిట్లనెను,- 'ఇదుగో! వీరయువకా! ఇంకొక్క మాట-నీవు—"

కృషీవలుఁడు తిరిగి వచ్చి రాజకుమారి యెదుట నిలువఁబడెను.

రాజకుమారి ఇట్లు చెప్పసాగెను,—"నీవొక్కసారి నన్ను శత్రువుల బారినుండి రక్షించితివి. నాకోఱకు నీప్రాణము కూడ నియ్య నుద్యుక్తుఁడవైతివి అందుకు బహుమానముగా నాయుంగరము నీకిచ్చుచుంటిని."

ఈమాట యని అంబాలిక తన వ్రేలినుండి యొక్క రత్నపు టుంగరము తీసి కృషీవలుని చేతియం దుంచెను హఠాత్తుగా రాజకుమారి చేయి కృషీవలుని చేతికి తగిలెను. ఒక్కక్షణములో వసంతవాయువు వీచినప్పుడు మాధవీలత యూగినపగిది రాజకుమారియొక్క శరీరము యాపత్తును కంపింపఁ దొడఁగెను. తోడనే యామె మృణాల సదృశభుజయుగళమును అల్లల్లాడసాగెను. కమలపుష్పంబు భాతి ముఖమండలంబు నరుణమయంబాయెను. అట్టి సమయమున నెట్టులో తెలియదు ఒక్కసారి,—కేవల మొక్కసారి రాజకుమారి యధర మాకృషీవల యువకుని యధరము నంటును. తోడనే రాజకుమారి యులికిపడి వెనుకకు తగ్గెను—కృషీవలుఁ డిట్లనెను,—రాజనందినీ! సెలవైన యెడల నొక మాటజ్ఞాపకముచేసెదను, చాల దినముల క్రింది మాట.

అంబాలిక యొక్కసారి కృషీవలుని వంక దిరిగి చూచి తరువాత తలవంచి భూమివంకఁజూచెను. కృషీవలు డిట్లు చెప్పసాగెను,- 'మీకు జ్ఞాపకమున్నదా? చాల దినములైనది ఒకనాడు రాజసముద్రతీరమున కింశుకవృక్షముయొక్క పైకొమ్మ నున్న పూలగుత్తిని మీ వ్రేలితో చూపించియున్నారు. నేను మీతో చెప్పితిని,— 'పైకొమ్మ నుండే మాత్రము పూవు లెవ్వరును గోయలేరనుకున్నారా! మఱియు ..."

వెనుక నుండి యెవ్వరో కృషీవలుని మాటల నడ్డగించి నవ్వుచు నిట్లనిరి,—'మఱి పైకొమ్మ పూలు నా యంతటవి క్రిందఁబడిన యెడల మరల పైకెగురవేసిన యవసరము లేదు.'

విలాస—కాలాపహాడు కెక్కడ కెట్లు వచ్చినాడు!

విజయపాలుడు దగ్గఱకు వచ్చి నవ్వుచు నవ్వుచు నిట్లనియె,— 'కాలాపహాడు నేడు కృషీవల యువకునికి రాజకుమారి తన ముద్దుటుంగరమును ముద్దులద్ది ఇచ్చుటను జూచి చరితార్థుడైనాడు.'

విలాసకుమారి చప్పున సంబర రాజకుమారి చేయిపట్టుకొని లాగుచు నక్కడ నుండి తీసుకొనిపోయెను

విజయపాలుడు కనుపుబ్బ నవ్వుచు కృషీవలుని వీపున దట్టుచు నిట్లనియె,—నే నదివఱకె కనుగొంటిని, ఒక్కటే సమయముగా వీరత్వమును ధీరత్వమును కేవలము విజయపాలునియొద్దనే యున్నవి. కాని సోదరా నీవు నన్ని విధముల నోడించినావోయి.

---

# ౧౨

## కాలాపహాడుని స్వప్నము

కృషీవలుఁడు కొండకోటను వీడి ఫకీరు యొద్దకుపోయి నివసించియుం డెను. కబురువచ్చినతోడనే అక్కడ నుండి వచ్చి యవనులతో యుద్ధ మునకు సన్నద్ధమగుట కేర్పాటుచేసికొనెను. రెండు నెలలైన తరు వాత నొకనాడు సంధ్యాకాలమునకు పూర్వము అంబాలికయు విలాసకుమారియు కోటకు దగ్గఱ నున్న నదీతీరమున నిలిచి మాట లాడుచుండిరి. అంబాలిక ఇట్లు చెప్పుచుండెను,—'నాకు సరిగా చెప్పుము ఇక్కడ నుండి మనము నాథద్వారమెప్పుడు వెళ్ళగలము? నే నెంతయో కష్టముమీద మహారాణిని ఒప్పించితిని. కాని నీవూరకే ఆలస్యము సేయుచుంటివి. నేను నిన్నెంతయో వేడుకొను చుంటిని. సఖి! శీఘ్రము యిచ్చటినుండి పోవుదము. ఆలస్యము వలదు.''

విలాస—ఇంకను కొన్నిదినములు చూచిపోవుదము ఈయవన యుద్ధ మెట్లు పరిణమించునో చూతము.

అంబా—ఇక్కడ యుద్ధములే దేమీ లేదు. ఇక్కడ వ్యర్థముగా నుండి ఏమిలాభము?

విలాసకుమారి నవ్వుచు—నీ వేమనుకొనుచున్నావు? నాథ ద్వారముపోయి సన్యాసిని యగుటతోడనే నీ దుఃఖములన్నియు నంత రించిపోవు ననుకొనుచున్నావు కాబోలు.

అంబాలిక ఒక్క నిట్టూర్పువుచ్చి—'సఖి! అచ్చట రాధా కృష్ణుని పవిత్రప్రేమ ప్రవహించునని విన్నాను. అందువలననే బహు శః సర్వదుఃఖములు నచ్చట మాయమైపోవునని అందరనుకొనెదరు. అక్కడకు వెళ్లినంతనే ఎంతయో ఫలమని యనేకమంది యనగా

విన్నాను. అందుచేత నాకు వెళ్ళవలెనని ఎంతయో కుతూహల మగుచున్నది.

విలాస—గాభరాపడకమ్మా సఖీ! నీ కోరికలన్నియు సిద్ధించును— ఇదియేమి! ఈ కోలాహలము?

ఒక్కసారిగా దగ్గఱకోటనుండి కేకలు వినవచ్చెను. సైనికుల దడబిడలు—స్త్రీల యార్తనాదములు—దానివెంట ఖడ్గముల ఝణ ఝణలు వినవచ్చెను. విలాసకుమారి యాందోళనపడుచు నిట్లనెను— 'ముసల్మానుసైన్యము కోటమీఁద కెక్కి వచ్చుచున్నది. రాజకుమారీ! పద! మనముకూడ పోయినగాతేము, కాలాపహరుడు మనల నిప్పు డెట్లు రక్షించునో.

అంబాలిక—మనసాహసము చేసినందువలన లాభములేదు. ముస ల్మానుసైనికులు మనమీఁద పడినయెడల మనలను రక్షించువా రెవ్వరు?

విలాస—నేను ప్రక్కనున్నాను. ఈకత్తి చేతితో తీసుకొనుము. స్త్రీలచేతిలో కత్తియుండిన శత్రు వేమిసేయఁగలఁడు!

విలాసకుమారి యొక వాఁడియైనసూఱియను తన బట్టలోపలనుండి తీసి అంబాలిక చేతికిచ్చి యామెచేయి పట్టుకొని లాగుకొనిపోవుచు నిట్లు చెప్పసాగెను,—అదుగో చూడుము, కోటలోని సైన్యము కేకలు వెట్టుచు నిట్లు పఱుగెత్తుచున్నది. ఇదేమిటమ్మా! కొంచెమిట దక్షి ణాపువైపుచూడు కాలపహరుడు యుద్ధమేమియుఁ జేయకుండకనే శృంఖలాబద్ధుఁడై యడవిగున్నపోతరచిన ట్లరచుచున్నాడు!

నిజముగానే విజయపాలుడు యుద్ధముసేయకుండగనే పట్టువడి నాఁడు. ఎవ్వరికిని కొంచెముకూడ కబురు తెలియలేదు. అకస్మాత్తుగా నేను ముసల్మానుసైన్యము కోటమీఁద నెక్కెను. అందఱు భటులును నిశ్చింతగా నుండిరి, యుద్ధప్రయత్నములమాటయే మఱచియుండిరి.

విజయపాలుడు బాగుగా భంగుని తాగి కోటద్వారముదగ్గఱ మంచము వేసుకొని దానిమీఁద కూర్చుండి కునికిపాట్లు పడుచున్నాడు. సమస్త చింతలును మఱచిపోయినాఁడు. అట్లు కొంతకాలము కునికిపాట్లుపడి పడి మెల్లిగా మంచముమీఁద కొరిగి నిద్రపోయినాఁడు. విజయపాలుడు నిద్రలో భంగుయొక్క మహిమవలన నొక్క యపూర్వ స్వప్నమును గాంచ నారంభించెను. వాడు దివ్యదృష్టిచే నీ రోజు యవనసేనాపతి సేనలఁ గూర్చుకొని కోటపై దాడి వెడలుచున్నాడని తెలిసికొనెను. ఈ సంగతి ఇంకెవరికిని తెలియదు. అజాగ్రతగ నున్నప్పుడే యవనసైన్యము కోటపై బడునని కూడ యాతనికి తెలియును. అందుచే నాతఁడు తన యసాధారణ వీరత్వమును అందఱకును చూపించి అందులో విశేషముగా స్త్రీలకుఁ జూపించి ఒక్కడుగా నా నాశ్చర్యమున ముంచివేయవలెనని యతని మనస్సులో మనోరథము చేసికొనెను. మంచి సమయములో యవనసేన కొండయొక్క యొకభాగముపై కనఁబడెను. ఆ సమయమున నాతఁడు స్త్రీలయొద్దకు పోయి చేతు లభినయించుచు వారితో నిట్లు చెప్పసాగెను. 'నేడు కాలాపహాడెంతగొప్ప వీరుఁడో మీరాగే చూడగలరు. ఆ రోజున దైవవశముచే నేను కృషీవలునివలన నోడిపోవుట వలన మీరు నన్నెగతాళి చేసినారు. కాని నేడు చూడుడు ఒక్కడనే వేయిమందిని శత్రువులను బీచమడంచెను.' అంతట స్త్రీలు సంతోషించి యిట్లందురు, 'ఒక్కడవే యంతమంది శత్రువుల నెట్లు చంపుదువు? భంగునిషాచేత కలగఁటున్నావేమో చూచుకో' అంత ఆయన ఒక పెద్దనిట్టూర్పు పుచ్చి రొమ్ము చఱచుకొనుచు నిట్లనెను,—'ఇప్పుడే మీరు చూడఁగలరు. ఈ కొండక్రింద తల వంచి చూడుడు,—ఎంతమంది యవనసైనికులు కొండ యెక్కుచున్నారో. అంత అంబాలిక యిట్లనెను,—'ఇంతమంది సైనికులతోఁ

బోరాడ కాలాపహాడునకు చేతకాదు. ఈ కృషీవల యువకుని వెంటఁ దీసుకొనిపొమ్ము ఆయన అంబాలిక మనోభావమును గ్రహించి నవ్వుచు నిట్లనెను,—“కాలాపహాడు ఈసారి స్త్రీల యపహాస్యమునకు గుఱికాదు. ఈసారి తెలియఁగలదు, ఎవరు జయమాలను సంపాదింపఁగలరో” ఈమాట చెప్పి యతఁడు ఖడ్గమును జేపట్టి కొండపైకి వచ్చువారు మార్గమున నొక చెట్టుమాటునదాగి మనస్సులో నిట్లువితర్కింపఁ దొడంగెను,—‘ఈకొండచరియమార్గమున నొక్కసారెంతమంది ముసల్మానులు పైకెక్కఁగలరు? సిపాయి లొక్క రొకరుగా నెక్క వలసినదే. నేను చెట్టుచాటున డాగి ఒక్క రొకరినిగా కత్తితో తల యెగురవేయుదును.

ఈ సమయమున విజయపాలుని నిషానిద్ర పాపము! భంగమైనది. వాని స్వప్నము పూర్తిగ సబద్ధము కానట్లు తెలియవచ్చినది. నిజముగనే నల్గురు ముసల్మానులు నిశ్శబ్దముగ వాని మంచము చుట్టును నిల్చి యాయన యొడ్డు పొడుగు శరీరమునుచూచి తమలో తామేమో సైగలు సేసుకొనుచుండిరి. ఒకడు మంచముపైనుండి యాయన కత్తినెత్తి దాచివేసెను. ఇంకొకడు వాని కాళ్ళకు ఇనుపసంకెళ్ళువేసి మంచమునకు బిగించివేసెను. మూడవవాడు వాని రెండుచేతులను గట్టిగఁ గట్టివేసెను. నాల్గవవాడు వాని కంఠమును మంచమునకు కట్టివేసెను. ఇట్లు ఆతడు ఏవైపునకు కదలకుండ మెదలకుండ వారు బిగించివేసిరి. విజయపాలుడు వెనుకటివలెనే స్వప్నమును దర్శింపనారంభించెను. ఒక ముసల్మానుఁడు వాని ప్రక్క కొండనెక్కి వచ్చెను. వాని తల నరికివేయుటకు కత్తి నెత్తబోయెను. కాని ఏమి యాశ్చర్యము! కత్తి యెక్కడిది? చేయి కాళీయైయున్నది. ఇదియేమి? చేయి లేవదేమి? క్రమముగా నిద్దఱు మువ్వురు నల్వురు పదిమంది ముసల్మానులు తప్పించుకొని పోవుచున్నారు!—అరే పరుగెత్తుకొని పోవు

చున్నారు! అరే పరుగెత్తికొని వెళ్ళి వాండ్రను పట్టుకొనవలెను. ఇది యేమి! కాళ్ళు కదలవేమి! కాళ్ళకేమోసంకెళ్ళు పడినట్లున్నవి. ఎవరు వేసిరివి! అరే ఇదియేమి కంఠము కదలదేమి? ఏమియో గట్టినట్లున్నదే! రొమ్మున్నమీద యేమి బరువుగా నున్నదేమి? విజయపాలుని నిద్ర ఇప్పటికి భంగమైనది స్త్రీల యార్తనాదములు సైనికుల కోలాహలములు ఆతని కిప్పుడు వినవచ్చుచున్నవి ఆయన చింతనిప్పుల వలె నున్న కండ్లు తెరచి జూచెను. కోటకు నలువైపులను యవనసైన్యము నిండుచుండెను. మంచము నాలుగు మూలలను ముసల్మానులు నిలిచి నవ్వుకొనుచుండిరి.

'నా ఖడ్గ మెక్కడున్నది' అనుచు విజయపాలుఁడు లేచుటకు ప్రయత్నించెను.

ఒకడు నవ్వుచు,—'నోరుమూసుకొని పడియుండరా కాఫిర్ బేడీలుపడియున్నావురా' అని జవాబుచెప్పెను.

క్రోధాశ్చర్యములతో నరచుచు విజయపాలుఁడు ఇట్లు కేకలువేసెను,—అరే యవనులారా! ఛీ ఛీ! మీరు నన్ను మాయచేసి పట్టుకున్నారు. నా చేతికి కత్తియిచ్చి మీకుశక్తి ఉంటే రండి యుద్ధమునకు.'

'ఇంకా యుద్ధముమీద ఆశవున్నదిరా నీకు. ఈ దెబ్బతో నీయాశ వదలుతుంది' అని యొకడు వాని తలఁ దెగవేయుటకు కత్తి యెత్తెను.

మఱియొకడు వాని చేయిఁబట్టుకొని యిట్లనెను,—'పడిపోయిన వీరునిఁ గొట్టుట న్యాయముకాదు కొట్టుట కిష్టమున్నయెడల వారి కత్తి వానికిచ్చివేయుము. ఇదిగో కాఫరు వీరుఁడా విను. మేమీసారి దయదలచి నిన్ను విడిచిపెట్టితిమి. నీవుమాత్రము ఊరకే అరవబోకు"

విజయ—ఓరీ పాపియవనుఁడా! నేను మీదయ నాశింపను. నాకు కత్తినిచ్చి నాతో యుద్ధమునకు రండు. ఒకవేళ మీరు నాతోపోరా

డుటకు భయపడినచో నాకత్తి నాకిచ్చివేయుము. నేను మీతోపోరా డకుండ నొక్కసారి యా స్త్రీలందఱును విలపించుచున్న స్థలమునకుఁ బోయి వచ్చెదను.

ముసల్మాను—మరల చెప్పుచున్నాను. అరపులు మానివేయకపో యిన నీ ప్రాణము లుండవు.

విజయపాలుఁడు పిచ్చియెత్తిన వానివలె నంఘ్లు కొరుకుచు నిట్లు చెప్పెను,—'అరే ముసల్మానుఁడా! ఏమనుచున్నావురా? వీడేమి పిచ్చవా డనుకున్నావురా? యుద్ధమును జేయక, ముసల్మానులను డొక్క చించి యమలోకమునకు బంపక నోరుకూడా మూసుకొని పడియుంటాను రా? నీయిష్టం వచ్చినట్లు చెయ్యరా, నేను మాత్రం నా సంకెళ్ళు వదలిపోయేదాకా గొంతుకు బ్రద్దలయేటట్లు కొండలు కదిలిపోయేటట్లు అరుస్తూవుంటాను.

ముసల్మానులు నల్గురును వానిమాటలకు నవ్వసాగిరి. విజయపా లుఁడు జోరుగ తన సైనికులకు కేకలుపెట్టి పిలువసాగెను,—'వీరవరు లారా! మీరు నన్ను త్వరగా వరిలించండర్రో. వదిలిస్తే ఈ ముస ల్మానుభటులను యమలోకం పంపించి నా అవమానం తీర్చుకుంటా నర్రో.'

ఈ కేకలు ఎవరు వినిపించుకొనలేదు, ఎవరును రాలేదు. కాలాప హాడుగారి కొండ బ్రద్దలగునట్టి యరపులును స్త్రీల యార్తనాదము లును ముసల్మానులు యట్టహాసములలో విలీనమై పోయెను.

అంగాలిక—'సఖి! పోవురము పడ. ఇఁక నిచ్చటాలస్యము సేసిన లాభములేదు. అదుగో చూడు! ఒక ముసల్మానుఁ డిటు వచ్చుచు న్నాడు!'

విలాస—ముసల్మానుకాదు, సఖి. ఆతఁడు ముసల్మాను వేషము వేసుకొనిన హిందువు.

అట్లు ముసల్మాను వేషధారియైన హిందు వానియొద్దకు వచ్చె ను. అంబాలిక చేతిలోని కత్తి క్రింద పడిపోయెను. ఆమె వణకుచు వానివంకఁజూచెను—ఆ యవనవేషధారి హిందువు జైసల్మీరు రాజ కుమారుఁడు కేసరిసింహుఁడు.

కేసరి—రాజనందినీ! ఇప్పుడైన నీవు నా ప్రస్తావమున కంగీకరిం చిన నే నీభీషణ సంకల్పమును వదలు కొందును.

విలాసకుమారి యాశ్చర్యముతో—అటులైన నీవేనా ముసల్మాను సైన్యమును వెంటఁదీసుకొని వచ్చినది?

కేసరిసింహుఁడు వికటహాసమును జేయుచు—ఈమాట నంబర రాజకుమారి నడుగుము. నే నీపిశాచ ప్రతిజ్ఞను చాల ముందుగనే రాజకుమారితోఁ జెప్పియుంటిని.

అంబాలిక—నీ కింకను ఆశయున్నదా? అంబరరాజకుమారిక నీ వంటి పిశాచముతో వివాహము చేసుకొనునా?

కేసరి—అటులైన నాపైశాచిక ప్రయత్నము నెరవేరనిమ్ము. (కేకలు పెట్టుచు) అరే హుస్సేనాలీ! ఖుదా దాదా! పీరుగత్తు, మీరు వెదకుచున్న యువతి ఇదిగో ఇక్కడున్నది. పాలకీపట్టుకొని రండు.

ఆ కేకలు వినఁగానే చాలమంది ముసల్మానులు అచ్చటకు పఱు గెత్తుకొనివచ్చిరి. ఆరాజకుమారిచుట్టును మూగిరి. కేసరిసింహుఁడు ఆ రాక్షసదళపరివేష్టిత సురసుందరియొక్క దివ్యమూర్తి నొక్కసారి జూచి సైనికులతో నిట్లనెను,—నా ప్రతిజ్ఞ పూర్తియైనది. ఈబాల పాఱిపోకుండఁ జూచుచుండుడు. నే నిప్పుడు మన రాజయొద్దకు పోయి యీ శుభవర్తమాన మెరిగించెదను.

---

## ౧౩

### సైతాని

కొండక్రింద కోటకు రెండుమైళ్ళదూరమున నొక నిర్జనమార్గమునఁ గొందఱు బోయీలొక్కసవారీని మోసుకొనిపోవుచుండిరి. సవారి వెంట కొంతమంది కాలినడకను ఒకడు గుఱ్ఱము నెక్కియు పోవుచుండిరి గుఱ్ఱపుసవారు పీరుబక్షనువాడు ఈవఱకే పాఠకులకు పరిచితుఁడై యుండెను. సవారిలోపల సంబాలికయు విలాసకుమారియు నుండిరి. ఇంకను రాత్రి విశేషప్రొద్దుపోలేదు. కృష్ణపక్షసప్తమనాటి వెన్నెల లప్పుడే స్పష్టముగ బయలుదేరుచున్నవి.

విలాసకుమారి సవారి తలుపు తెఱచి పీరుబక్షుతో నిట్లు పలకరించెను,—“ఖానుసాహెబు! నా యిష్టప్రకారము నేను నీవెంట వచ్చిన బహుశః నీకు నామీద సందేహము కలుగునేమో; లేక ఒకవేళ నామనసులో నేమైన దురాలోచన యున్నదనుకొందువేమో. అదియుఁగాక నేను చెడిపోయినదానను, కులమును వదలిపెట్టి పాఱిపోవుచున్నా ననుకొందువేమో. కాని యొక్కసారి కొంతమందిని చూచినపుడు తమంతట తాము వలచివత్తురు సుమా; తమ ధనమానప్రాణము లర్పించివేతురు సుమా. ఈ సంగతి నీ కీవఱకెన్నఁడైనఁ దెలియునో లేదో?”

పీరుబక్షు అప్పుడే గద్గదపడి ఇట్లు ప్రత్యుత్తర మిచ్చెను,—‘బీబీజాన్! నాకు బాగా తెలియును. అబ్బ! స్త్రీలప్రేమ ఎటువంటి పదార్థమంటే! ఇది మాభాషలో చెపుతారు ఇష్కు. అంటే మీలో ఇక్షురసం లాగుంటుంది. బీబీజాన్ నీతో ఇంక యేం చెప్పఁగలను? నా మాంసములో నాగుండెలలో నా యెముకలలో నాశరీర

మంతా ఇష్కమయం. ఈఇష్క అబ్బా భలేవేడి! ఈవేడికి—"

విలాస—అయితే ఖానుసాహేబు! నీ కెంతమంది బీబీలు.

పీరు—అబ్బే! ఎంతమం దెక్కడిదీ! ముగ్గురే. దానిని గూర్చి నీవేమీసందేహం పెట్టుకో నక్కరలేదు. వారందఱును నీ కూడిగము సేయుదురు. నీకాళ్ళు కడుగుదురు. నీతలదువ్వి జడ వేయుదురు. నీకాళ్లు ఒత్తుదురు. నీకు సమస్తోపచారములు చేయుదురు.

విలాస—వారలు గోమాంసము తిందురు. వారితో నేనుండను. నీవు దగ్గఱున్న యెడల నాకేమియు భయములేదు. మంచిదిగాని మన మిద్దఱమును నికా కట్టుకొనుట యెప్పుడు?

పీరు—రేపు ప్రొద్దునకు నీతోడ నున్నదానిని నవాబుసాహేబు దగ్గఱకు తీసుకొనిపోదుము. నిన్ను నేను మసీదులోనికి తీసుకొని పోదును. అక్కడ నీచేత కల్మా చదివించి మహమ్మదీయులలో కలుపుకొంటాము.

విలాస—నవాబుసాహేబు గుడార మెక్కడున్నది? మన మెంతసేపటి కక్కడికి వెళ్ళుదుము?

పీరు—'ఎంతో దూరములేదు. ఇక్కడ నుండి కొంచెము దూరములో 'ఉత్తరపాలి' అని ఒక గ్రామమున్నది. నవాబు సాహేబిప్పు డక్కడ మకాం.

విలాస—ఒకవేళ త్రోవలో కోటకావలి సైన్యము మనపైబడి నన్ను నిన్నుండి లాగుకొని పోవునేమో?

పీరు—బీబీజాన్! అందుకు నీవేమియు భయపడ నక్కరలేదు. అందుకే సైన్యము నంతను సరియైన త్రోవను బంపి మిమ్మును కొంచె మడవిదారిని బట్టించి తీసుకొని పోవుచున్నాను.

విలాస—మీనవాబు సాహేబు పేరేమి?

పీరు—నవాబు అఫ్జల్‌ఖాను. పేరు వినగానే విలాసకుమారి ముఖ

మండల మొక్కసారిగ నెట్టివడెను. ఆమె గొంత తడ వాలోచించి ఇట్లనెను,—ఖానుసాహేబు! నాకు చాల దాహము వేయుచున్నది. ఇక్క డెక్కడను మంచినీళ్ళు దొరకవా?

పీరు—నే నిప్పుడే పోయి నీకు నీళ్ళు తెచ్చి యిచ్చెదను. ఇంక నేమైన నాకలి యగుచున్న యెడల నా యొద్ద కబాబులున్నవి. కావలసినఁ బెట్టెదను.

విలాస—ఛీ! ఛీ! (మరల మెల్లమెల్లగా వినఁబడకుండ) ఈపాపి యేమనుచున్నాడు?

పీరుబక్షు కొంచెము సందేహపడి ఇట్లనెను,—'అదేమి అట్లనుచున్నావు! నిన్ను నిఖా కట్టుకొనుచుండ నిఁక సందేహించెద వేమి?

విలాస—ఇంకను నిఖా కాలేదుగా. నిఖా కాకముందు ముసల్మానుల జేతినుండి తినఁగూడదు. రేపుప్రొద్దున రేపు నాచే కల్మా చదివించిన తరువాత నిఖాకట్టుకొందువుకదా. అప్పటినుండి నీ వెటుల చెప్పిన నట్లే చేయుదును కాని—"

పీరు—సరేలే బీబీజాన్! నీ వింక సధికముగఁ జెప్పనక్కరలేదు. నాదే తప్పు. కాని ఇక్క డెవ్వరును హిందువులు లేరే. ఎవరు మంచినీళ్ళు తీసుకొని రాఁగలరు.

విలాస—దగ్గర నెక్కడనైన చెఱువున్న యెడల నన్నక్కడకు తీసుకొనివెళ్ళి నీళ్లు త్రాగించి తీసుకొని రాలేవా?

పీరు—ఓ, భేష్.

విలాసకుమారి అంబాలిక చెవిలో నేమియో చెప్పెను. పీరుబక్షు సవారి బోయీలతోడను తోడి యనుచరులతోడను గొంతసేపు నిలువుమని యాజ్ఞఇచ్చి విలాసకుమారిని మంచినీళ్లను త్రాగించుటకు చెఱువువంకఁ దీసుకొనిపోయెను.

ప్రకృతి కదలక మెదలక గంభీరముగ నిశ్శబ్దమయమై యుండెను.

చెఱువుపై వెన్నెలలు(వాలి చాల శుభ్రముగ మెరపించుచుండెను. చెఱువుయొక్క ప్రకృతి సౌందర్యమును జూడగనే విలాసకుమారి ఇట్లనెను,—"చేతితో నీళ్లెట్లు త్రాగుదును! చెఱువులోనుండి యొక్క కమలపత్రము తెచ్చిపెట్టిన దానితో చక్కగ నీరు త్రాగుదునే. విశేషము లోతులేనట్లున్నది.

పీరు—నీళ్లు లోతున్ననేమి నిముద్దు చెల్లింపకుందునా? ఈదిమైనను బోయి తెత్తును. బీబీజాన్! నీళ్లయిన నేమి అగ్నిహోత్రమైననేమి ఆకాశమైననేమి పాతాళమైననేమి నీకొఱకు కీగులాము వాడు పోవుటకు సందేహించునా!

విలాస—అబ్బే, మీరు గుఱ్ఱముమీదనుండి దిగనక్కరలేదు. నేను మీగుఱ్ఱము లగాము పట్టుకుంటాను. మీరు మెల్లమెల్లగా నాకు కోయుడు. అంతేకాక సగము వికసించిన కమలములు లజ్జచే తలలు వాల్చియుండును. వానిసికూడ ఒకటి రెంటినికూడ కోసి పెట్టుడు. కోయునప్పుడు జాగ్రత పాపము ముండ్లు గ్రుచ్చుకుంటవి.

విలాసకుమారి గుఱ్ఱపు లగాము పట్టుకొని యుండెను. పీరుబక్షు ప్రేమపూర్వకముగ బీబీజాను మోమువంకం జూచుచు గుఱ్ఱముమీదినుండి వంగి పూలుగోసెను. పిమ్మట నాకుకోయుట కింకం గొంచెము క్రిందికి వంగెను. ఈసమయమున విలాసకుమారి వాని మెడమీద నొక తన్ను తన్నెను. ఆదెబ్బకు వాడు గిర్రునం దిరిగి నీటిలోపడి నిట్టులరచెను,—'హా, సైతాన్? ఎంతపని చేసితివే!'

చూచుచుండగనే విలాసకుమారి పీరుబక్షుని గుఱ్ఱముపై నెక్కి కోటవైపునకు బయలుదేరి పోయెను.

అట్లు పోయి అంతకుముందు కృషీవలునికి మార్గము చూపించుటకువచ్చి యామె యాతనిని కలుసుకొనిన స్థానమున కిప్పు డామె యరిగి గుఱ్ఱము నాపెను ఇక్కడ శాల్మలీవృక్షముపై యామె తన

పురుషవేషపు దుస్తులు కట్టియున్నదని ఈవఱకు పాఠకులు చదివి యున్నారు. ఇచ్చట తన పూర్వపు దుస్తులను దీసుకొని మరలధరించి యామె మరల పురుషవేషమును వేసెను. పిమ్మట గుఱ్ఱమెక్కి వెడలిపోయెను. కొంచెముదూర మేగునప్పటికి కొండత్రోవలో రక్త ప్రవాహములు పాఱుచున్నవి. అచ్చటచ్చట తెగిన మొండెములు శిరములు పడియున్నవి. మఱికొంచె మేగునప్పటికి ఇంకను మొండెముల గుట్టలచేత గుఱ్ఱము పోవుటకుకూడ కష్టమగుచుండెను. ఇంక కొంచెము ముందు చచ్చినవాండ్రయొక్క రాశి పెద్ద గుట్టయై పడియుండెను ఇంతమంది ముసల్మానుల నెవ్వరు చంపియున్నారు? ఇది యేమి! ఈశవముల మధ్య నా దేవసన్నిభుండైన ముసల్మాను ఫకీరేల కూర్చుండియున్నాఁడు? విలాసవతి గారి హృదయము హడలిపోయెను. అచ్చట నా ఫకీరు ఒక స్మృతిఁదప్పి పడియున్న మనిషిని ఒడియం దుంచుకొని వానికి చికిత్సచేయుచుండెను. కొంచెముసేపటి కామనిషి స్మృతిఁదెలిసి కన్నులు విప్పి చూచెను. ఫకీరు ఆసగను కన్నులు తెరచిన యువకుని యెదుట తన తర్జనీ యంగుళీయకమును ద్రిప్పి మధురస్వరముతో నెలుగెత్తి చెప్పందొడగెను,—'వత్సా, లెమ్ము. ఈశ్వరుని దయవలన నీవు బ్రతికెగవు లెమ్ము!'

ఆ అమృతమాయకంఠమును విని యాచైతన్యము తప్పిపడియున్న మనిషి లేచి నిలువంబడెను! ఆశ్చర్య మాశ్చర్యము! ఆ మనిషి యా కృషీవల యువకుఁడే!!

కృషీవలుడు—మహాశయా! నే సియవనయుద్ధములో చచ్చిపోవుటను దెలిసికొని నా ప్రాణము రక్షించుటకు వచ్చిరను కొనెదను.

ఫకీరు—బిడ్డా! చచ్చిపోయిన వానిని బ్రతికించుటకు మనుష్యుని కేమి చేతనగును? నిన్ను నేను గాఢనిద్రనుండి మాత్రమే. లేపించితిని నీవుకోటమీద ముసల్మాను లెక్కుచున్నారని కబురు వినఁగానే నా

కంటెముందు పలుగెత్తికొని వచ్చితివి. నీ వొక్కడవే వచ్చితి వేమి సాహసము సేతువో యను భయపడితిని. నేనును నీవెంట వెంటనే పఱువిడి వచ్చితిని. అప్పటి కప్పుడే యీ విధముగ నీ శవములమధ్య స్మృతిఁ దప్పి పడియుంటిని.

కృషీవలుఁడు—మీదయ వల్ల ఈ వ్యర్థజీవి పునర్జీవించెను. వీని వలన నేదైనఁ బనిగానునుము త్వరితముగఁ జెప్పుము. శత్రువులు సవారి నెత్తికొని యెట్లుపోయిరి?

విలాసకుమారి యప్పుడు ముందుకు వచ్చి,—'నే చెప్పఁగలను. దుష్టముసల్మానులు అంబారిని నెక్కడకు తీసుకొనిపోయిరో నే నెరుఁగుదును. గురుదేవుని యాశీర్వాదముచే నన్ని సంగతులను చతురతతోఁ గనుఁగొని కోటలోనికి కబురుతీసుకొని వచ్చుచున్నాను

కృషీవలుఁడు ఆశ్చర్యానందములతో విలాసకుమారి ముఖమండలము నీక్షించి 'అట్లైన దేవీ! దయచేయుము. నాకు మఱియొక్క సారి యవనయుద్ధమునకు త్రోవ చూపుము.

## ౧౪

### సింగము–నక్కలు

వీరుబక్షు నీళ్ళలోనుండి బయటకు వచ్చి చూచెను. గుఱ్ఱమును బీబీ జానుకూడ మాయమైపోయెను. పాపము ప్రేమించిన స్త్రీపై నిరాశచేసుకొని తగిలిన దెబ్బకు బాధపడుచు నిట్టూర్పు పెద్దదొకటి విడిచి యా గుఱ్ఱపు సవారియైన సైతాను నని తిట్టుచు సవారియున్న చోటకు వచ్చి యనుచరులతో నిట్లనెను,—'మనమెంత తొందరగ వెళ్ళగల్గిన నంత తొందరగ నీ కాఫరు సుందరినిఁ దీసుకొని నవాబు సాహేబుకు శిబిరములో ఒప్పగించవలెను. లేనియెడల మన కింకేమి

పాట్లు మూడునో దేవునికెఱుక! అయ్యయ్యో! ఇటువంటిసైతాని దయ్యమును నేను కలలోకూడ చూడలేదు బాపురే!

రాత్రి జరగిపోయెను. సవారి ముసల్మానుల శిబిరమునకు చేరుకొనెను. అంబాలిక యిప్పుడేమి గతియని విచారించుచుండెను. విలాస కుమారి సవారినుండి దిగివీరుబాలకునితో వెళ్ళునపుడు త్వరితముగ కోటలో కబురు చెప్పి వెంటనే తిరిగివచ్చి త్రోవలోనే విడిపించుకొందు నని చెప్పి పోయెను. కాని ఇంతవఱకే సహాయమునులేదు ఎవ్వరును గానుపించలేదు. ఇక ప్రాణత్యాగము కంటె నుపాయములేదు. అటు చింతించుచు నామె సురియ చేబట్టి పైకికండ్లెత్తి చూచుచు నిట్లు దేవుని తలుచుకొనెను,—' భగవంతుడా! ఆత్మహత్య మహాపాపమని వినియుంటిని కాని నాథా! యవనుల చేతులనుండి తప్పించుకొనుటకు మఱియొక యుపాయము కానరాదు.'

ఈసమయమున నెవ్వరో జోరుగ సవారి తెరలు లాగిరి. అంబాలిక వణకుచు చూచెను. కేసరీసింహుడు ఎదురుగ నిలిచియుండెను పానితోడ నొక వికారాకారుడగు యవనుడు నవ్వుచు నిలువబడి యుండెను.

కేసరీసింహుడు గొంతెత్తి పలికెను —' యవన సేనాపతీ! నిజముగా నిట్టి కనకపారిజాతమును నరకమునకు బాగవేయుటకే విధాతసృష్టించెనా ''

యవనసేనాపతి యఫ్జుల్ ఖాను కేసరీసింహుని మాటలయర్థమును గ్రహింపలేక ఇట్లు జవాబుచెప్పెను,—' మహరాజా నేను మీయెడల పరిపూర్ణకృతజ్ఞుడనై యుందును

" నేను బాదుషాహాతో చెప్పి మంచి బహుమానము—"

కేసరీసింహుడు వికటహాసమును జేయుచు,—' బహుమానము? యవనసేనాపతీ! బహుమానము! బహుమాన మిచ్చునెడల నిప్పుడే

యాత్రిలోకసుందరి యెదుట నియ్యవలెను. మీ శిబిరమునందు భటు లెందరున్నారు.

'రెండువందలే యున్నారు. తక్కినవారు మీతో కొండపై కెక్కుటకు పంపితినిగదా. వారింకను తిరిగి రాలేదు. మంచిదే కాని యీ సంగతి నేల యడిగెదరు?'

కేసరి—అఫ్జుల్ ఖాను! రెండువందల నక్కలతో నొక్క సింగము పోరాడుట నీవెన్నడైన జూచితివా?

అఫ్జుల్ ఖాను—చూడలేదు—కాని మీ మాట నాకు లేశము నర్థమగుటలేదు.

కేసరిసింహుడు ఒరనుండి ఖడ్గమును దీసి యొకచేతిలో దానిఁబట్టుకొని రెండవచేతితో అఫ్జుల్ ఖానుని మెడపట్టుకొని యాకలిగొన్న సింహము భంగి గర్జించుచు నిట్లనియె—'రారా రారా నక్కవాడా! నేడు మీరందఱు గలిసివచ్చి కేసరిసింహుని పరాక్రమమును బరీక్ష సేయుడు. లేనియెడల నిగిగో చూడుడు; కేసరిసింహుడు మీ సేనాపతి రొమ్ముఁ బ్రద్దలఁ గొట్టుచున్నాడు.''

కేసరిసింహుని మీద నప్పుడన్ని వైపులనుండియు సిపాయులు వచ్చి యాక్రమించిరి. అంతటాతఁడు అఫ్జుల్ ఖానుని మెడవదలిపెట్టి యిట్లుపలికెను,—'సురసుందరి! అంగాలికా! ఒక్కనాఁడు నిన్నుజూచి నేను పిచ్చియెత్తిపోతిని- క్షత్రియవీరుని కులధర్మమంతయు నీరూపాగ్నిలోపడి భస్మమయ్యెగదా. కాని నేడు నాహృదయమే యనుతాపనలమున దగ్ధమయ్యెనో దానిశాంతికొఱకేమి సేసెదనో చూడు. నక్కల పండ్లచేతను గోళ్ళచేతను పీకించుకొని కేసరి ప్రాణమువిడిచి తన పైఁ జూచిక కృతమున కెట్లు ప్రాయశ్చిత్తము సేయుచున్నాడో.''

రెండువందల ముసల్మానుల ఖడ్గములమధ్య నొక్క క్షత్రియ వీరుఁడు చక్రము పగిది తిరుగుచు నెంతమందినో శిరచ్ఛేదము సేయు

చుండెను. మొండెములపై మొండెము లొరుగుచుండెను. రక్తనదులు పారుచుండెను. కాని సంగ్రామము సాగుచునేయుండెను. క్షత్రియ యువరాజు తిరుగుచుండెను. ఖడ్గమునకు విశ్రాంతి లేదు. బహుశః నీవేళ కేసరిసింహుండొక్కఁడే యావత్తు సృగాందళమును నాశనమును జేసినఁగాని శాంతి వహింపడు కాఁబోలు.

అంతసరాత్తుగా నెదుట హిందూసైనికులు 'కొట్టుడు కొట్టుడు' అను కేకలు వినవచ్చెను—కేసరిసింహుఁడు గొలకించెను. విజయపాలుఁ డును కృషీవల యువకుఁడును కోట కావలి సైన్యమును వెంటఁదీసు కొని సమరక్షేత్రమునకు పరువెత్తుకొని వచ్చుచుండిరి. కేసరిసిం హుఁడు వికృతస్వరముతో నిట్లరచి చెప్పెను,—' మీరు దూరముగా నుండుడు. కేసరిసింహుఁ డొక్కఁడే ఈనక్కలతో యుద్ధము సేయఁ గలడు. '

విజయపాలుఁడు కడుపుబ్బ నవ్వుచు నిట్లనెను,—' ఎవరితో యుద్ధము సేసెదవు? అరుగో చూడు, నక్కలన్నియుఁ బారిపోవు చున్నవి. హాయి ' హా యి ' ఈరోజు నాచేతులు కాళ్ళు కట్టివేసినం దుకు కసితీర్చుకొనవలెనని యుంటిని. కాని పాఱిపోవుచున్న శత్రువులఁగొట్టుట ధర్మము కాదు. "

కేసరీసింహుఁడు మసల్మాను సైన్యము యుద్ధమును మాని పాఱి పోవుచుండుటను జూచెను. క్రోధముతోడను దుఃఖముతోడను గర్జిం చుచు విజయపాలున కిట్లు ప్రత్యుత్తరమిచ్చెను,—' పాఱిపోవువారినిఁ జంపుట క్షత్రియధర్మమునకు విరుద్ధముగాదు! ఇట్లు చెప్పుచు నాతఁడు తన ఖడ్గమును దూరముగఁ బారవేసి వట్టి చేతులతో పలా యనమగుచున్న సైన్యమును అడ్డగింప నారంభించెను. అటు లడ్డ గించు నపుడు శత్రువులు మొదట వాని కుడిచేతిని ఖండించివేసిరి. ఆతఁ డంతట నూరకుండక తన యెడమచేతితో శత్రువుల నడ్డగింప

మొదలిడెను. ఈసారి ఈచేతినిఁ గూడ ముసల్మానులు నరికివేసిరి. కాని యప్పటికిని కేసరి సృగాల యుద్ధమునందు వెనుదీయలేదు. అతఁడు పని నెదుర్కొని పాదములతో తన్న నారంభించెను. క్షణ కాలములో తల తెగి కేసరిసింహుని సుకుమార వీరదేహము వసుమతి యొడిలోఁబడి బొరల నారంభించెను. ఆతని యుద్ధము సమాప్త మాయెను. అట్లు క్షత్రియ రాజకుమారుఁడు తన భీషణ పాపమునకు తగిన ప్రాయశ్చిత్తమును స్వీకరించెను హిందూవీరుఁడు సమ్ముఖ సమరమునఁ జచ్చి నిజదేహమును విసర్జించి యమలోకధామమునందుఁ జేరుకొనెను

## ౧౪

### కాఫరుసారీ

అజ్మల్ ఖాను పాఱిపోయి పాఱిపోయి యొకసారి వెనుకకు తల త్రిప్పి చూచెను వానిని దరుముకొని కేవలమొక్క యాశ్వికుఁడు మాత్రమే వచ్చుచున్నాడని యతఁడు కనిపెట్టెను. ఇదివఱ కొకసారి పాఱిపోయి తనయముల్య ప్రాణమును రక్షించుకొనిన మాట ఖాన్ సాహేబు జ్ఞాపకముంచుకొన్నాఁడు కాని యాశ్వికుని మోమునుఁ జూచి నప్పుడు వాని మనస్సులో కొంచె మాశపుట్టినది. ఆశ్వికుఁడు బాలకునివలె నుండిని కంటికగపడెను బాలకునితోఁ బోరాడుట వాని కొక గొప్పలోని పని కాదు. అది విశేషభయముతో కూడిన విషయముగా వాఁడెంచుకొనలేదు అంతేకాదు, ఆబాలకునికి సహాయపడు వారును ఏవైపునుండియు నెవ్వరును వచ్చుచున్నట్లు కనఁబడుటలేదు. ఆసంగతియు ఖాన్ సాహేబు నలువైపులను జక్కగాఁ జూచి స్పష్టము చేసుకొనెను. అట్లు చూచుచుండగనే బాలకుఁడును

దగ్గఱకు వచ్చిన అఫ్జుల్‌ఖాను ధైర్యమవలంబించి,—‘ జాఫరు బాలకా! నాచేతిలో నిష్కారణముగఁ బ్రాణములు పోగొట్టుకొనుటకు వచ్చితివా?’ అనెను.

జాఫరు కొడుకు డిట్లు ప్రత్యుత్తరమిచ్చెను,—‘ మూర్ఖా! నేను బాలకుఁడనుగానురా, తిన్నగా కళ్లు పెట్టుకొని చూడుము నేను స్త్రీని.’ అట్లనుచు ఆ జాఫరు కొడుకు వేషమున నున్న వ్యక్తి తన తలపాగా నూడఁదీసి పాఱవేసెను. నీలమేఘమును బూర్ణచంద్రుని వాఁడిక్కి చంచల చిగురాధార మధ్యమునఁ గనిపించినట్టియ ముఖమండలంబు గాన్పించెను. విలాసకుమారి గర్జించెను,— దానవసేనాపతీ! నే నెవరినో యెరుఁగుదువా?’’

భయవిస్మయములతో నా భువనమోహిని సుందరాంగి రమణీమణి యొక్క ముఖమును జూచి దేవి యదియని నా వనితామణి విన్నవోయిన మోముతో వికృతస్వరమున నిట్లు ప్రత్యుత్తరమిచ్చెను,—‘ ఆహా! నీవు విక్రమసింహుని పుత్రికవుగావా?’’

వాఁడు నివ్వెఱపడి చూచుచుండ విలాసకుమారియొక్క చెంగున వానిజుట్టు నొక్కచేతితోఁ బట్టుకొని రెండవచేతితో ఖడ్గము నాడించుచు, ‘విక్రమసింహుని పుత్రిక నేఁడు పితృహంతకునిఁ దెగటార్చి వాని రక్తముతోఁ బితృతర్పణము సేయఁగలదు. చేతనైనయెడల రక్షించుకొనుము.’ అనెను.

అఫ్జుల్‌ఖాను వణకుచున్న చేతితో విలాసకుమారిమీఁదికి ఖడ్గమును విసరెను. కాని వాని ఖడ్గము విలాసకుమారి మెడపై పడకముందే వాని తెగినతల యామె చేతిలోఁ జిక్కెను. తదనంతరమొక ముహూర్తములో నాటి కేసరిసింహుని యుద్ధము సమాప్తమాయెను. హిందూవీరులు కన్నులెత్తి చూచునప్పటికి మహిషాసురమర్దని సింహవాహినియై దైత్యరుధిరలోహితయగు భీమకృపా

ణియై దానవుని భీషణభిన్నమస్తకమును హస్తమున ధరించి వచ్చుచున్నటుల నశ్వారోహియై శోణితసిక్తకళేబరయై లులాయిత కుంతలి విలాసకుమారి యెదుట ప్రత్యక్షమయ్యెను.

## ౧౬

### చిరసన్యాసము

మరుసటినాటి యుదయమున విజయపాలుఁడు అంబాలికను విలాస కుమారిని వెంటఁ దీసుకొని సేనాసమేతుఁడై మాతృమందిరమునకుఁ దిరిగివచ్చెను. కృషీవల సైనికుని తులలేని వీరత్వచరిత్ర నలువైపులఁ బ్రచారమాయెను. నేడు పర్వతదుర్గమున నీ నూనూగుమీసముల తరుణసైనికుని స్తోత్రపారములు తప్ప మఱియొక ప్రసంగమేలేదు. ప్రతివారును ఒక్కటేమాట. ఈ వీరుఁడెవ్వఁడు? వీని పూర్వోత్తర మెయ్యది? ఎచ్చటనుండి ఇంత వచ్చెను. ఎంతమందియో భంగు త్రాగి యుల్లాసముగాఁ గూర్చుండి యూహానందమయ తరంగముల నోలలాడుచు నీప్రశ్నల ననేకవిధముల నలియుగొట్టుచుండిరి.

ఒకానొకఁడు... వాఁడు పూర్వజన్మములో గొప్ప రాజవంశము నందు పుట్టియుండెను. ఎవరో బ్రాహ్మణుని శాపమున నీజన్మములో హీనకులమునందు పుట్టవలసి వచ్చినది.

మఱియొకఁడు.. అబ్బెబ్బే! మీరటుల చెప్పుట చాల దోషము! తిన్నగా తెలియకుండ నిషామీద నోటి కేదివచ్చిన నది చెప్పుట సరికాదు. దాని యథార్థము తెలియవలెననిన నామాట వినుఁడు. ఆరోజున నేనాకు తెలిసినది ఏరోజున విజయపాలునోడించి కొండపై నుండి జెండాపట్టుకొని దిగెనో ఆరోజునే నేననుకున్నాను. వాడు

మనిషి కాడు బ్రహ్మరాక్షసి. కృషీవలుడుగా మనలోనికివచ్చి మాయ చేసి పోయెను.

ఈ మాటలు విని యొక వృద్ధమార్వాడీ గడ్డము దువ్వుచు పట్టలేని నవ్వునవ్వుచు నిట్లనెను?...'మీరందఱు కుఱ్ఱవాండ్రు. మీకేమియు దెలియదు నేను ముసలిఫకీరు నడిగి వీనిగూర్చి వర్తమానము తెలిసికొన్నాను ఫకీరొకనాడు స్వర్గములో నింద్రుడు దగ్గఱకు వెళ్లి ఔరంగజేబును వధించుటకు సహాయమిమ్మని ప్రార్థించెను. అందుకా ఇంద్రదేవుడు తన సేనాధిపతియగు కుమారస్వామి నిరూపమున పంపించెను. ఈత డీశ్వరపుత్రుండుగాని మానవమాత్రుడు గాడు.'

విలాసకుమారి ముగ్ధరమణీజనుల నందఱి నొక్కచోటంబోగు చేసి వారికి కృషీవలయువకుని వీరత్వకథ లొక్కటొకటిగాం జెప్పుచుండెను. కేవల మొక్క వీరుని ఖడ్గముచే వందలకొలది మ్లేచ్ఛులెట్లు హతమైరో అరావలీయుపత్యక మెట్లు నెత్తురుతో రొంపియైనదో, వాని యనుపమాన వీరత్వముచేతను యలౌకిక సాహసముచేతను యవనుల చెఱనుండి అంబరరాజకుమారి యెట్లు తప్పించుకొన్నదో యామె వర్ణించుచున్నది.

విలాసకుమారి—'ఇట్టి వీరుండు ఎప్పుడైన కృషీవలులందు గంటిమా? ఈమాతృమందిరమున కింతమంది రాజస్థాన రాజవంశ సంభూత వీరపురుషులు జన్మభూమికి సేవ సేయుటకు వచ్చియుండిరి. వీరిలో నెవ్వరుగాని కులశీలములు లేనట్టియు నీచవంశజుండైనట్టియు కృషీవల యువకునితో తులందూగంగలవా రున్నారా?

అట్లు పలుకుచు విలాసకుమారి దుఃఖితయగుచు మహారాణి యరుంధతీదేవి దిక్కుచూచుచు,—'కాని ఇందు దుఃఖితమమగు విషయ మొకటున్నది. ఇచ్చట నటువంటి వీరయువకునికి తగిన బహుమానము జరుగలేదు. ఆవిషయ మట్లుంచుడు. అతనికి చివ

ఉకు తగిన గౌరవమైన నెవ్వరును జేయుటలేదు.' అనెను.

మహారాణి—విలాసకుమారి! కృషీవలసైనికుఁ డిప్పు డెక్కడున్నాడో నీకు తెలియునా!

విలాసకుమారి చిరునవ్వుతో నంబాలికవంకఁ దిరిగి రెప్పవాల్పక చూచుచు నిట్లనెను—' ఈ కోటలో నాతని కుండుట కవకాశము లేదు. అందుచే నాతడు మార్గమధ్యమునుండియే కాలాపహాడుయొద్ద సెలవుపుచ్చుకొని ఎచ్చటికో వెడలిపోయినాడు వెళ్లునపుడు కాలాపహాడు వానితో రహస్యముగా నేమేమియో మాటలాడినాడు ఆయన నడిగిన మీకన్నియుఁ దెలియగలవు.''

మహారాణి విజయపాలునిఁ బిలుచుకొనిరమ్మని దాసీ నాజ్ఞాపించెను. ఆతఁడు దూరమునుండి స్త్రీలందఱు నొక్కచోటఁ గూడి యుండుటనుగాంచి వారందఱును తనను సంకెళ్లఁ గట్టదలంచుకొనిరేమో యని కొంచెము సంశయించి తరువాత మహారాణీ యుండుటనుగాంచి ధైర్య మవలంబించి వారిని చేరఁజనెను.

కాలాపహాడు వచ్చినంత మహారాణి యిట్లడిగెను,—ఆకృషీవల సైనికుఁ డెచ్చటున్నాడు?

కాలా—ఆతఁడు త్రోవలోనే సెలవుఁదీసుకొని యెక్కడే వెడలిపోయెను.

మహా— ఆతఁ డెవ్వరో మీరు కనుక్కొనలేదా!

కాలా—ఆయ నెన్నిసారులో యడిగినమీదట తనకు మేవాడు దేశములో తన తల్లి గొప్ప దుఃఖములో నున్నదనియుఁ దానామెయొద్ద రెండువత్సరములు దేశాటనము సేసివచ్చుటకు సెలవుగైకొంటి ననియు నా యవధి నిన్నటితో పూర్తియైనదనియు చెప్పినాడు అందుచేతనే బహుశః ఆతఁ డిచ్చటకు రాకుండగనే మేవాడు వెళ్లిపోయినాడని తలంచెదను.

మహారాణి—మీరుకూడా మహారాణా జయసింహునిఁ గలిసికొనుట కుదయపూరు పోయెదరా? అచ్చటకుపోయి యాపిల్లవాని సమాచారము తెలిసికొనిరండు.

విజయపాలుడు అంబాలికదిక్కు చూచుచు నవ్వుచు నిట్లనెను,—'నేనువానిని నావెంట నిచ్చటకు తీసుకొనివత్తును. అంబర రాజకుమార్తెచే నిప్పించుట కొక జయమాలను సిద్ధము సేయింపుడు.'

విజయపాలు డట్లు చెప్పి పకపకనవ్వుచు వెడలిపోయెను. అంబాలికయు మఱియొకవైపు వెడలిపోయెను. అరుంధతీదేవి యచ్చటి స్త్రీజనముతో నిట్లనెను,—'మీరంద ఱొక్కసారి యంతఃపురమునకు దయసేయుడు. విలాసకుమారితో నేనుకొన్ని రహస్యములు మాటలాడవలెను.

స్త్రీలందఱును వెడలిపోయిరి. మహారాణి విలాసకుమారితో నిట్లు సంభాషణమారంభించెను,—'అమరసింహుని సంగతి ఇంతవఱ కిక్కడెవ్వరికిని తెలియదు. కుమారవిజయపాలుఁడు ఇంతవఱకు నిజముగా నతఁడు కృషీవలబాలకుఁడనియే అనుకొనుచున్నాఁడు. కాని ఇఁక నాతని యజ్ఞాతవాసకాల మాఖరైనందున నాతని సంగతి వెల్లడిచేసినందువలన నష్టమేమియును లేదని తలంచెదను.

విలాస—రాణీజీ! ఇంక కొంచెము దినము లాగుడు అంబాలిక తీర్థయాత్రకు నాథద్వారము పోవలెనని సిద్ధపడి మీ యాజ్ఞ కెదురు చూచుచున్నది.

రాణి—నాకర్థమగుటలేదు. నాథద్వారమున సన్యాసాశ్రమమునకుపోవలెనని యామె కెందు కంత యాతురత?

విలాస—చెప్పెదను వినుడు. ఆమె కృషీవలసైనికునకు మనస్సులో నాత్మసమర్పణఁ గావించినటుల మీ రెరుగుదురుకదా. కాని యట్టి నీచకుల సంభవుడైన వానితో వివాహ మగుట ఈ జన్మలో

నసంభవముకదా. ఆతఁడు మేవాడ రాజకుమారుఁడని యామె ఇంతవఱ కెరుఁగదుగదా. అట్టియెడ నామె నాథద్వారము పోయి చిరసన్యాసము తీసుకొని యావజ్జీవమును విష్ణుమందిరములో నివాస ముండవలెనని నిశ్చయము చేసుకొన్నది. అందుచే నేను మిమ్మును నన్నుఁ గూడ నామెతోఁ బంపుట కియ్యకొనవలసినదని వేడుకొను చున్నాను. మేము వెడలిపోయిన తరువాత మీరు కాలాపహాడును మహారాణి యొద్దకు కబురుపంపి అంబాలికను నిచ్చి మేవాడ రాజ కుమారునికి వివాహము చేయ నుద్యోగింపుడు. నాథద్వారములో నటుల వైభవముతో మేవాడ రాజకుమారునికిని అంబరరాజరాజకుమా రికిని కల్యాణమహోత్సవము గావింపుడు.''

రాణి—కృషీవల సైనికుని మారువేషము నింకను అంబాలికకు దాచిపెట్టవలెనని నీ కెందు కాలోచన ?

విలాస—రాణీజీ! వాని సంగతిని చివరవఱకు దాచిపెట్టి వివాహ ముకు కొంచెము ముం దామెకు చెప్పవలెనని నేను మనస్సులో స్థిరము చేసుకొన్నాను. బహుదినముల దుఃఖమునకు పిమ్మట సుఖంబు రీతిని అమావాస్యయొక్క ఘోరాంధకార రాత్రి పిమ్మట నరుణో దయంబుపగిదిని, అనేక దినముల విరహానంతరమున సమాగమంబును నారీజీవనమున కమలానంద మొసంగునుగదా. మఱియొక్కమాట. మహారాణీ! నాగురుదేవు డిట్లుపదేశించెను. 'గార్హస్థ్యాశ్రమమునను శిక్ష చాల యావశ్యకము. అంతేకాక నిన్నిదినముల పిమ్మట తా నింతవఱకు దరిద్రనీచవంశోద్భవుఁడని యెంచిన కృషీవలుఁడు రాజాధి రాజపుత్రుఁడని తెలిసికొనునప్పుడాసంగతి వివాహమున కెంతయో దూరమున జరుగఁగూడదు. ఆమె యానందము నవనవావిర్భావము నం దున్నపుడే శుభంబు జరుగవలెనని నా కోరిక—

రాణి—బిడ్డా! నీయిష్టము వచ్చినటులఁ గానిమ్ము. నీవు కొంత

మంది దాసదాసీజనమును వెంటఁ బెట్టుకొని అంబాలికను దీసుకొని నాథద్వారమునకు పొమ్ము. అనంతరమే నేను వివాహప్రస్తావము చేయుటకు విజయపాలుని యుదయపూరు మహారాణీ యొద్దకు పంపించెదను.

విలాస—నేనును అంబాలిక మాత్రమే సన్యాసాశ్రమమునకు పోయెదము. మా వెంట నొక్కదాసీయున్న మాకుఁ జాలును. జరిగిపోవును. వివాహానంతరము మీ అంబాలికకు లెక్కలేనంత మంది దాసదాసీ జనులు సేవజేయుట కుందురు.

ఆమాట కరాత్తుగ నరుంధతీదేవి కొక సంగతి యామె స్మృతి పటమునుండి వ్యక్తమయ్యెను. అంత నామె యులికిపడి విలాస కుమారి మొగము వంక నిశ్చలముగాఁ జూచి యిట్లడిగెను,—‘నా మనస్సులో చాల దినములనుండి యొక సంశయమున్నది. అది యడుగవలెనని అప్పుడప్పు డనుకొనెదను. కాని సమయము దొరక లేదు. ఇప్పుడది జ్ఞాపకము వచ్చినది. నేను వినియున్నాను,—రాణా జయసింహుని కుమారుఁ డమరసింహునకు సోలంకి సేనాపతి విక్రమ సింహుని పుత్రిక దేవయాని నిచ్చి వివాహము జరిగెనట. నా కిప్పుడు జ్ఞాపకము వచ్చినది నీవే యా దేవయానివి. నీవే అమరుని భార్యవు. నీకే యింకొక పేరు విలాసకుమారియని యున్నది. ఫకీరుని మందిరమున నేను నిన్నుఁ గలిసికొన్నప్పుడు నిన్నా సంగతి యడిగితిని. కాని ఈ మాట పూర్తిగ నబద్ధమని నీవు చెప్పితివి. ఆ సమయమున నీవు నీ సంగతిని దాచిపెట్టితివని నా విశ్వాసము. ఇప్పుడు నీవు స్పష్టముగా నాతోఁ జెప్పివేయుము. నీ వా దేవయానివేనా? అనగా అమరుని భార్యవేనా? కాదా?

వెంటనే విలాసకుమారి యొక్క విశాలనేత్రములనుండి నీళ్ళు కాలువలుగాఁ బారఁజొచ్చెను. ఆమె చేతులు జోడించుకొని వణకుచు నిట్లు

చెప్పెను,—' రాణీజీ ! నా తప్పుల సైరింపుడు. నేను మీతో బొంకి
తిని. మీ అనుమానము పూర్తిగ సత్యము. నేనే యా మంద భాగ్యు
రాలు దేవయానిని. నాతోడనే చిన్నతనమున మేవాడ రాజకుమా
రునికి వివాహమయ్యెను. మంచిది. వినుడు. మీతో యదార్థము
మనవి చేయుచున్నాను.

పిమ్మట విలాసకుమారి తన వివాహమైనప్పటినుండియు నింతవఱకు
జరిగినసంగతులన్నియుఁ బూసగ్రుచ్చినటులఁ జెప్పివేసెను.

మహారాణి—' విలాసా ! బిడ్డ ! ఇట్టి స్థితిలోనమరుకిచ్చి అంబాలి
కను వివాహము సేయుటకు నే నెన్నఁడంగీకరించను. నిన్ను జయపుర
మున రాజాంతఃపురమున కమరుఁడు తీసుకొనిపోవునట్లు నేను ప్రయ
త్నము సేయుదును.''

విలాసకుమారి రోదనము సేయుచు మరల నిట్లనెను,—రాణీజీ !
మీ రెందుకట్లు సెలవిచ్చెదరు ? మీ రెందుకట్టి నిష్ఠురవాక్యము
లాడి నా మనసు నొప్పించెదరు ? ఈ వివాహము కాకుండిన మీ అంబా
లిక హృదయము యావజ్జీవము తుషానలమున దగ్ధమగుచుండును !
మీ మేవాడరాజకుమారుఁడు యావజ్జీవము దుఃఖతాపమునఁ బొక్కు
చుండును. వారిద్దఱసుఖము నెల్లవారికిని గావలసినది. కావున మీ
రెందు కట్టిమాటలాడెదరు ?

మహారాణి—అంబాలికయం దెట్టి ప్రేమయో నీ యందును నా
కట్టి ప్రేమయే. నీ వసురసింహుని ధర్మపత్నివి. నీ పతిని నీ మేవాడ
సింహాసనమును నిన్నుండి నే నెట్లులాగుకొని అంబాలిక కొప్పగింపఁ
గలను ?

విలాస—రాణీజీ ! నే నీశ్వరసాక్షిగఁ జెప్పుచున్నాను. ఈ వివాహ
మగుటచే నే నానంద నిమగ్ననగుదును. అట్లు కానియెడల నేను
యావజ్జీవమును విషాదసాగరమునఁ గొట్టుకొనుచుందును. నేను రాజ

పుత్రస్త్రీనని తమరెరుంగరా? నేను పవిత్రక్షత్రియవంశమున నుద్భవించితిని. నాస్వామియు నాతఁడు వరించిన అంబాలికయు సుఖించుటయే దాసియగు నీ చిరమంద భాగ్యురాలి సుఖము. అందుకు సందేహములేదు.''

అరుంధతీదేవి కొంత తడవూరకుండి యటుపిమ్మట విలాస కుమారినాలింగనము సేసికొనియొక్క నిట్టూర్పువుచ్చి యిట్లనెను,—'బిడ్డా! ఇన్నిదినములకు నీవు గారీహూప గున దేవమూర్తివని గ్రహింపఁ గల్గితిని.''

---

# తృతీయ ఖండము

## ౧

### కాలాపహాడుని ప్రస్తావము

మహారాణా జయసింహవల్లభుఁడు తన విశ్రామగృహమందు కూర్చుని యుండెను. ఎదుట చంద్రకాంత శిలావేదికపై విజయపాలుఁడు కూర్చుండెను. విజయపాలుడు దూరపువరుసను జయసింహునికి బావమరిది. రాణా యిట్లు చెప్పుచుండెను,—'కాలాపహాన్! నీమాట బాగుగానే యున్నది. కాని ఒక సారి వివాహము చేసితిమి. అది తిన్నగా పూర్తి కానిదే మఱియొకటి తలపెట్టుట శాస్త్ర సమ్మతము కాదు.'

విజయపాలుఁడు నవ్వుచు నిట్లు ప్రత్యుత్తర మిచ్చెను,—'కాలాపహాడుని తప్పు మన్నింతురేని యొక్క ప్రశ్న నడిగెదను.'

విజయ—ఏమి? అడుగవచ్చును.

కాలా——మహారాణావారి కెప్పటినుండి శాస్త్రములపై నింత ప్రగాఢభక్తి యుదయించినది? నాకుఁగొంచెము దయచేసి సెలవిండు.

విజయ——నీ యభిప్రాయమేమి?

కాలా——దేవీ కర్ణావతి యిష్టము లేకపోయినను కమలాదేవిని బుజముపై నెక్కించుకొనుట కెట్లు శాస్త్ర మంగీకరించినది? కుమారునిపై కోపించి ఏడుసంవత్సరము లజ్ఞాతవాసమున నుండి కమలాదేవిని తప్ప మఱియెవ్వరిని మనుష్యులను జూడకుండ నుండుటెట్లు శాస్త్రసమ్మతము? ముసల్మానులతో రాజపుత్రులకు ఘోరయుద్ధము వాటిల్లిజరుగుచుండ జయసముద్రతీరమునకు పాఱిపోయి కమలాదేవిపైట చెరంగున దాగుకొనుట కేశాస్త్ర మొప్పునది? ఈ సమస్తయద్భుత శాస్త్రములకును తమకు పురోహితులు కమలాదేవిగారేనా? వారిని గూడ నొక్కసారి రప్పించుడి యడిగి తెలిసికొందును.

గదికి రెండవవైపు నుండి యెవ్వరో,——'అక్కారమ్మా. భయమేమి! నేదగ్గఱే యుందును' అని వినవచ్చెను.

విజయపాలుఁడా మాటలు విని,——'అదుగో మీ పురోహితురాలుఁ వచ్చుచున్నది. ఆమె అమరసింహుని విషయమున నాతోనేమి చెప్పఁగలదో తరువాత తెలిసికొందును. ఇప్పుడామె చెప్పు మాటలు నేను చాటున నుండి వింటును.' అని ప్రత్యుత్తరమునకు నిరీక్షించకుండగనే బయటకు వెడలిపోయెను.

కమలాదేవి మహారాణి కర్ణావతి యొక్క చేయి పట్టుకొని మహారాణావారి దగ్గఱకు తీసుకొనివచ్చి యిట్లనెను,——'మహారాజా! మన కేమియుఁ దెలియలేదు. ఈమధ్య నింత గ్రంథము జరిగినది. అక్కా! చెప్పు. ఏల మాటలాడవు?

మహారాణా——దేవీ! నేను విజయపాలుని యొద్దనుండి అన్నిసంగతులును విన్నాను.

అభిమానిని రాణీ కమలాదేవి ఇట్లు పలికెను,—'ఆ మాట విన్నారు. బాగానే యున్నది. తమ రందు కే యుపాయము నాలోచించినారో సెలవిండు.

మహారాజా—ఉపాయము దేనింగూర్చి చెప్పుచున్నావు?

కమలా—ఉపాయము దేనింగూర్చియా? తమ కింకను బోధపడ లేదా? అట్లులైన వినుడు అక్కా! మీ రనేక సారులు చెప్పియున్నారు. మనస్సు ముం దెట్లులున్నదో ఇప్పుడును పెద్దవయసు వచ్చినను అట్లులనే యున్నది. మహారాజా! తమకు హృదయమున కొంచెము కూడ నభిమానము లేదా? నా బిడ్డ రెండు వత్సరములు చాల కష్ట మనుభవించి యున్నాడు. ఇన్ని దినములైన తరువాతను ఇంత వెదకులాలమీదను వెలలేని రత్నము దొరకినను నా బిడ్డ యొక్క కోరికను నెరవేర్చుటకు మీ రిచ్ఛగింపరా? అక్క చెప్పిన మాట సత్యము. విధాత పురుషుల హృదయమును రాతితోఁ జేయు నట. ఏమైనను సరే. నేను తమకుఁ సాఫుగ విప్పి చెప్పుచున్నాను. ఎంత శీఘ్రముగ వీలయిన నంత శీఘ్రముగ సంజరరాజకుమారి నంబాలిక నిచ్చి యమరునకు వివాహము సేయింపుడు.

మహారాజా—నీ విదివఱకు బహుళః చెప్పియున్నావని తలంచెదను. ఒక వివాహము సంపూర్ణము కాకుండ మఱియొక వివాహము సేయవచ్చునా?

కమలా—అది నా అపరాధమయినది. నేనే బలవంతముగా విక్రమసింహుని దెచ్చి అమరునికి వివాహము చేయించితిని నేనొక తెలివితక్కువ దానను. నా కప్పుడేమి తెలియును, జయపూరు రాజ కుమార్తె జయసముద్రతీరమున నమరుని కంటఁ బడినదని—అయ్యో! ఇప్పు డేమనుకొన్న నేమిలాభము? నేను బలాత్కారముగా మిమ్ము జయసముద్రప్రమోదభవనమునకు తీసుకొని రాకపోయిన నా కుమా

రుఁడు కృషీవలవేషమున నొక్కఁడును ముసల్మానులతోఁ బోరాడ నరుగునా ?

ఈ మాటలు చెప్పుచున్నపుడు కమలాదేవి కండ్లు బాష్పపూర్ణము లయ్యెను. ఆమె అట్లు కన్నీరు వరదలుగఁ గార్చుచు చెప్పసాగెను,— ‘జరుగవలసిన దంతయు జరిగినది. అక్కగారు నా యపరాధముల నెల్ల క్షమించినది. ఇప్పుడు కరుణింపుడు. మహారాజా ! నాథా ! నా యొక్కయు అక్కగారియొక్కయు కోరికను నెరవేర్పుడు. అమరుని మనస్సు, కొంచెము స్థిరము కాగానే నాతఁడె స్వయముగ విలాస కుమారి నింటికి దీసుకొని రాఁగలఁడు. అక్కా ఏమందువు ?’’

మహారాణా—కర్ణావతి దెస నేకాగ్రదృష్టితోఁ గొంతసేపు చూచి యిట్లనియె,—‘ప్రేయసీ ! నీకు కూడ నట్లు సమ్మతమేనా ? జయపూరు రాజకన్య నిచ్చి అమరునికి తిరిగి వివాహము సేయు మందువా ?

రాణీ కర్ణావతి యొక్కసారి కమలాదేవివంక జూచి మందస్మిత యగుచు నిట్లు ప్రత్యుత్తర మిచ్చెను,—‘మహారాజా, ఒక ధర్మపత్ని యుండగా సతియొకరిని వివాహమాడుట రాజవంశమునందు క్రొత్త యాచారము కాదు. తమరును ఈ యాచారమును దురాచారముగాఁ బరిగణింపలేదు.’

మహారాణా కొంచెము లజ్జితుఁడై గంభీరతాపూర్వకముగ నిట్లు జవా బిచ్చెను,—‘మీ కందఱకును సమ్మతమైన విషయములోనే నన్యథా యోచించుట సమంజసము కాదు.’

కమలాదేవి—చెల్లెలా ! నీ యభీష్టము నంతను మహారాజుగారికి నిరవశేషముగాఁ దెలియఁ జేయుము.

రాణా—ఇంక దాచి యుంచనేల ? నీ మనోరథము లించుకయు దాపక చెప్పివేయుము.

కమలా—మహారాజా! నా మాటను మన్నించువా రెవరు? మన్ననలేనిమాట బయట పెట్టకూడ దందురు. నామాట నాదరింతు రని బాస చేసినగాని నేను చెప్పను.

రాణా—ఇంతవఱకు నీమాట కెవ్వరైన నెదురుచెప్పఁ గలిగినవా రున్నారా?

కమలా—మహారాజా! నా యభీష్ట మొఱఁగింపనా? అమరుని వివాహ మంత ధూంధాంగాఁ జేయువలెను. ఇదివఱ కట్టి యుత్సవ మీ రాజపుత్రస్థానములో కనివిని యుండనట్లుండవలెను. నాకారణమున నా అమరుఁడు దీన హీనకృషీవలుఁడై యపనయుద్ధమున కరుగవలసి వచ్చెను. ఆమాటఁ దలఁచుకొనిన నా కెక్కుడలేని దుఃఖ మగుచున్నది. వాని వివాహము నాముచ్చటతీరునట్లుజరిగినగాని నాదుఃఖము చల్లారదు. మహారాజా! నా మనవి చిత్తగింపుడు ఒక్క టొకటే నా కోరికలను మీకు విన్నవించెదను. రాజపుత్రస్థానములో సమస్తరాజుల నాహ్వానింపవలెను

మహారాణా—మంచిది, పిమ్మట?

కమలా—పిమ్మట అయిదువందల ఏనుగులను పదివేల గుఱ్ఱములను రౌతులతో సహా ఊరేగింపున నుంచవలెను. మా పుట్టినింటినుండి 'దిగ్గజ' మను మదపుటేనుగును 'వానవదమన్' అనుగుఱ్ఱమును దెప్పించవలెను. మహారాజా! ఇంకను ఉన్నవి నా వేడుకలు ఈ యేనుగులకును గుఱ్ఱములకును ముత్యముల సాలలును రత్నహారములును దొడుగవలెను.

రాణా—కమలా! మసల్మానుల పాదాక్రాంతములైన ఈ రాజస్థానమున ఏనుగులును, గుఱ్ఱములును దప్ప యింకేమి సంపత్తుగలదు. ఏనుగులకును గుఱ్ఱములకును గొదువలేదు. కాని ఇన్నిటికిని రత్నహారములును ముత్యముల హారములును ఎచ్చటనుండి తేఁగలము?

కమలాదేవి అభిమానపూర్వకముగ లేచి నిలువఁబడి యిట్లుపలికెను, 'ఏమంటిరి? మహారాజా! ఎక్కడనుండి తేఁగలమా? ఇందుచేతనే నే నెప్పుడును ఏమియు నడుగను.

మహారాణి కర్ణావతి కమలాదేవిచేయి బట్టుకొని మెల్ల మెల్లగా నామె చెవిలో నేమియో చెప్పెను. అంత కమలాదేవి మరల మహారాణావారి యొద్దకు వెళ్ళి కూర్చుండి నగవులొలుక నిట్టులనెను, — 'అక్కా సత్యము చెప్పితిని. ఎక్కువ కోరికలు కోరిన లాభములేదు. పోనిండు. మహారాజా! మా పుట్టినుండి 'దిగ్గజము' ను 'దానవదమనము' ను రాఁగలవు. వానికి మాత్రము ముత్యముల మాలలును రత్నముల హారములును సంపాదింపఁగలరా?

మహారాణా—అవశ్య మట్లనే నేతము.

కమలా—నాథద్వారమందిరముయొక్క శిఖరమునకు బంగారు తొడుగు వేయించవలెను అమరునికి మహామూల్యవంతమగు రత్నముల హారాలతోడను శోభితపరిచ్ఛదములతోడను అలంకరించి వివాహమండపమునకు తీసుకొని పోవలెను. ఇంకొక్కమాట, మహారాజా! చాలదినములకు నాకొక్కమాట జ్ఞాపకమువచ్చినది. మీరు శ్రద్ధగా విందుమనిన చెప్పెదను

మహారాణా—ఏమి చెప్పెదవో చెప్పరాదా?

కమలా—ఆ సంగతి మీ యొద్దనుండియే చాల దినములనుండి వినుచున్నాను. ఈజగత్తున దుర్లభమైన రత్నము కోహినూరుపూర్వము మాపితృవంశీయులైన పరమారరాజుల పాగలయందు శోభిల్లుచుండెడి దట. అది నేఁడు ఔరంగజేబు దగ్గఱనున్నదట. దానిని మీరు యవనుల వశమునుండి తిరిగి సంపాదింపఁగలరా! మహారాజా! నాకు చాల పెద్దకోరిక యున్నది. మీ రాకోహినూరునుజయించి సంపాదింపఁగల్గిన యెడల నే నాదినమున పెండ్లికొడుకు తలపాగాపై నలంకరించెదను.

రాణావారు జవాబేమియు నియ్యలేక నిట్టూర్పు దీసికొనెను. మరల కర్ణావతి కమలాదేవి చెవిలో నేమియో యూదెను. పిమ్మట కమలాదేవి మరల చెప్పనారంభించెను,—'అది అసంభవమని నాకును దెలియును కాని కల్యాణమహోత్సవసమయమున నేను'కోహినూరు'ను దెచ్చి అమరునకు శిరమున నలంకరించ గల్గినచో నా ముచ్చట పూర్తియగును. మహారాణీ! మంచిది. కాలాపహాడు ఇంత వఱకు తమతో నేమి మనవిచేయుచుండెను?

గది వెలుపలనుండి యెవ్వరో నవ్వుచు దీనికిట్లు ప్రత్యుత్తర మిచ్చెను—'కాలాపహాడు పూర్తిగ నిందుకు తగిన ప్రమాణమును గోరుచున్నాడు, అమరసింహుడు నిజముగా మహారాణావారి పుత్రుడేనా లేక యే కృషీవలుని బిడ్డయైనా ఇట్లు నటించుచున్నాడా? '

౨

ఇద్దఱు సన్యాసులు

నాథద్వారముయొక్క రాధాశ్యాముని మందిరము కురంగట లూనా నదీతీరమున నిద్దఱు సన్యాసినులు నిలుచుండి యున్నారు. ఈయిద్దఱును సమానసౌందర్యముగలవారు. ఇద్దఱును యౌవనమునం దున్నారు. ఇద్దఱును సమానవయస్కులు. కాని యిద్దఱివేషములును భిన్నముగా నున్నవి. ఇద్దఱిను మోములు విమర్శించి చూచినయెడల వారి మనోభావములు పూర్తిగ భిన్నములని తెలియవచ్చును. ఒక్కసతి విన్నవదనముతో దుఃఖప్రవాహములోదిగి అస్తమిత సూర్యునిఁ దిలకించుచున్నది. రెండవసతి యుజ్వలనేత్రములతో తన చెలికత్తె మోమువంకఁ జూచుచు గీతమును బాడుచున్నది. ఈ రమణీమణి

సన్న్యాసాశ్రమమునందుఁ దక్క మఱి యెచ్చటనైనఁ గాంచి రేని యెవ్వరును సన్న్యాసినియని యనుకొనరు. ఆమె సన్నని కాషాయాంబరములో నుండి ఆకుపచ్చని రవికె చక్కగా వెల్లడి యగుచుండెను. ఆమె కాటుక మెఱుంగు లీను సుందరకచభారము వీపునఁ జరుతరగల శోభిల్లు కలమహాస్రవంతియో యన నొప్పుచుండెను వక్షఃప్రదేశమునను బాహులతాసీమలందును పుష్పదామములు వర్తిల్లుచుండెను. ఆమె బింబాధరంబున దాంబూలరాగము జంకులేక నొరయుచుండెను. సన్న్యాసాశ్రమమున నిట్టి విలాసములు నిషేధమైనను ఈ సుందరి యేలనో వానిని పరిత్యజింపలేదు. బహుశః ఈమె బలాత్కారముగ సన్న్యాసాశ్రమమున గొంతకాలము శరణు జొచ్చవలసి వచ్చినదేమో, పాఠకులారా! మీరు గ్రహించియే యుందురు. కాని ఈమె చెలికత్తె నిజముగా సన్న్యాసిని. సందేహము లేదు. ఆమె సుకుమార శరీరము గైరికవస్త్రములను దాల్చి శోభిల్లుచున్నది. ఆమె కేశగుచ్ఛము సగము ముడివడి సగము జారిపోవుచు ధూళిధూసరితమై యున్నది. ఆమె చంద్రమండలసదృశంబగు మోము విభూతి రేఖలతో వెలవెలఁబోవుచున్నది. ఎంత దుఃఖ మెంత దుఃఖము? ఈ సుకుమార దేహమున కెంత కఠినయోగము సంప్రాప్తమయ్యెను! విధాత యీ నవీనతపస్విని నెందు కిట్టి బంగారు బొమ్మగాఁ జేసి యిట్టి యిక్కట్టుల కొప్పగించెను?

విలాస—రాజనందినీ! నేను ఉదయపురమునుండి నీ కొక శుభవర్తమానము వచ్చెను.

అంబాలిక యొక నిట్టూర్పు పుచ్చి,—'అక్కా' నాకేమి శుభవర్తమానము!' అని యడిగెను.

విలాసకుమారి కొంచెము డగ్గుత్తికతో తనలో తాను పరధ్యానముతో నిట్లు పలుక నారంభించెను,—'నీకొఱకు శుభవర్తమానమా

నాకొఱకు శుభవర్తమానమా? నాకే శుభవర్తమానము! కాదు కాదు, నీకే! మేవాడ రాజకుమారా అయ్యో ఎంత దుఃఖము! నీ కొఱకే! ఈ శుభవర్తమానము నీకొఱకా నాకొఱకా

అంబాలిక విలాసకుమారివంకఁ జూచి ఆశ్చర్యపడుచు నిట్లుపలుక సాగెను,—'ఇదేమి' విలాసకుమారీ! నీ వేమి చెప్పుచుంటివి? నీ మాటలు నా కేమియు నర్థమగుటలేదు. నామీఁద నీ కేమైనఁ గోపము వచ్చినదా?

విలాసకుమారి అంబాలిక మాటలకు జవాబు చెప్పక నేలమీఁద నున్న తన వీణనెత్తుకొని వాయింప మొదలుపెట్టెను. కొంచెముసే పట్లు వీణ వాయించి వీణస్వరముతో తన కంఠమును గలిపి యొక గీతమును బాడఁ దొడగెను.

గీతము పూర్తియైన పిదప నామె కొంచెము సేపటి అవమానమును వహించి తన, వక్షమునఁ జేతులుంచుకొని తనలో తాఁనిట్లను కొన మొదలిడెను,—'గురుదేవా? ఎంతకష్టము! ఇన్నిదినములకు గదా మీరీవిషవృక్షమున నమృతము బుట్టించితిరి?

విలాసకుమారి అంబాలిక దెస, గనుఁగొని యిట్లనియె,—'సఖి! కొన్నిదినములక్రిందట చెప్పలేదా నా కొక కఠినమైన గుండెరోగ మున్నదని. నీకు జ్ఞాపకంలేదా? మధ్యమధ్య నా రొమ్ములో నేదియో మంట కనఁబడును. కాని యది విశేషకాలముండదు. ఇదుగో చూడు నారోగము తగ్గిపోయినది. సఖి! ప్రియసఖి!' అని అంబాలిక కంఠమును గౌగలించుకొని 'నిన్నొకమాట యడుగవలెనని యున్నది. సరిగా జవాబు చెప్పెదవా?' అని యడిగెను

అంబా—సఖి, ఏమి టామాట?

విలాస—విను, చెప్పెదను, నీవు వరించినవాడు నిన్ను వివాహము చేసుకొనె ననుకొనుము. వివాహానంతరము నీపతి నిన్ను విడిచి యన్య

స్త్రీని ప్రేమించు ననుకొనుము. అట్టియెడ నీవేమి చేసెదవు? సఖీ, చెప్పు. మాటలాడ వేమి?

అంబా—ఏమి చేయుదు నందువా?

విలాస—ఔను ఏమి చేయుదువు? సఖి చెప్పు. వెంటనే చెప్పు. చెప్పవా యేమి?

అంబాలిక నవ్వుచు నిట్లనెను,—అటుల జరిగినయెడల, నేనాత్మ హత్య చేసుకొందును. పిమ్మట దయ్యమై వాని బట్టుకొని పీల్చుకొని తిందును. చెప్పితిని వింటివా?

విలాస—నా కట్లు సంప్రాప్తమైన నే నేమి చేయుదునో చెప్పుదునా? ఏమి చేయుదును? చెప్పనా? వినెదవా?

అంబా—సఖీ, చెప్పు.

విలాస—నేను వానిని వాని ప్రేయసిని నా సపత్నినిఁగూడ నా ప్రాణముకంటె నెక్కువగాఁ జూచుట కభ్యాసము సేయుదును. హృదయమును గుంచుకమున నుంచుకొన నేర్చుకొందును. వారితో నా ప్రాణము నైక్యముచేసెదను. నేను నిన్నెంత ప్రేమింతునో యంత కంటె నెక్కువ ప్రేమించుట కభ్యాసము సేయుదును. నా స్వామి యామెను ప్రేమించిన నే నాయన నన్నుఁ బ్రేమించినట్లుగనే యెంచుకొందును. నన్నే యాదరించినట్లు తలంతును నాస్వామి యామె నెప్పు డాదరముతోఁ గౌగలించునో అప్పుడు న న్నాదరించి కౌగలించినట్లుగానెంతును. ఆయనామెను ముద్దాడినప్పుడు నన్ను ముద్దాడినట్లుగానే భావింతును. నామాటలు బహుశః నీకు రుచింపవు. కొంచె మాలోచించి తెలిసికొనుము. తెలిసికొనఁగలవా? మంచిది ఎందుకు లెమ్మొకచిచ్చిమాటలు. నీవు వినఁగోరు శుభసమాచారములు వినిపించెదను విను. నీకు సన్యాసినీసాధన పూర్తియైనది. ఇఁకపద, నిన్ను మహారాణిని చేసెదను పద.

అంబాలిక—నీ నవ్వులాట లింకను సమాప్తము కాలేదా?

విలాస—నవ్వులు కాదు. సఖీ! ఇన్ని దినములవఱకు నీకు చెప్ప లేదు నేడు నీకు చెప్పఁబూనుకొన్నాను. మనము కొండదుర్గమునుండి వచ్చిన రోజుననే విజయపాలుఁడు మహారాణా జయసింహునియొద్దకు వెళ్ళియుండెను. ఆ మాట నీవు మఱచితివా? ఎందుకు వెళ్ళినాడో నీకు తెలియునా?

అంబా—నీమాటలు నాకేమియు దాత్పర్య మగుట లేదు

విలాసకుమారి నవ్వుచు నిట్లనెను—'మంచిది' అట్లైనఁ జెప్పెదను వినుము. మహారాణీ అరుంధతీదేవి మహారాణా జయసింహుని పుత్రుఁడగు కుమార అమరసింహునికి నిచ్చి వివాహము సేయుటకు మాటలాడుమని విజయపాలుని [illegible] పంపించెను. నిన్న రాత్రి విజయపాలుని యొద్దనుండి నాకొక యుత్తరము వచ్చినది. అది యొక్కింత చదివి చూచుకొనుము. అంతయు తాత్పర్యమగును.

అంబాలిక దుఃఖముచే నొక్కి నిట్టూర్పు పుచ్చి యిట్లనెను,—'సఖీ! నేను యావజ్జీవమును రాధాశ్యాముని చరణముల కన్నియు నర్పణ చేసివేసితిని. ఈ మాటలన్నియు నాతో నెందుకు ప్రసంగించెదవు?'

విలాస—ఇన్ని దినములనుండి సన్యాసినివై యుంటివి! కాని నీ వెవరిని మఱచుటకు రాధాశ్యాముని చరణములలో నీ యాత్మసమర్పణ నేసియుంటివో యట్టివాని ప్రేమ నావిస్మృతి యింతవఱకు నీ హృదయమునుండి యే మాత్రమును తొలగలేదు

అంబా—సఖీ! నీకు తెలియదు. ఆ ప్రేమ రాధానాథుని అనంత ప్రేమయందు సమ్మిళితమైపోయెను.

విలాసకుమారి నవ్వుచు నిట్లుజవాబుచెప్పెను,—'నేనును అదియే చెప్పుచున్నాను; రాధానాథుఁడు నీహృదయమున నర్ధభాగమును స్వీకరింపనియ్యకొనడు. నీక్షుద్రప్రాణములో నర్ధభాగమును ఆ కృషీ

వల యువకునికి వదలిపెట్టి తక్కిన యర్ధభాగమును తన కుంచుకొనుట కాయనకిష్టములేదు. ఇందుకు ప్రమాణముగ నాకు విజయపాలుఁడు ఉదయపురమునుండి పంపిన యుత్తరమును నీయెదుట పెట్టెదను. చదివి చూచుకొనుము ”

ఈమాటలని విలాసకుమారి పైచెప్పిన యుత్తర మంబాలిక కియ్యక స్వయముగఁ జదువ నారంభించెను.

ఉత్తరము

మేవాడు మహారాణా నా ప్రస్తావమున కంగీకరించెను. ఆయన కుమారుఁడు అమరసింహుఁడు నవీనసన్యాసియగు అంబరరాజకుమారిని పాణిగ్రహణము చేసుకొనుటకు చాల తొందరగానున్న సన్నాహముతో నాథద్వారము వచ్చుచున్నాఁడు. నేనును వానితోఁగూడ చాలసన్నాహముతో వచ్చుచున్నాను.

రాజకుమారితో నిట్లు చెప్పవలెను. నేను ఆమె మెచ్చిన కృషీవల సైనికునిఁ గూడ గలిసికొన్నాను. ఆతనిఁగూడ నేను వెంటదీసుకొని వచ్చుచున్నాను. వాని కొఱకు రాజకుమారి నొక పుష్పమాలను గ్రుచ్చియుంచుమని చెప్పవలెను,

ఇట్లు

కాలాపహాడు అనే విజయపాలుఁడు

అంబాలిక కన్నుల నీరుఁగార్చుచు రాధాశ్యాముని మందిరము వంకఁ జూచుచు నిట్లుపలికెను,—‘సఖి! నీవు చూచెదవుగాక! త్రిదివధాముని యధీశ్వరుఁడగు రాధానాథుని దాసినైన దాస నీ మర్త్యలోకాధీశ్వరునికి సాధ్యమగుదునా?

విలాసకుమారినవ్వుచు నిట్లనెను,—‘చూచెదను. చూచెదను ఆ రోజుదగ్గఱకే వచ్చినది, విశేషదూరములేదు. ఏమి చేసెదవోగా

రాజనందినీ! ఒక్క సారి సెలవైనచో గీతగోవిందమునుండి ఒక్కపాట పాడెదను.

అంబా—ప్రియసఖి! నీవు నన్నిపుడు బాధపెట్టవద్దు. నీ గీత గోవిందము నాకు వద్దు.

ఈమాటలని అంబాలిక కోపమువచ్చి యక్కడనుండి మందిరము లోనికి వెడలిపోయెను.

## 3

నాథద్వారము తెరలిపోవు సమయ మాసన్నమాయెను. రాణా జయసింహుడు చెప్పినమాటసత్యము. ఈ మ్లేచ్ఛదళిత రాజపుత్రైశ్వ ర్యమునందు కేవల మొక్క గజాశ్వములు మాత్రమే మిగిలినవి.

క్షణకాలములో కమలాదేవి యాజ్ఞానుసారము పదివేల తేజోగర్వ ములును రణకుశలములును సుందరములును అగు నశ్వరాజములు సకి లించుచు ప్రాసాదప్రాంగణమునకు వచ్చి నిలువఁబడెను. చూచు చుండగనే వాని తరువాత అయిదువందల భద్రజాతియేనుఁగులు మహా బలిష్ఠములైనవి మెల్లమెల్లగావచ్చి రాజభవనమున కెదుట నిలువఁ బడెను కమలాదేవి కబురు పంపినమీఁదట నామె పుట్టింటివారగు పరమర రాజభవనమునుండి 'దానవదమన' మను గుఱ్ఱమును 'దిగ్గజ' మను ఏనుగయు వచ్చియుండెను. మంచి చురుకైనదియు తేజస్వియు నగు 'దానవదమనము' రత్నహారములను ముత్యాలహారములును వేసుకొని శోభిల్లుచు నడుగుద్రొక్కుచు ప్రాంగణము ముందు సంచ రించుచుండెను. దానితోగూడ పెనుగొండవలెనున్న 'దిగ్గజము' రత్నహారములను ధరించి బంగరు అంబారీతో గంభీరముగ నడచుచు వచ్చి నిలువఁబడెను.

కమలాదేవి పట్టరాని సంతోషముతో ప్రాంగణవైభవమువంక నొక్కసారి చూచి యమరసింహుని పెండ్లికొడుకును జేయుటకు కబురుపంపెను. పిమ్మట మరియొక్క దాదిని మహారాణీ కర్ణావతిని బిలుచుకొనిరమ్మని పంపెను. ఇట్టి యానందోత్సవదినమున మహారాణి కర్ణావతియొక్క తెయు విచారముతో నిండిన మనస్సుతో తన గదియందు కూర్చుండి యొకయుత్తరమును జదువుచుండెను. గతరాత్రి నాథద్వారమునుండి యొకదూత యొక యుత్తరమును దీసికొనివచ్చెను. మహారాణి కొంతసేపటివఱకు మాటలాడకుండ యాలోచించి పిమ్మట యుత్తరమును చదువ నారంభించెను.

రాజపుత్రరాజేశ్వరీ.

తమపుత్రుడు అమరసింహుడు ఒక సన్యాసినిని వివాహము చేసుకొనుటకు చాల సన్నాహముతో నాథద్వారము వచ్చుచున్నాడని విన్నాను. ఈ జన్మదుఃఖిని అంబరిరాజకుమారిక అంబాలిక యెప్పుడు రాధాశ్యాముల చరణముల నాశ్రయించినదో ఆదినమున నింకను ఈ పవిత్రఆశ్రమమునందును మనుష్యు లధికారముండునని స్వప్నమునందును దలంచలేదు. ఈ సంగతిని స్వయముగ మహారాణా జయసింహవల్లభుడే* గృహాధర్మములకు జలాంజలి విడచి సంసారత్యాగినియు సన్యాసియు నగుదానిని రాధానాథుని చరణసేవనుండి బలవంతముగ లాగుకొనిపోవుట కుద్దేశించుచున్నారని, మఱింత యాశ్చర్యమునాకు వేయుచున్నది. కాని త్రిలోకనాథుని దాసి మర్త్యలోకరాజున కూడిగము సేయనేరదు. మీరు మహారాణా వారి యీ దారుణపాపకర్మనుండి యడ్డగింపలేరా? మీకట్లు చేతగానియెడల మీపుత్రుఁ డిచ్చటికి పెండ్లికొడుకై వచ్చినపుడు సన్యాసినీ అంబాలిక రాధావల్లభుని చరణసమీపమున ప్రాణోత్సర్జనను జేయుటనుగాంచి పోగలడు. అందు

చే మిమ్మును వేడుకొనుచుంటిని. యేమన మీకీ నిస్సహాయ పితృమాతృహీనయగునగు నంబాలిక ప్రాణములు రక్షింప దయఁ బుట్టనేని మహారాణావారి నింక నీ వివాహప్రయత్నమును జేయకుండఁ జేయుఁడు!

సన్న్యాసిని అంబాలిక.

మహారాణి కర్ణావతి ఈయుత్తరముచదివి హతాశయై మర్మాహతహృదయయై యేమియుఁదోచక విచారించుచుఁ గూర్చుండెను. ఈ సమయమున తలుపుదెరచుకొని యకస్మాత్తుగఁ గమలావతి గదిలోఁ బ్రవేశించెను. ఆమె అట్లు వచ్చి కమలావతినిఁ జూచియిట్లు తొందర తొందరగాఁ బలుకఁ దొడంగెను,—ఏమిటిది? అక్కా! ఇది నీకు చదువుకొనుటకును వ్రాసుకొనుటకును సమయమా? బాగుగనే యున్నది? పెండ్లికొడుకు ధరించుటకు మా పుట్టినింటినుండి దుస్తులు తెప్పించితిని. వానినింతవఱకు నీవు చూడనేలేదు. చూడవలెనని యున్న యెడల నా వెంట వెంటనే రమ్ము.

కమలావతి జవాబుకొఱకై చూడలేదు. ఆమె జబరదస్తుగా కర్ణావతి బుజము పట్టుకొని నిలువనియ్యకుండ తన గదిప్రక్క కును మోద్యానమునకు లాగుకొనిపోయెను. అక్కడ లెక్కలేనంతమంది మైత్రిదువులు కుమారు నమరసింహుని చుట్టుకొనియుండిరి. కమలాదేవి నవ్వుల విరజిమ్ముచు మొక్కడలేని యానందముతో తన చేతులతో కుమారునికి మహామూల్యరత్నరాజిశోభితకంచుకమును దొడగి పిమ్మట హీరదామఖచితశిరోవేష్టనమును బెట్టి యటుపైన రమణీమండలమును సంబోధించి యిట్లుపన్యసించెను,—'మీ రందఱును చక్కఁగఁ దిలకింపుడు. ఇట్టి భువనమోహనమూర్తిని నీజగత్తులో నింకెక్కడైనఁ నెప్పుడైనఁ గాంచియుంటిరా? నేను చెప్పినమాట సత్యము అంబరరాజకన్య పూర్వజన్మమున నెట్టి తపస్సు చేసి

యున్నందువలన నిట్టి వరుఁడు లభించెను. ఏమి సత్యము కాదా ! కాని నాకింకొక్క కోరిక యున్నది. అదికూడ లభించిన నెంతయో బాగుండెడిది. ఈ ఆనంద సమయమున నా పితృవంశీయ రాజుల గౌరవ ధనమైన 'కోహినూరు' కూడ మా అమరుని పాగాయందు ధరింపఁ జేసిన నా మనోరథము పూర్తియయ్యెడిది ”

కుమార అమరసింహుఁడు మాటలు విని వినయముతో శిరము వంచి తల్లి యాశీర్వాదమును గైకొని యిట్లు ప్రత్యుత్తరమిచ్చెను— అమ్మా ! మీ మనోరథము సఫలమగును గాక ! నేను మీకు కోహినూరు దెచ్చియిచ్చెదను '

## ౪

### ఫకీరుని ప్రస్తావము

కాళిందీతీరమున మసీదులో వృద్ధ ఫకీరు వట్టినేల మీదఁ గూర్చుండెను. ఎదుట దుర్గాదాసు ఒక కంబళిఁ బరచుకొని యందుపై కూర్చుండెను దుర్గాదాసు కన్నులెఱ్ఱవడి యందుండి బాష్పజలంబులు ధార గట్టిపడుచుండెను. ఆతఁడు కన్నీ రద్దుకొనుచు ఫకీరు ముఖమండలము వంక శ్రద్ధతోఁ జూచుచు నిట్లు పలికెను.—'ఇన్ని దినములైన తరువాత, దేవా! మీ నోటినుండి ఇట్టి దారుణ వచనములు వినవలసి వచ్చినది '

ఫకీరు'—నాయనా వీరాగ్రణీ ! విధాతయొక్క సంకల్పముఁ దప్పింప మనుష్యునకు సాధ్యమా ? ఇందుచేతనే రెండుపక్షములకును కొన్ని దినములు యుద్ధ మాపుచేయుట మంచిదని నేను చెప్పితిని. ఈ కొలఁది వర్షముల యుద్ధములో ననేకమంది హిందూవీరులు హత

మైరి. ఇంక నీ రక్తస్రవంతి యింకిపోవలెనని నా కోరిక. దక్షిణదేశము నుండి మీరు తిరిగి రాకముందే శిశురాజగు నజితసింహుడు నా యజ్ఞాతవాస శైలమునుండి యోధపుంగవుల దీసుకొనివచ్చుట లెస్సైనపని యైనది. ఇప్పుడు పోరంగజేబు విషహీనసర్పముభంగి మాఱి పోయెను. ఆ పాప శిశురాజు నింక సిగ్గువృన్నైనను గదలించుటకు సమర్థుడు గాడు. బహుదినములనుండి నిద్రించుచున్న జాతి మేల్కాంచి నది. అసుర రక్తధారచే భారతదేశ వక్షస్థలము రోపిమై పోయి నది. నాకును అంతిమకాలము సమీపించినది. జీవితము సమాప్త మగుటను హింసనాపి వేయుట మంచిది. ఆనందపూర్వకముగ మృత్యుముఖంబునం జొచ్చెదను.

దుర్గాదాసు కన్నులనీరు నిండనట్లు నుడివెను,—'విధాతయొక్క సంకల్ప మిట్లుండెనా? నాకు విశ్వాసము కుదురుట లేదు. అఖిల జగదీశ్వరుడింత దయాహీనుడా? ఇది యాయన మంగళమయ విధానమై యుండునా? అక్కటా! దేవా! చిట్టచివరకు తమ మోము నుండి ఇంత నిష్ఠుర యుపదేశములు వినుట తటస్థించెను? మ్లేచ్ఛా టవీనాశన దీక్షామహావ్రతమున కొక్క నమస్కారము చేసి యూరకుండ వలసిన యెడల నిక దుర్గాదాసింక జీవింపవలసిన యవసరమేమి? సువర్ణ భారతవర్షమింక క్రమక్రమముగ మరల రసాతలమునకు గూలి పోవును గదా. అది జూచి దుర్గాదాసింక నిశ్చింతతో నుండగలడా. అనంత జ్ఞానశాలీ! త్రికాలదర్శీ! మహాయోగీ! మీకే యాదివ్యజ్ఞానము గలదు. మీనిష్ఠురప్రస్తావమును సహింప దుర్గాదాసునకు చేతకా కుండెను!

రాఠోరు సేనాపతి బాలకునిభంగి రోదనము సేయుచు రుద్ధకంఠము తోనిట్లు వాపోవనారంభించెను'—'అమ్మా, భారతభూమీ! అఖిల భువనాధీశ్వరీ! అగణిత దేవతాప్రసూతీ! చతురంబోధి వలయితభూ

మండలశిక్షావిధాయినీ! రఘురామార్జున జననీ! సీతా ద్రౌపదీమహా పతివ్రతామాతృమూర్తీ! వాల్మీకి వేదవ్యాసనిలయమా! నీ వెనుకటి దినములు తిరిగి యెన్నటికి రాఁగలవు!'

ఫకీరు—వీరవరా! ధైర్య మవలంబింపుము. భారతదేశమున నీయంధకారము చిరస్థాయి కానేరదు. ధర్మమూ చరింపుము. పాపక్షయము దానంతటదియే యగును. సమయానుకూలముగ విధాత తన విధానమును ప్రత్యక్షముగునట్లు సేయును. ఆయన సంకల్పము సకల కలంఘ్యము.

దుర్గా—చిత్తము, దేవా! ఆదినములు మనము చూడఁగలమా?

ఫకీరు—నీకు గాన్పించుటలేదా? మహాపాపియగు నౌరంగజేబు తనమూర్ఖతచే తన పాప రాజ్యమును ధ్వంసము చేసుకొనుచున్నాడు. అది త్వరలోనే పూర్తికాఁగలదు. దానవసమాటు దక్కనుకుపోయి తిరిగి తన రాజధానికి వచ్చుట కల్ల. ఆయన తన ప్రభావాత్మకముగు రాజనీతిని భావికాలమునందు నా విస్తీర్ణ భారతఖండ రాజపురుషులకు బోధించినవాఁడగును.

దుర్గా—అట్లైన వందేవులకు సహాయము నిశ్చింతతో చేష్టలు దక్కినానవులకు పరిచర్యసేయుచు కాలము గడుపవలసిన నేనా?

ఫకీరు నవ్వుచు నిట్లు ప్రత్యుత్తరమిచ్చెను,—'అందేవులకు మనము ఇప్పటి పైశాచికశక్తిని విడిచి యాధ్యాత్మిక శక్తి నలవడఁజేసుకొనవలెను. జ్ఞానయోగకర్మయోగములచే నెట్టి జగత్తు వెలుఁగుచున్నదో యట్టి హిందూముసల్మానులిద్దఱును తమ వైరములను మఱచి నిశ్చలమైన కర్మయోగమును భారతభూమియందు ప్రచారము సేయవలెను. ఆ అపూర్వకర్మయోగము నభ్యాసము సేయవలెను. ఆ అనంతభక్తిధాముఁడు అనాదిపురుషుఁడు మహాయోగుల కాదర్శమైన యోగీశ్వరుఁడు ఆయన అధర్మమునకును అత్యాచారమునకును

పరమశత్రువు. నిశ్చయముగాఁ దెలిసికొనుము, అయిన మన పుణ్య వ్రతము లందవశ్యము సాయపడఁగలడు.'

ఈసంభాషణ జరుగుచుండ నరాత్తుగఁ గొంచెము దూరమున వివిధవాయిద్యముల నాదమును బహుసంఖ్యాజనుల కోలహలమును వినవచ్చెను.

దుర్గా—ఇదియేమి? నేడిట్టి విషాదగిరమున నానంద కోలాహలము వినవచ్చుచున్నది. !

ఫకీరు నవ్వుచు నిట్లు బదులుచెప్పెను.—'వత్సా! మనము బహుదినములనుండి నవజీవన సంగ్రామముయొక్క విభీషకసమును రక్తపు తరంగభూమి సంబంధియు విషాదభీషణాభినంబులచే చూచుట కలవాటుపడితిమి తమ్ముడా రమ్ము. కడపటిసారికొక్కసారి నేఁడు ఈ ఆనందోత్సవమునందు పాల్గొందము.

అగణితజనానంద కోలాహలమును వివిధవాద్య గంభీరనాదములును గజాశ్వపదాది ధ్వనులును ఫకీరుని మధురానందమయ కంఠస్వరమును విలీనము చేసుకొనెను విజయసాలుఁడు కూనూర అమర సింహునిఁ జేయుపట్టుకొని పుంగుగా వచ్చి ఫకీరుకు నమస్కరించి దుర్గాదాసునితో నిట్లు పలికెను,—' ఈయనెవరో మీకు తెలియునా? కృషీవలునినుండి యుద్భవించిన రాజకుమారుఁడు. ఓరేప్పుడు నిట్టి చిత్రము నెరిఁగి యుండరు '

౫

తోరణ ప్రవేశము.

నేడు వైరాగ్య వ్రతావలంబకులగు సన్యాసులకు శాంతిమయాశ్రమమగు రాధాశ్యాముని ప్రేమ నికేతనమగు నాథద్వారము ఒక క్షణ

ములో కోలాహలమయ రాజధానిగాఁ బరిణమించెను. నలువైపులను బిక్కటిల్లిన నసంఖ్య సైనికుల మధ్యనొక శతమానమునకు మించిన రత్నశోభితశిరోవేష్టనంబులు శుభ్రశరచ్చంద్రసదృశంబగు చాందినీ క్రింద మెరయుచుండెను అరాత్తుగ నొక్క మోహినీ మంత్రబలంబున సంసారత్యాగులగు విరాగులును తమ చిర సన్యాసంబు విడిచి సాంసారిక కోలాహలమునఁ గలిసి పోయిరేమో యన్నట్లు కాన్పించినది. సంగ్రామవ్రతులగు క్షత్రియయోధులు నేడు తమ సమరప్రాంగణమును ద్యజించి తమ యవనవధాదీక్షను విడనాడి యానందోత్సవమున నోలలాడ వచ్చినట్లు తోచుచున్నది. రాజపుత్రస్థానముయొక్క దాదాపు యావన్మంది రాజలరమణీమణులును వాని దాసదాసీజనంబును ఈ పరిణయమహోత్సవమును జూచుట కరుదెంచిరి. జోధపుర రాజమహిషి యరుంధతీదేవి తన మాతృమందిరమునకు వచ్చిన స్త్రీల సందఱను వెంటఁబెట్టుకొని వచ్చెను. నేడు సమస్తమైన స్త్రీ పురుషుల ముఖమండలముల పైనను ఆనందము తాండవమాడుచుండెను. కాని కేవల మొక్క నవీనసన్యాసిని మాత్ర మీనాటి కోలాహలమునుండి బహుదూరము పాఱిపోయి యొంటరిగ నేటియొడ్డునఁ గూర్చుండి వెక్కి వెక్కి యేడ్చుచుండెను. ఆమె కన్నీటి ధారలచే జలప్రవాహములో తడసిన గైరికవస్త్రము కమనీయకనకలతనుండి జారినట్లు భూమిపై బడి పొరలుచుండెను. ఆమె ముడివీడిన కేశరాశి యనాదరంబుగ నదీజలమునఁ బడికొట్టుకొని పోవుచుండెను. ఆమె నీలోత్పలనయనంబులనుండి ఖేదించుకొని జలధారలు గురియుచుండెను. ఈ తపస్విని యెవ్వరో పాఠకులకు చెప్పవలసిన యవసరము లేదు. కృషీవల సైనికా! ఈసమయమున నీవు ఒక్కసారి రాజాధిరాజకుమారుని వేషమున వచ్చి అంబర రాజకుమారి యెదుట వచ్చి నిలువఁబడితివేని యెట్టి యభూతపూర్వదృశ్య మగును!

మందిరమున కెదుట కుసుమమాలలును స్తబక దామశోభిత తోరణములును అలంకరింపఁబడెను దాని కొకవైపున కుమార అమరసింహుని విడిదియు రెండవవైపున స్త్రీల యంగణ విడిదియు నేర్పాటయ్యెను. ప్రదోషకాల మాసన్న మగుటతోడనే కొంతమంది రమణీమణు లొక్కచోటఁ గూడిరి వారి చేతులందు కుసుమనిర్మితధనస్సులును కుసుమ బాణంబులు నున్నవి. తోరణములకు రెండవవైపున రాజపురుషులు కవచధారులై యుండ పెండ్లికొడుకు అమరసింహుడు సువర్ణనిర్మితవస్త్రముల ధరించి సువర్ణధనుర్బాణంబులు ధరించి నిలువఁబడి యుండెను. అందఱికంటె ముందు కుమార విజయపాలుఁడుండెను. అంబరరాజ్యములో చాల దినములనుండి ఈ యాచారముండెను. పాణిగ్రహణోత్సవమునకు ముందు పెండ్లికొడుకువైపు వారు కుసుమాయుధలగు రమణీమణులతోఁ బోరాడి యంతఃపురమునఁ బ్రవేశింపవలెను. ఈ యపూర్వనర నారీసంగ్రామమున నొకవైపు సేనాపతి విజయపాలుఁడు రెండవవైపు నాయకురాలు విలాసకుమారి. నారీసేనాని విలాసకుమారి కుసుమకవచమును దొడిగి పుష్పనిర్మిత ధనుస్సును జేఁబూని పుష్పబాణమును సంధించి యుద్ధము సేయ ముందుకు వచ్చెను. విజయపాలుఁడును బురుషులతోఁ గొంచెము ముందుకు వచ్చి పాట యొకటి పాడ నారంభించెను.

పురుషులపాట యైన తరువాత స్త్రీలును ఒక హృదయరంజకమైన పాటఁ బాడ నారంభించిరి. అది ముగిసిన పిమ్మట పెండ్లికొడుకు వారు తమ ఖడ్గముల నొరలం దుంచి ధనుర్బాణములను నేలపైఁ బారవేసి చేతులు జోడించుకొని స్త్రీలతో నిట్లు నుడివిరి,—' సుందరీమణులారా! మేము మీకోడిపోతిమి. మేము మి మ్మంజలి బట్టి వేడుకొనుచున్నాము. మాకు తెరవిండు. ''

అట్టి హాస్యము జరుగుచుండ నా యానందకోలాహలమును నారీ

చమత్కార యుద్ధమును భంగపరచుచు నెవ్వరిదో యేడ్పు వినవచ్చెను. దగ్గఱనున్న యొక స్త్రీ కేక పెట్టి యేడ్చుచు,—'అయ్యయ్యో! కొంపమునిఁగినది. త్వరగా పరుగెత్తుడు. రాజకుమారి అంబాలిక నదిలో బడి కొట్టుకొనిపోయినది.'

ఆనందకోలాహల మొక్కసారిగా నాగిపోయినది. నరనారీయుద్ధము కట్టువడినది. ప్రేమకోలాహలము విషాదహాహాకారముల లోనికి పరిణమించినది! అందఱును మొత్తుకొనుచు నదీతీరమునకు బఱుగెత్తిరి. అంబాలిక పడినచోటు నా స్త్రీ యేడ్చుచు చూపించెను. తరంగిణి యా సుధాంశుబింబాననను బొట్టఁ బెట్టుకొని కలకలనినాదంబుతో నృత్యము సేయుచుండెను. అంబాలిక యెచ్చటున్నదో కాన్పించలేదు.

౬

నాథద్వారమున కర్ధక్రోశము దూరమున బనాసు సైకతమున లతాపత్ర పరివృతమైన నిర్జనోపవనమున మన చిరపరిచితుఁడగు వృద్ధముసల్మాను ఫకీరు స్మృతితప్పి పడియున్న అంబాలికను ఒడిలో పెట్టుకొని కూర్చుండియుండెను. ఆయన యెదుట విలాసకుమారి కన్నుల నీరుఁగార్చుచు నిలిచియుండెను. ఫకీరామెను దలకించి యిట్లనియె,—'బిడ్డా! ఏడువవలదు. భగవంతుని యిచ్ఛ యెట్లుండునో అట్లగును.'

విలాసకుమారి గద్గదస్వరముతో చేతులు జోడించి యిట్లనెను,—'గురుదేవా! ఈ జీవితమనోరథమును దీర్పుఁడు. అంబాలిక ప్రాణమును గాపాడుడు.

ఫకీరు—బిడ్డా! నీ వింత తెలివిగలదానవయ్యు నింత యవివేకముగఁ బ్రవర్తింతువని నే నెన్నడు ననుకొనలేదు. నీ విన్ని దినముల వఱకు అంబరరాజకుమారితో సమరసింహుని వృత్తాంతము నెందుకు దాచి యుంచితివి? నీవు చెప్పియే యుండనియెడల మా కందఱి కిట్టి ఘోరదృశ్యము గాన్పించకుండెడిదిగదా. నీవు నిజముగా సమరసింహు

నీతో నంబాలికకు వివాహము చూడఁగోరుచున్నావా లేదా ?

విలాసకుమారి బిగ్గఱగా నేడ్చుచు నిట్లు జవాబు చెప్పెను—'హా ! దేవా ! ఎంతమాటంటిరి ? ఇన్ని దినముల పిమ్మట నన్ను ద్రోహిగా నెంచితిరా ? అంబాలిక వివాహసమయమున నొక్కసారిగా తన దరిద్రకృషీవలుడు రాజాధిరాజకుమారుఁడైనట్లు చూచిన యీ వత్తు దుఃఖము నొక్కసారి మఱచిపోయి సుఖ మనుభవించెనని ఈ దౌర్భాగ్యురాలు తలంచినది. అకస్మాత్తుగ నవదంపతుల సుఖసాగరమున నోలలాడుటను జూచిన నా జీవనము సఫలమగునని మనసులో నూరట నొందుచుంటిని. ఆ ఆశ నిరాశయగునా ? దేవా ! నా ప్రార్థనఁ గైకొనుము. ఈ క్షుద్రబుద్ధియగు బాలిక యపరాధములు క్షమించి యంబాలికకు ప్రాణదానము సేయుము. దేవా యనుగ్రహింపుము. మీరు ప్రత్యుత్తర మియ్యకున్న నా హృదయము కొట్టుకొనుచున్నది ఈ చిర దుఃఖినియొక్క యిహజీవనపు టేకైకాంతవాంఛ నెఱవేరగా ?

ఫకీరు—బిడ్డా ! దుఃఖింపకుము. నీ సఖి బ్రతుకుట కింక భయము లేదు. విధాత దయవలన మనము సమయములో నిచ్చటఁ జేరుకొంటిమి.

విలాసకుమారి హర్షపూర్వకముగ నిట్లనెను,—"దేవా ! సెలవొసంగుము. ఈ శుభసమాచారము మేవాడ రాజకుమారునకు పోయి వినిపింతును."

ఫకీరు—ఆగు, బిడ్డా ! నిన్ను మఱికొన్ని ప్రశ్న లడుగవలసి యున్నది వానికి జవా బిచ్చిపొమ్ము. నీ భర్తతో నంబాలికను వివాహమైన యెడల నీ కీయిహజన్మములో రతిసుఖము శూన్యమని తెలిసికొనుము. నీకు భావిదశ యెట్లుండునో నాకు స్థిరపరచుటకు వీలు లేకుండున. నా హృదయ మెంతయో వ్యాకుల మొందుచున్నది. విధాతా ! అంతిమసమయమున నా భాగ్యమిట్లయ్యెనా ? నేను నా

చేతులతో నా బిడ్డవంటిదాని సుఖమువిచ్ఛేదము సేయవలసివచ్చెనా! అక్కటా భగవంతుడా!'

విలాసకుమారి ఇంతకు పూర్వ మెప్పుడును ఫకీరు నోటినుండి విచారపు మాటలు వినియుండలేదు. ఆమె యాతని చిరానందమయ ముఖమండలమున నెన్నఁడును విషాద రేఖలు చూడలేదు. విలాస కుమారి మోకాళ్లపై కొరిగి కూర్చుని కరుణాస్వరమున నిట్లనియె,—" 'గురుదేవా! మీరు అంతర్యాములు వారిజనుల మనోవృత్తి మీకు దాఁగియుండఁగలదా! కుమార అమరసింహుఁడు నా స్వామి, నా యిహ జీవనమున ప్రత్యక్షదైవము, నా పరలోకమున కధీశ్వరుఁడు నా యీ తుచ్ఛప్రాణ మాయనకంటె నెక్కుడా? గురుదేవా! తమకు తెలియని దేమున్నది! ఆయన కాలిక్రింద గ్రుచ్చుకొను దర్భనైనఁ దొలగించుటకు నా రక్తము సర్వస్వము మొదల నిచ్చుటకు నా కపరిమిత సంతోషమగును. ఆశీర్వాద మొసఁగుము. నా హృదయేశ్వరున కంబాలికతోఁ బరిణయమగుటను జూచి నే సుఖముయొక్క పరాకాష్ఠాలాభము నొందుదును.'

ఫకీ రాకాశమువంక దృష్టినిగిడించిచూచి చేతులు జోడించుకొని యిట్లనెను,—'దయామయా! నీ కేగోచరము—ఈ పాపతాపమయ జగత్తులో నిట్టి దివ్యసుందరి నెందులకు సృష్టించితివి?

అట్లు పలికి కొంత తడవాతఁడు కండ్లు మూసుకొని చింతించుచుండెను. పిమ్మట కంపితాధరములతో కరుణాస్వరముతో నాయన,— 'బిడ్డా! పొమ్ము. రాజకుమారి ప్రతీక్షించియున్నదని అమరసింహునితో జెప్పిరమ్ము, ఆశీర్వదించుచున్నాను నీకోరిక సఫలమగునుగాక!"

# ౭

## కోహినూరు

నదీతీరమున జిన్నయుపవనమందు సూర్యుని ప్రాతఃకాల కిరణములు ప్రసరించుచు నవ్వుల వెదజల్లుచున్నవి. నదీప్రవాహము కలకలనాదంబుల తోడను పక్షుల కిచకిచ ధ్వనులతోడను ఘనకసైకతము ప్రతి ధ్వనించుచున్నది. ఉష్ణదిక్ప్రభాతమున నందలి చల్లని మందమారుతము సమస్త కుసుమవాసనల జూరగొని యాటు నిటు మెలువులెత్తుచు పవళించియున్న రాజకుమారి అంబాలికయొక్క యలకదామముతో నాటలాడుచున్నవి. అంబాలిక యాపూటను పూర్వనిర్జనోపవనమున నేలమీద నిద్రించుచుండెను. రాజకుమారి నిద్రలో స్వప్నమును దిలకించుచుండెను. ఆమె శోకతాపభారవిముక్తయై మర్త్యలోకమును విడిచి స్వర్గలోకమేగెను. అట సురభూరుహశోభితమై దేవసుందరీగీతంబులచే ప్రతిధ్వనితమై అసంఖ్యాకమణిగణశోభాయమానమై యొప్పరు దేవేంద్ర సభామధ్యమున ఫకీరు తేజోమయరూపమున వెలుంగుచుండెను. ఆయన అంబాలికను జూచినతోడనే మధురవాక్యముల నిట్లనియెను,—'బిడ్డా, రమ్ము. ఇచ్చట విషాదములేదు, వైషమ్యములేదు. వర్ణభేదములేదు, ఇచ్చట పెద్దయు చిన్నయు నొక్కటే. ధనికుడును దరిద్రుడును నొక్కటే. రాజును రైతు నొక్కటే. అందఱకును సమానాధికారము.' అంత నంబాలిక దీర్ఘనిశ్వాసము విడిచి మనస్సులో నిట్లువితర్కించెను,—'అట్టులైన పాపపృథ్వీలోకమును పరిత్యజించి కృషీవలుండు శాంతినికేతనమున కేల రాలేదు.' ఫకీరు బాలిక హృదయమందలి భావమును గ్రహించి మధురస్మితవదనుండగుచునిట్లుజవాబు చెప్పెను,—

'ఇదుగో చూడు, బిడ్డా! పాపనరలోకమును బరిత్యజించి కృషీవలుఁడును ఈ ఆనందధామమున కరుదెంచెను.' రాజకుమారి ఆశ్చర్యపూర్వకముగఁ జూచెను—దేవత లెట్టి సుందరరూపముల వెలుఁగుదురో యట్టి విధమున కృషీవలుఁడు పరిచ్ఛదముల ధరించి యామె కట్టెదుట నిలువఁబడెను. రాజకుమారి ఆశ్చర్య విషాదాభిమానములతో కృషీవలుని నిరసించుచు నిట్లనెను,—'నీ విన్నిదినముల వఱకు నీ ఆనందధామమునకు నన్నేల తీసుకొనిరాలేదు?' కృషీవలుఁ డామె పాదములపైఁ బడి యామె మోమును ముద్దుపెట్టుకొనుచు,—'రాజకుమారీ! క్షమింపుము. ఈ జన్మలో నేను నిన్నింక విడిచిపెట్టను.' పలికెను

అంత నొక్కసారిగ నంబాలికకు నిద్ర మేలుకువ వచ్చెను స్వప్నము సమాప్తమాయెను ఆమె స్మృతి దెచ్చుకొని కన్నులెత్తి చూచెను ఎదుట నెవరు ప్రత్యక్షమైరి? రాజాధిరాజకుమార వేషమున కృషీవలుఁ డొంటరిగానే యామె చరణయుగళముయొద్ద కూర్చుండి యుండెను.

కృషీవలుఁడు,—'రాజనందినీ! క్షమింపుము. ఈ జన్మములో నేను నిన్నింక విడిచిపెట్టను.' అని పలికెను.

అంబాలిక యొక్కసారి కన్నులు మూసుకొని కొంచెముసేపటికి మరలఁ దెరచి జ్ఞానశూన్యవలె నా ప్రేమమయ యమృతమయముఖమును జూడ నారంభించెను. రాజకుమారుఁడుఁ రాజకుమారి చరణపల్లవంబులను ముద్దాడి ఇట్లనెను, 'రాజకుమారీ! క్షమింపుము.'

రాజకుమారి క్షీణస్వరముతో మెల్లమెల్లగా యిట్లనెను,—'మీరిక్కడ కెట్లు వచ్చితిరి? మీ కేమి కోరిక? మీ రెందుకు క్షమింప వేడుచున్నారు? మీరు నా యెడల చేసిన యపరాధ మేమి? మీ మాటలు నా కేమియు నర్థమగుటలేదు.'